# అనాసక్తియోగం

– గాంధీజీ



ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

# అనాసక్తియోగము

మూలం

**గాంధీజీ**

తెలుగుసేత


ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య

శ్రీ పోతరాజు సీతారామారావు



ప్రకాశకులు

గాంధీ సాహిత్య ప్రచురణాలయం

గాంధీ జ్ఞానమందిర్, సుల్తాన్ బజార్

హైదరాబాదు — 500 001

# ప్రకాశకుల నివేదన

"సర్వోపనిషదో గావో దోగ్ధా గోపాల నందనః" అని పెద్దలు చెప్పారు. ఉపనిషత్తులన్నీ ఆవులయితే వాటన్నిటి పాలు ఒకే పాత్రలో పితికి త్రాగే వారికి గోపాలనందనుడు అందిస్తున్నాడని భావము. అందు వల్లనే భగవద్గీతకు ఎనలేని ప్రాముఖ్యత వచ్చింది. భారత దేశంలోనే కాదు, ప్రపంచములోని అన్ని దేశాలవారు దీని ప్రాముఖ్యతను గమనించి తమ తమ భాషల్లోనికి అనువదించుకున్నారు. నిజానికి ఇది ఒక మత గ్రంథం కాదు. సమస్త జనానికి జీవన వేదం.

అయితే ప్రతి సంప్రదాయకర్త తన సంప్రదాయ భావాలకు అనుగుణంగా భగవద్గీతకు వ్యాఖ్యానం చేస్తాడు. ఒక గీతకేకాదు, ప్రస్థాన త్రయానికే వ్యాఖ్యానాలు రచించి భాష్యకారులైనారు. వర్తమానకాలంలో కూడా భారత దేశంలో వెలసిన ప్రముఖులలో అంతాకాకున్నా చాలా మంది గీతను తమకు తోచిన విధంగా వ్యాఖ్యానించారు. వీరందరిలోను లోకమాన్య బాలగంగాధర్ తిలక్‌గారు చేసిన వ్యాఖ్య గీతకు ఒక క్రొత్త మలుపు నిచ్చిందని చెప్పవచ్చు. సన్యాసప్రవృత్తిని బోధించడం గీత ఆశయం కాదని కర్మయోగాన్ని ప్రబోధించటమే గీత ఉద్దేశ్యమని ఆయన తమ వ్యాఖ్యానంలో స్పష్టీకరించారు. తిలక్‌గారి తర్వాత యావద్భారత నాయకత్వాన్ని వారసత్వంగా అంది పుచ్చుకొన్న మహాత్మా గాంధీ, తిలక్‌గారి కర్మయోగాన్నే గీత ఆశయంగా నిర్ధారణచేస్తూ అది నిష్కామ కర్మగా ఉండవలెనని, ఫలితం ఆశించకుండా చూస్తే అకర్మ బంధనం కానేరదని వ్యాఖ్యానించారు. ఈ గీతా వ్యాఖ్యానానికి అనాసక్తి యోగము అని పేరు వచ్చింది.

గాంధీ గారు కేవలం గీతను మధించి దానికి భాష్యం వ్రాయలేదు. వారు గీతను మననం చేసుకొని జీర్ణించుకొని నిత్యజీవితంలో గీతాబోధనను అనుసరించారు. వారికి అనేకపర్యాయాలు క్లిష్టాతిక్లిష్టమైన పరిస్థితుల్లో మార్గదర్శిగా గీత ఉపయోగపడింది. ఈ విషయం ఆయనే స్వయంగా వ్రాశారు. కాబట్టి గీత విషయంలో గాంధీజీ వ్యాఖ్యానం కేవలం వ్యాఖ్యానం మాత్రం కాదు. అది జీవితంలో ఏ విధంగా ఉపయోగపడు

తుందో సామాన్య పాఠకునికి తెలిసే ఒక మార్గదర్శకత్వం. ఈ దృష్టితోనే ఈ గ్రంథాన్ని ప్రతివారు చదువ వలసియున్నది.

మహాత్ముడు రచించిన అనాసక్తి యోగానికి 2, 3 అనువాదాలు తెలుగులో వచ్చినవి. కాని అవి సంక్షిప్తంగా ఉండడంమాత్రమే కాకుండా మూలానికి తగినంత సన్నిహితంగా లేవని అనిపించింది. అందువల్ల ఈ గంథాన్ని తెలుగులో అనువదించవలసిందిగా గాంధీ సాహిత్య ప్రచురాలయం శ్రీ ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య, మరియు శ్రీ సీతారామా రావుగార్లను అర్థించింది. వారిద్దరూ ఉభయభాషల్లోనూ విజ్ఞాతులు. గాంధీ మహాత్ముని ఎడల భక్తి, వారి భావాల యెడల ఆదరణ కలవారు. అనువాదకులు ఇద్దరు చాలా శ్రద్ధతో ఈ అనువాదాన్ని చేశారు. ఈ అనువాదం పూర్తికాకముందే శ్రీ సీతారామరావుగారు ఆకస్మికంగా స్వర్గీయులైనారు. ఇది మాకెంతో బాధ కలిగించింది. వారి ఆత్మకు భగవంతుడు శాంతిని కలిగించుగాక!

ఈ అనువాదాన్ని ఆంధ్రలోకం ఆదరించ గలదని మా విశ్వాసం. త్వరలోనే గీతను గురించిన గాంధీజీ రచనలను గూడా పాఠకులకు అందించవలెనని మా అభిలాష.

ఈ పుస్తక అనువాదకులగు శ్రీ ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య, స్వర్గీయ శ్రీ సీతారామారావు గార్లకు మా హృదయపూర్వక కృతజ్ఞతలు. ఈ పుస్తకాన్ని చక్కగా ముద్రించిన సర్వోదయప్రెస్ కార్యకర్తలకు, ముఖ్యంగా ప్రూఫులు చాలా శ్రద్ధగా దిద్దిన శ్రీ పాతూరి నాగభూషణం గారికి, శ్రీ దివ్యప్రభాకర్ గారికి మా అభినందనలు.

ఇట్లు
కోదాటి నారాయణరావు
కార్యదర్శి

గాంధీ సాహిత్య ప్రచురణాలయం
హైదరాబాదు
ది 1-8-1978

# విజ్ఞప్తి

శ్రీకృష్ణ భగవానుడు బోధించిన భగవద్గీతను అనేక మంది మహామహావులు, పండితులు, మత కర్తలు ముఖ్యముగ శ్రీ శంకరాచార్యులు, శ్రీ రామానుజాచార్యులు, శ్రీ మధ్వాచార్యులు భాష్యములను వ్రాసి, అద్వైత, విశిష్టాద్వైత, ద్వైత సిద్ధాంత పరముగ వ్యాఖ్యానించి తమ తమ సంప్రదాయాలను వ్యాప్తిలోనికి తెచ్చిరి ఆధునిక కాలములో గూడ అనేకమంది భక్తులు, మేధావులు వ్యాఖ్యానములు వ్రాసియున్నారు.

శ్రీ లోకమాన్య బాలగంగాధర్ తిలక్ వ్రాసిన గీతారహస్యమను వ్యాఖ్యానములో భగవద్గీత కర్మయోగమును ప్రతిపాదించుచున్నదని నిరూపించిరి. మహాత్మాగాంధి భగవద్గీత అనాసక్తి యోగమును నిష్కామ కర్మను బోధించుచున్నదని వ్యాఖ్యానించి భగవద్గీతను "అనాసక్తి యోగము" అను పేర ప్రచురించిరి.

1930-31 సంవత్సరములలో వారు ఎరవాడ జైలులో ఉన్నపుడు భగవద్గీతా తాత్పర్యమును "గీతాబోధ" యను పేర ప్రతి అధ్యాయము యొక్క సారాంశమును వ్యాస రూపమున ప్రచురించి యుండిరి. ఆ "గీతా బోధ"ను నేను హిందీ నుండి తెలుగులోనికి అనువదించగా దేశోద్ధారక విశ్వదాత శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు 1932 సంవత్సరములో ప్రచురించిరి.

అనాసక్తియోగమును తెలుగులోనికి అనువదించవలసినదిగా గాంధీ సాహిత్య ప్రచురణాలయం కార్యదర్శి శ్రీ కోదాటి నారాయణరావుగారు నన్ను కోరిరి. ఈ కార్యమునకు యథాశక్తి పూనుకొనుటలో నాకెంతయు ఆనందము చేకూరినది. ఈ కార్యమునకు పూనుకొనుటలో నా యోగ్యతకంటె

భగవద్గీతయందు నాకుగల భక్తి శ్రద్ధలే ముఖ్యకారణములు. నాకీ సదవకాశమును కల్పించిన శ్రీ కోదాటి నారాయణరావుగారికి కృతజ్ఞతాభివందనములు.

అనువాదమును సాధ్యమైనంతవరకు సులభశైలిలో జన సామాన్యమునకు తేలికగ అర్థమగునట్లు ప్రతిశబ్దమును బాగుగ పరిశీలించి ప్రయోగించుటకు ప్రయత్నించితిని. ఈ ప్రయత్నములో మిత్రులు శ్రీ పోతరాజు సీతారామారావుగారు ఎక్కువగా తోడ్పడిరి. ఈ పుస్తకము ప్రచురణ పూర్తికాకముందే వారు దిగవంతులగుట మిక్కిలి విచార కరము. వారి ఆత్మకు నా శ్రద్ధాంజలి.

ఈ పుస్తకమును అనువదించుటలో మాకు భగవద్గీతను నిశితముగ పరిశీలించుటకు అవకాశము కలిగినది. మహాత్ముని అభిప్రాయములను తెలుగులో సులభమగు పదములలో వ్యక్తీకరించుటకు ప్రయత్నించితిమి. మా యీ ప్రయత్నము ఎంతవరకు ఫలించినదీ పాఠకులు నిర్ణయింతురు గాక!

గాంధి మహాత్ముడు ప్రపంచమందలి సమస్తప్రజలకు సర్వ కాలములందు ఆచరణ యోగ్యములయిన కొన్ని పదములకు వ్యాప కార్థములను వివరించియున్నారు. ఉదాహరణకు 'దేవతలు' అనుపదము నకు 'సమస్త భూతము'లనియు అట్టిభూతహితమును కోరిచేయు సేవయే దేవతార్చన అనియు తెలిపియున్నారు. అట్లే 'యజ్ఞము' అనుపదమునకు సాధారణముగ "అగ్నికుండమునందు సమిధలను నేతితో హోమము చేయుట" అను భావముకలదు. కాని మహాత్ముడు యజ్ఞమునకు "పరోప కారము చేయుట, ఒండొరులు సహకారముతో జీవించుట"యను అర్థము చెప్పియున్నారు. అటులనే 'కర్మ' యనగా వేదవిహితమైన పరిమిత కర్మ

కాండ యని సాధారణముగ తలంతురు. కాని కర్మయనగా మానవుడు చేయు ప్రతిపనియు కడకు ఉచ్ఛ్వాసనిశ్వాసములుకూడ కర్మలేయగు ననియు, కర్మచేయకుండ మానవుడు జీవింపజాలడనియు, కనుక కర్మ సన్యాసమనగా కర్మలుమానుట కాదనియు కర్మఫలమును త్యజించుటయే యనియు,నిష్కామకర్మ చేయుటయే అనాసక్తి యోగమనియు, ఇదియే గీతాబోధనయొక్క సారాంశమనియు మహాత్ముడు వివరించి యుండిరి.

మహాత్ముని ఈ భావములను అనువదించుటలో నేను ఎంత వరకు కృతకృత్యులమైనదీ పాఠకులే నిర్ణయింతురుగాక.

"సర్వే జనాః సుఖినోభవంతు"

ఇట్లు
ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య

# ప్రస్తావన

శ్రీ ఆనందస్వామి మొదలగు మిత్రుల ప్రేమపూర్వకమైన ప్రోత్సాహముతో సత్యాన్వేషణ కొరకు "ఆత్మకథ" పేరుతో నా జీవిత చరిత్ర వ్రాయుటకు ప్రారంభించినటులనే భగవద్గీతకును అనువాదము చేయుటకుగూడ మిత్రుల ప్రోత్సాహమే కారణమైనది. సహాయ నిరాకరణోద్యమ కాలములో శ్రీ ఆనందస్వామి నాతో ఇట్లనిరి. "మీరు భగవద్గీతకు అక్కడక్కడ అర్థము చెప్పుచున్నారు. అట్లుగాక మీరు ఒకపర్యాయము భగవద్గీతను పూర్తిగా అనువదించి దానికి వ్యాఖ్యానము వ్రాయుచో మేము చదువుదుము. అప్పుడు మేము గీతయొక్క అర్థము బాగుగ గ్రహించగలుగుదుము. గీతలోని కొన్ని శ్లోకములకు మీరు అహింసాపరముగా అర్థము చెప్పుట నాకు నచ్చుటలేదు."

వారి వాదనలో సారమున్నదని నేను గ్రహించితిని. అవకాశము లభించినపుడు అటులనే గీతను పూర్తిగా అనువదించెదనని వారితో చెప్పితిని. తరువాత నేను కారాగారమునకు వెళ్ళినపుడు అక్కడ నాకు గీతను విశేషముగా అధ్యయనము చేయుటకు తీరిక చిక్కినది. లోకమాన్య శ్రీ బాలగంగాధర్ తిలక్‌గారు రచించిన గీతా రహస్యమను భగవద్గీతా గ్రంథము చదివితిని. అది అపారజ్ఞాననిధి. వారున్వయముగా నాకు ముందుగా మరాఠీ, హిందీ, గుజరాతీ అనువాద గ్రంథములను ప్రేమతో పంపించి మరాఠీ గ్రంథమును చదువజాలనిచో గుజరాతీ గ్రంథమును తప్పక చదువవలసినదిగా కోరిరి. జైలు వెలుపల ఉన్నపుడు వాటిని చదువుటకు నాకు తీరికయే లేకుండెను. జైలులోనున్నపుడు గుజరాతీ అనువాదము చదివితిని. దానిని చదివిన పిమ్మట గీతను గురించిన యింకను ఎక్కువ గ్రంథములు చదువవలయునను కోరికకలిగినది. ఆ పైన గీతను గురించిన అనేక గ్రంథములు చదివితిని.

నేను గీతను గురించి ఎడ్విన్ ఆర్నాల్డు ఆంగ్ల భాషలో రచించిన పద్యానువాదమును ప్రప్రథమముగా 1888-89 సంవత్సరములలో చదివితిని. అటు పిమ్మట గుజరాతీ భాషలో వ్రాసిన గీతానువాదములు చదువ

వలయునను ప్రబలమైన కోరిక కలిగినది. చదివితిని. కాని ఆ పఠనము-నా అనువాదమును పాఠకులకు అందించుటకు ఉపయోగపడజాలకుండెను.

నాకు సంస్కృతజ్ఞానముగూడ స్వల్పమే. గుజరాతీ భాషలో గూడ నేను పండితుడనుకాను. అటువంటప్పుడు నేను గీతానువాదమును చేయుటకు ఎందుకు సాహసించితిని?

భగవద్గీతను నేను అర్థము చేసుకొన్న ప్రకారము నేను-నా సహచరులు కొందరును ఆచరించుటకు నడుచుకొనుటకు నిష్ఠతోను, దీక్షతోను సతతము ప్రయత్నించుటయే నా ఈ సాహసమునకు కారణము. గీత మాకు ఆధ్యాత్మిక గ్రంథము, నిఘంటువు. గీతలో బోధించిన ప్రకారము నడుచుకొనుటలో మేము అపజయములను పొందుతున్నాము. అయినను మా ప్రయత్నమును విరమించలేదు. ఈ అపజయములోనే విజయకిరణాలు ద్యోతకమగుచున్నవి.ఆశాజ్యోతిని చూడగలుగుచున్నాము.ఏ కొద్దిమందిమి గీతార్థమును ఆచరణలో పెట్టుటకు ప్రయత్నించుచున్నామో ఆ అర్థము యిందులో ఉన్నది. ఇంతేకాక అక్షర జ్ఞానము స్వల్పముగానున్న స్త్రీలు, వైశ్యులు, శూద్రులు మొదలగు వారికి సంస్కృతములో నున్న మూల గ్రంథమును చదువుటకు వీలుండదు. వారికి చదువవలయునను కోరిక గూడ ఉండదు. కాని వారికి గీతా సహాయము కావలసియుండును. వారి కొరకై ఈ అనువాదము వ్రాయబడినది. గుజరాతీ భాషలో నాకు ఎక్కువ పాండిత్యము లేకపోయినను నాకున్న జ్ఞానముతోనే గుజరాతీయులకు నాకున్న మూల ధనమును-జ్ఞానమును వారికి అందించవలయునను బలమైన కోరిక వుంటున్నది. కలుషితమైన, అశ్లీల సాహిత్య ప్రవాహములో కొట్టుకొని పోవుచున్న గుజరాతీ జనసామాన్యమునకై హిందూ ధర్మములో అద్వితీయ గ్రంథముగా పరిగణింప బడుచున్న భగవద్గీతయొక్క-ఈ అనువాదము సులభ శైలిలో వ్రాయబడినది. దీనివలన నేటి కలుషిత సాహిత్య ప్రవాహములో కొట్టుకొని పోకుండా ప్రతిఘటించే శక్తి వారికి కలుగు గాక! నా ఈ అనువాదమును గురించి ఇట్లు వ్రాయుటలో గుజరాతీ భాషలో ఉన్న ఇతర అనువాదములను కించపరచు ఉద్దేశ్యములేదు. వాటి

కన్నిటికిని తగిన స్థానముండనే ఉంటుంది. కాని గీతానువాదము చేసిన వారికి ఆచరణానుభవము ఉన్నట్లుగా తోచదు. నా యీ అనువాదమునకు గత 38 సంవత్సరముల ఆచరణానుభవము కలదని చెప్పగలను కనుక ప్రతి గుజరాతీ సోదరుడును, సోదరియు గీతా ధర్మమును ఆచరించ వలయునను కోరికతో దీనిని చదువవలయుననియు, మననము చేయవలయు ననియు నేను కోరుచున్నాను. దీని నుండి శక్తిని పొందగలరని నేను ఆశించుచున్నాను. ఈ అనువాదమును చేయుటలో నా సహచరులు తోడ్పడి నారు. నా సంస్కృత జ్ఞానము స్వల్పమైనందున శబ్దముల అర్థము నాకు నిర్దిష్టముగా తెలియదు. సందేహముగా ఉండెడిది కనుక దీనిని సరి చూడ వలసినదిగ శ్రీ వినోబాజీ, శ్రీ కాకా కాలేల్కారులను, శ్రీ మహా దేవ దేశాయి, శ్రీ మషురువాలా గార్లను కోరియుంటిని. ఈ అనువాదమును వారు చదివి చూచిరి.

ఇప్పుడు భగవద్గీతలోని భావమును గురించి వివరింతును.

క్రీ. శ. 1888-89 సంవత్సరములలో భగవద్గీతను ప్రప్రథమమున చదివితిని. అప్పుడే ఇది చరిత్రాత్మక గ్రంథము కాదనియు, భౌతిక యుద్ధ వర్ణనమను నెపముతో ప్రతి మానవుని హృదయమందు నిరంతరము జరుగుచున్న ద్వంద్వ యుద్ధ వర్ణనయనియు నాకు గోచరించెను. హృదయమందు జరుగు పోరాటమును చిత్తరంజకముగా చేయుటకే ఈ మానుషయోధుల చరిత్ర కల్పింపబడినది. ధర్మమును, గీతను బాగుగా మననము చేసిన పిమ్మట ఈ అభిప్రాయమే స్థిరపడినది. మహా భారతమును చదివిన పిమ్మట ఈ అభిప్రాయమే మరింత దృఢపడినది. మహాభారతమును వ్యావహారికార్థము ప్రకారము ఒక చరిత్రయని తలచను. ఈ అభిప్రాయమునకు ప్రబల కారణము ఆది పర్వమునందే లభించగలదు. పాత్రలను అసామాన్యులుగాను, మానవాతీతులుగాను వర్ణించి వ్యాసుడు ఇది సామాన్య రాజుల చరిత్రయను భ్రమను తొలగించెను. భారతమున వర్ణింపబడిన పాత్రలు చరిత్రాత్మక పురుషులు కావచ్చును. కానివ్యాసుడా పాత్రలను కేవలము ధర్మోపదేశమును చేయుటకే ఉపయోగించెను.

మహాభారతకారుడు భౌతిక యుద్ధావశ్యకతను స్థిర పరచలేదు. యుద్ధమువలన కలుగు అనర్థమునే స్థిరపరచెను. జయము పొందిన వారేడ్చిరి. పశ్చాత్తాప పడిరి. వారికి దుఃఖానుభవముతప్ప మరేమియు మిగులలేదు.

ఈ మహా గ్రంథమున గీత శిరోమణిగా విరాజిల్లుచున్నది. దాని లోని రెండవ అధ్యాయమందు భౌతిక యుద్ధ కౌశలము నేర్పుటకు బదులు స్థితప్రజ్ఞుని లక్షణములు చెప్పబడినవి. భౌతిక యుద్ధముతో స్థితప్రజ్ఞుని కేమియు సంబంధములేదు. ఈ విషయ మాతని లక్షణములను బట్టియే తెలియుచున్నది. సాధారణమైన దాయాదులయొక్క ఉచితానుచితములను నిర్ణయించుటకు గీతవంటి మహా గ్రంథమును వ్రాయుట అనవసరము.

గీతయందలి కృష్ణుడు శుద్ధ సంపూర్ణ జ్ఞానమూర్తి, కల్పిత పురుషుడు. అట్లనిన దేహధారియగు కృష్ణావతారమునకు స్థానములేకపోలేదు. సంపూర్ణ కృష్ణుడు మాత్రము కల్పిత పురుషుడు. సంపూర్ణావతారమని తర్వాత ఆరోపింపబడినది.

అవతారమనగా దేహధారియగు నొక విశిష్టవ్యక్తి. ప్రతిప్రాణియు ఈశ్వరావతారమే; కాని వ్యావహారిక భాషలో ప్రతిజీవుని అవతారమని పిలువము. తమ యుగములో ఎవడందరికంటెను ధర్మపరాయణుడో అతనినే భావిసంతతి భగవదవతారముగ భావించి పూజించును. దీనిలో నాకేమియు దోషము కాన్పింపదు. ఇందువలన ఈశ్వరుని గొప్పతనము నకు లోపమురాదు. సత్యమునకు విఘ్నమాపాదింపదు. "ఆదాము దేవుడు కాదు. కానిదేవుని ప్రతిభకంటె ఆదాము భిన్నుడు కాడు" తమ యుగములో నెవని యందందర కంటెను ధర్మానుష్ఠాన మధికముగ గలదో అతనినే భగవదవతారమని తలచెదరు. ఈ దృష్టితో సంపూర్ణభగవ దవతారముగ కృష్ణుడు హిందూ ధర్మమందగ్రస్థానము నలంకరించి యున్నాడు.

ఈ దృశ్యము మానవుని యున్నతాదర్శ సూచకముగ నున్నది. ఈశ్వర స్వరూపమును పొందినగాని మానవునికి తృప్తియు, శాంతియు

లభించవు. ఈశ్వర స్వరూపమును పొందుటకు ప్రయత్నించుటయే మానవుని నిజమైన ఆదర్శనమును, పురుషార్థమునునై యున్నవి. అదియే ఆత్మ దర్శనము. అన్ని ధర్మ గ్రంథములందలి విషయమును ఆత్మ దర్శనమే. గీతయందలి విషయముగూడ నిదియే. కాని గీతాకారుడీ విషయమును ప్రతిపాదించుటకు గీతను వ్రాసియుండలేదు. కాని ఆత్మార్థికి ఆత్మదర్శన ప్రాప్తికై యొక అద్వితీయ మార్గమును చూపించుటయే గీతయొక్క యుద్దేశ్యము. హిందూ ధర్మములం దక్కడక్కడయున్న విషయములను గీత అనేక రూపములుగ అనేక శబ్దములలో పునరుక్తి దోషము కలిగినను బాగుగ బోధించుచున్నది.

అద్వితయమగు ఈ మార్గము కర్మఫల త్యాగము. కర్మఫల త్యాగమును కేంద్రభావముగ నుంచుకొని గీత రచింపబడినది. శక్తి, జ్ఞానము మొదలగునవి దానిచుట్టు నక్షత్రములవలె గూర్పబడినవి. శరీర ధారికి కర్మము తప్పదు. కర్మము నుండి యెవరును తప్పించుకొనజాలరు. కర్మమును జేసియే తీరవలెను. అయినప్పటికిని శరీరమును దేవమందిరముగ జేసికొని దానిద్వారా ముక్తిని బొందవచ్చును. ఈ విషయము అన్ని ధర్మగ్రంథములందును ప్రతిపాదింపబడినది. ప్రతి కర్మమును దోషయుక్తమైనది. నిర్దోషునకు మాత్రమే ముక్తి లభింపగలదు. కర్మ బంధము నుండి పాపమునుండి తప్పించుకొనుటెట్లో ముక్తిపొందుటెట్లో గీత స్పష్టముగ చెప్పినది. "నిష్కామ కర్మము చేయుము. యజ్ఞార్థము కర్మమును చేయుము. కర్మఫల త్యాగముజేయుము. అన్ని కర్మలను కృష్ణార్పణ బుద్ధితో జేయుము మనోవాక్కాయములను ఈశ్వరునియందు హోమము చేయుము." అని.

అయితే కర్మఫలత్యాగ శక్తి- నిష్కామత మాటలతో కలుగ జాలదు. ఇది కేవలము బుద్ధి కుశలత వలన కలుగదు. ఇది హృదయ మథనమువలననే కలుగును. ఈ త్యాగశక్తి కలుగుటకు జ్ఞానమును సంపాదింప వలయును. ఒక విధమగు శుష్కజ్ఞానము చాల మంది పండితులు సంపాదింతురు. వారు వేదాది గ్రంథములను కంఠస్థము జేయుదురు. కాని వారిలో చాల మంది భోగలాలసులై యుందురు.

జ్ఞానమునకు భిన్నమగు శుష్క-పాండిత్యమునకు ప్రాధాన్యమియ్య గీతాకారుడు జ్ఞానముతోగూడ భక్తిని కలిపి భక్తికే ప్రాధాన్యమొసగెను. భక్తిలేని జ్ఞానము అనర్థ దాయకము. కనుకనే "భక్తి కలిగిన జ్ఞానము తప్పక గలుగును" అని బోధించెను. భక్తి తలనొద్దుట వంటిది. కనుక భక్తుని లక్షణములు స్థితప్రజ్ఞుని వంటివేయని గీతాకారుడు నుడివెను.

గీత చెప్పిన భక్తి అంధ విశ్వాసము కాదు. బాహ్యడంబరమును కాదు. గీతయందు బోధింపబడిన పడవడికిని మూర్ఖుని బాహ్యచారమునకును చాల తక్కువ సంబంధమున్నది. జపమాల అర్ఘ్యము మొదలగు సాధనములను భక్తుడుపయోగించుగాక; కాని ఈ బాహ్య చిహ్నములే భక్తుని లక్షణములు కావు. ఎవడెవనిని ద్వేషింపడో, ఎవడు దయాళుడో, ఎవనికి అహంకార మమకారములులేవో, ఎవనికి శీతోష్ణములు, సుఖ దుఃఖములు సమానములో, ఎవడు క్షమాశీలుడో, నిత్యసంతోషియో, ఎవనికి స్థిరబుద్ధి కలదో, ఎవడు మనోబుద్ధులను ఈశ్వరార్పణము చేసినాడో, ఎవనివలన ప్రజలు భయ భ్రాంతుల నొందరో, ఎవడు నిర్భయుడో, ఎవడు భయ శోక హర్షముల నుండి ముక్తుడో, ఎవడు పవిత్రుడో, ఎవడు కార్యదీక్ష కలవాడైయుండియు నిరభిమానుడో, ఎవడు శుభా శుభములను మానావమానములను, శత్రుమిత్రులను, నిందాస్తుతులను సమానముగ జూచునో, ఎవడు మౌనధారియో, ఎవడు ఏకాంతవాసాభిలాషియో, ఎవనికి నిశ్చయాత్మక బుద్ధిగలదో వాడే భక్తుడు. ఈ భక్తి కోరికలు గల స్త్రీ పురుషుల యందుండుట అసంభవము.

దీనివలన తేలిన సారాంశమేమన జ్ఞానము గలుగుట, భక్తుడగుటయే ఆత్మదర్శనము. ఆత్మ సందర్శనము వేరొకటిగాదు. ఒక రూపాయి నిచ్చి విషమునుగాని, అమృతమునుగాని కొనుటకు వీలైనట్లు భక్తి

జ్ఞానములు బంధనమునకుగాని మోక్షమునకు గాని సమానముగ సాధనము లగుటకు వీలులేదు. సాధన సాధ్యములు ఈ సందర్భమునందు పూర్ణముగా ఒకటియే కాకపోయినను దాదాపు ఒకటియని చెప్పవచ్చును. సాధన యొక్క పరమావధియే మోక్షము. మోక్షమన గీతార్థము పరమశాంతి, నిత్యము, సత్యమునగు ఆనందము.

ఈ విధముగ భక్తి జ్ఞానములను కర్మఫల త్యాగమను నొరపిడి రాతిమీద పరీక్షింపవలెను. లోక వ్యవహారమున శుష్క పండితుడు గూడ జ్ఞానిగ నెంచబడుచున్నాడు. వానివలన సేవనియుగాదు. చేతితో చెంబు అందిచ్చుట గూడ అతని దృష్టిలో కర్మబంధమగును. యజ్ఞ శూన్యుడు లోక సంగ్రహార్థము పనిచేయనివాడు జ్ఞానిగా నెంచబడు చున్నపుడు చెంబందిచ్చుటవంటి అల్పకర్మమునకు స్థానమెట్లుండును?

సామాన్యముగ భక్తుడన బాహ్యాచారి-(బాహ్యాచరణమందు లీనమై యుండి దానినే భక్తియని శుద్ధభావముతో నమ్మును) జపమాలతో జపము చేయువాడని తలచెదరు. సేవచేయుటకైనను జపమాలను వదలిన వ్రత భంగమగునని తలచును. భోజన పానాదులను గ్రహించునపుడే జపమాలను వదలును. తిరుగలిని విసరుటకుగాని, రోగికి సేవచేయుటకుగాని జపమాల నెన్నడును వదలడు.

ఈ రెండు తరగతుల వారికిని గీతలో భగవానుడు స్పష్టముగ బోధించునదేమన "కర్మము చేయకుండ ఎవరును మోక్షమును పొందలేరు. జనకాదులు గూడ కర్మమువలననే జ్ఞానులైరి. నేను గూడ సోమరినై కర్మమును జేయనియెడల లోకము నాశనమగును, ఇక మనుష్యుని విషయమున జెప్పనేల?"

ఒక దృష్టితో జూచిన ప్రతి కర్మము బంధన రూపమైనదను విష యము నిర్వివాదాంశము. రెండవదృష్టితో జూచిన శరీరధారి యిష్టమున్నను లేకున్నను కర్మమును జేయుచునే యుండును. శారీరక, మానసికములగు చేష్టలన్నియు కర్మములే. అయితే కర్మమును జేయుచును మానవుడు బంధ విముక్తుడెట్లగును? నాకు తెలిసినంతవరకు ఈ విషయ సమస్యను గీత పరిష్కరించినట్లు మరియొక గ్రంథము పరిష్కరింపలేదు. గీత చెప్పున దేమన "ఫలాసక్తిని విడిచి కర్మమును జేయుము. అనాసక్తుడవై కర్మ మును జేయుము. నిష్కాముడవై కర్మమును జేయుము" ఈ విషయ మును మఱచుటకు వీలులేనట్లు ఘంటాపథముగ జాటుచున్నది. కర్మమును వదలువాడు పతితుడగును. కర్మమును జేయుచు ఫలత్యాగము చేయువాడు మోక్షమార్గమున పయనించును.

ఫలత్యాగికి ఫలము లభింపదని యర్థము చేయరాదు. అందువలన ఈ యర్థమునకు గీతయందు స్థానమేలేదు. ఫలత్యాగమన ఫల విషయమున ఆసక్తి లేకుండుట. వాస్తవముగ ఫలత్యాగికి వేయిరెట్లధికముగ ఫలము లభించును. గీతయందు చెప్పిన ఫలత్యాగము అపరిమితమగు శ్రద్ధ యున్నదీ లేనిదీ పరీక్షించును. ఎవడు ఫలితమును గురించియే సదా ఆలోచించుచుండునో వాడనేక పర్యాయములు కర్మ (కర్తవ్య) భ్రష్టు డగును. వాడు వ్యాకులము జెందును. అస్థిరుడగును. అధీరుడగును. దాని వలన క్రోధమునకు వశుడగును. చేయరాని దుష్కార్యములు గూడ జేయును. ఒక కర్మమునందుండి మఱియొక కర్మములోనికి రెండవ కర్మమునందుండి మూడవ కర్మములోనికి దిగును. పరిణామమునే చింతించువాని గతి విషయాంధుని బోలియుండును. చివరకు విషయాంధుని వలె సారాసారములను, నీతి అవినీతులను, వివేకమును కోల్పోయి ఫల ప్రాప్తికై తన మనస్సునకుతోచిన సాధనముల నుపయోగించి దానినే

ధర్మమని తలచును, ఫలాపేక్షవలన కలుగు నిట్టి దుష్పరిణామములనుండి తప్పించుకొనుటకు గీతాకారుడు అనాసక్తి అనగా ఫలత్యాగ సిద్ధాంతమును స్థాపించి దానిని మనోరంజకమగు భాషలో లోకమునకు వెల్లడిచేసెను. సాధారణముగ ధర్మార్థములు పరస్పర విరుద్ధములని తలచెదరు. వ్యాపారము మొదలగు లౌకిక వ్యవహారములందు ధర్మమును పాలించుట దుష్కరమనియు, వీనిలో ధర్మమునకు స్థానము లేదనియు, ధర్మము యొక్క ఉపయోగము మోక్ష ప్రాప్తి కొరకేయనియు, ధర్మముచోట ధర్మమును, అర్థముచోట అర్థమును రాణించుననియు సాధారణముగ తలచెదరు. గీతాకారుడీ భ్రమను తొలగించెనని నాయుద్దేశ్యము. మోక్షమునకును వ్యవహారమునకును మధ్యనిటువంటి భేదమును కల్పింపలేదు. మీదు మిక్కిలి ధర్మమునే వ్యవహారమునందు పరిణమింపజేసెను నిత్య వ్యావహారిక జీవనములోనికి రాని ధర్మము ధర్మమే కాజాలదు. ఈ సూచన గీతయందున్నదని నా అభిప్రాయము. అనగా గీతాభిప్రాయ ప్రకారము ఏకర్మములను ఆసక్తి,మమకారములులేకుండ జేయవీలులేదో ఆ కర్మములన్నియు త్యాజ్యములేయని తేలుచున్నది. ఇట్టి సువర్ణనియమము మానవుని అనేక ధర్మ సంకటముల నుండి కాపాడును. ఈ అభిప్రాయాను సారముగ హత్య, అబద్ధము, వ్యభిచారము మొదలగు దుష్కర్మము లన్నియు తమంతట తామే త్యాజ్యములగును. మానవ జీవితము సులభమగును. దాని నుండి శాంతి వెలువడును. ఫలత్యాగమనగ నీ పరిణామ విషయమున అజాగ్రతగా నుండుటయని యర్థము చేయరాదు. సాధన పరిణామముల వివేచన జ్ఞానము కలిగియుండవలసినదే. ఈ వివేకము కలిగియుండియు పరిణామ విషయమున ఆతురత లేకుండ సాధనయందే తత్పరుడై యుండువాడే ఫల త్యాగి.

ఈ దృష్టితో జూచిన గీతోపదేశ మాచరణయందు పెట్టువాడు సత్యాహింసల పాలన చేయవలసియుండునని నాకు గోచరించుచున్నది. ఫలాసక్తి లేని యెడల మానవులకు అసత్యము పలుకుట యందుగాని హింస చేయుటయందుగాని వ్యామోహముండదు. ఏ హింసా కార్యమును గాని పరిశీలించిన యెడల దానికి మూలకారణము-ఆధారము-ఫలాపేక్షయే యని తెలియును. కాని అహింసా సిద్ధాంతమును ప్రతిపాదించుట గీతకు సంబంధించిన విషయముగాదు. గీతా కాలమునకు పూర్వమే అహింస పరమ ధర్మమని తలపబడుచుండెను. అనాసక్తి సిద్ధాంతమును ప్రతిపాదించుటయే గీత యొక్క ముఖ్యోద్దేశ్యము. రెండవ అధ్యాయమునందే ఈ విషయము స్పష్టపడుచున్నది.

గీతకు అహింసా సిద్ధాంతము మాన్యమైన యెడల అనాసక్తి యోగమునందు స్వతస్సిద్ధముగనే అహింస యిమిడియున్న యెడల, గీతాకారుడు భౌతిక యుద్ధమును ఉదాహరణమునకైనను ఎందుకు తీసికొనవలయును? గీతాయుగమందు అహింసా ధర్మము అంగీకరింపబడి యున్నను భౌతికయుద్ధము ఆ కాలమున సర్వసామాన్యమగు విషయమగుటచే గీతాకారునకు ఇట్టి ఉదాహరణమును గైకొనుటయందెట్టి సంకోచము కలుగలేదు. అట్టి సంకోచము కలుగుట కవకాశమును లేదు.

అయితే ఫలత్యాగ మహాత్మ్యమునకు విలువ కట్టుటయందు గీతాకారుని మనస్సునం దేభావముండెనో, అహింసకు హద్దెంతవరకు నిశ్చయించెనోయను నీ విషయములను గూర్చి విచారింపవలసిన అవసరము మనకు లేదు. కవి మహత్తరమైన సిద్ధాంతములను ప్రపంచమునెదుట నుంచును. దీనినిబట్టి యా కవి తాను ప్రతిపాదించిన సిద్ధాంతముల పూర్ణ జ్ఞానము సదా వానికి కలదని గాని. లేక కలిగిన జ్ఞానమంతటిని భాషయందు వ్యక్తీకరింప గలడనిగాని చెప్పవీలులేదు. ఇది

కసంభవమని నాకు గోచరించుచున్నదని నేను వినయపూర్వకముగ మనవి చేయుచున్నాను.

గీత నూతన గ్రంథము గాదు. ఇది మహత్తరమైన ధర్మకావ్యము. దానిలో లోతునకు దిగిన కొలది సుందరములగు క్రొత్త భావములు దొరుకును. గీత జన సామాన్యమునకై రచింపబడినది. ఒకే విషయమనేక విధములుగ జెప్పబడినది. కనుక గీత యందలి మహా శబ్దముల అర్థము యుగ యుగములందును మారుచు, విస్తృతమగుచుండును. గీత యొక్క మూల మంత్రమెన్నటికిని మారజాలదు. ఆ మంత్రమును జిజ్ఞాసువు ఏ విధముగ సిద్ధివిబనయగోరునో యా విధముగ దాని కర్థము గల్పించుకొనును. (అనాసక్తిని పొందుటకు భక్తుడు భక్తిప్రధానమనియు, కర్మయోగి కర్మము ప్రధానమనియు తలచును.)

గీత విధి విషేధములను దెలుపునది గాదు. ఒకనికి విహితమైనది మరొకనికి నిషిద్ధము కావచ్చును. ఒక దేశమందొక యుగమున విహితమైనది మరియొక దేశమున మరియొక యుగమునందు నిషిద్ధము గావచ్చును. అనాసక్తియే విహితము. ఫలాసక్తియే నిషిద్ధము. గీతయందు జ్ఞానము యొక్క మహిమ సురక్షితముగ నున్నది. అయినను గీత బుద్ధిగమ్యముగాదు, హృదయ గమ్యము. అందుచే అది శ్రద్ధావిహీనుల కొరకు కాదు. గీతాకారుడే యిట్లు చెప్పెను.

"తపస్వికాని వానికిని, భక్తుడుగానివానికిని, విననిచ్ఛలేనివానికిని, నన్ను ద్వేషించువానికిని ఈ జ్ఞానమును నీ వెప్పుడును చెప్పకుము."

18 అ. 67 శ్లో.

"ఈ పరమ జ్ఞానమును నా భక్తులకు బోధించువవాడు నా యందు పరమ భక్తిగలవాడై నిస్సందేహముగ నన్నే పొందును."

18 అ. 68 శ్లో.

"ఏ మానవుడు ద్వేషరహితుడై శ్రద్ధాపూర్వకముగ దీనిని వినునో వాడుగూడ మోక్షమును పొంది పుణ్య పురుషులు నివసించెడి శుభలోకమును బొందును.

18. 71 శ్లో.

కౌసాని (హిమాలయము) మోహన్‌దాస్ కరంచందు గాంధీ
ఆషాఢ బ. 2–1966. సోమవారము, 26–6–1923.

అనువాదకుడు :

ఉన్నవ రాజగోపాలకృష్ణయ్య
హింద్‌నగర్ కాలనీ, బంజారాహిల్ (పోస్టు)
హైదరాబాదు - 500 054



# అనాసక్తియోగము

## ఒకటవ అధ్యాయము

## అర్జున విషాదయోగము

జిజ్ఞాసలేనిదే జ్ఞానము కలుగదు. దుఃఖము అనుభవించనిదే సుఖమేదో తెలియరాదు. జిజ్ఞాసులందరికీ ఎప్పుడో ఒకప్పుడు ధర్మసందేహము, హృదయాందోళన కలిగియే తీరును.

1. ధృతరాష్ట్ర ఉవాచ
ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ॥

ధృతరాష్ట్రుడు ప్రశ్నించుచున్నాడు—

సంజయా! ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమునందు యుద్ధము చేయుటకు తలపడిన నా కుమారులు - దుర్యోధనాదులు, పాండురాజపుత్రులు - ధర్మరాజాదులు ఏమి చేసిరి?

వ్యాఖ్య: మోక్షసాధనకు యీ శరీరమే మార్గము కాబట్టి ఇది ధర్మక్షేత్రము. పాపకర్మలవలన, యీ శరీ

రము ఉద్భవించినది. మరల మరల ప్రాపములనే చేయుచున్నది. అందువలన యిది కురు క్షేత్రముకూడా అగుచున్నది. ఈ శరీరంలో ఉన్న ఆసురీ ప్రవృత్తులే కౌరవులు; దైవీ ప్రవృత్తులే పాండవులు. మంచి - చెడు భావాల మధ్య ఘర్షణ జరుగుచుండుట అందరికీ అనుభవ ములో నున్న విషయమే.

2. సంజయ ఉవాచ.

దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా:
ఆచార్యముపసంగమ్య రాజా వచనమబ్రవీత్॥

సంజయుడు జవాబు చెప్పుచున్నాడు—

పాండవుల సేన యుద్ధమునకు సిద్ధముగా నుండుట చూచి దుర్యోధనుడు ద్రోణాచార్యులవారితో యిట్లు చెప్పెను.

3. పశ్యైతాం పాండుపుత్రాణా మాచార్య మహతీం చమూమ్।
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా॥

ఆచార్యా! ద్రుపదరాజ కుమారుడైన బుద్ధిమంతుడును, మీ శిష్యుడును అగు ధృష్టద్యుమ్నునిచే వ్యూహము పన్నబడిన పాండవుల గొప్ప సేనను చూడుడు.

4. అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి।
యుయుధానో విరాటశ్చ ద్రుపదశ్చ మహారథః॥

5 ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్।
పురుజిత్ కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః॥

6. యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః॥

పాండవ సేనలో భీమార్జునులవంటి శూరులు, ధనుర్ధరులు, యుద్ధ విశారదులు కలరు. మరియు మహారథులు యుయుధానుడు (సాత్యకి), విరటుడు, ద్రుపదుడు, ధృష్టకేతుడు, చేకితానుడు, కాశీ రాజు, పురుజిత్తు, కుంతిభోజుడు, శైబ్యుడు మొదలగు పురుష పుంగవులునూ, పరాక్రమ సంపన్నుడైన యుధామన్యుడు, బలాఢ్యుడైన ఉత్తమౌజుడు, సుభద్ర పుత్రుడు అభిమన్యుడు, ద్రౌపదీ పుత్రులందరునూ మహారథులే.

7. అస్మాకంతు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ।
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే।

బ్రాహ్మణోత్తమా! మనపక్షములో ఉన్న ముఖ్యులైన వీరులను, సేనా నాయకులను తమకు తెలియజేయుచున్నాను.

8. భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ కృపశ్చ సమితింజయ।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి ర్జయద్రథః॥

9. అన్యే చ బహవఃశూరాః మదర్థే త్యక్తజీవితాః।
నానాశస్త్ర ప్రహరణాః సర్వే యుద్ధవిశారదాః॥

తమరొకరు, భీష్ములవారు, కర్ణుడు, కృపాచార్యులు, అశ్వత్థామ, వికర్ణుడు, సోమదత్తుని కుమారుడు భూరిశ్రవుడు మొదలగు యుద్ధ విజేతలును, వీరుగాక - వివిధ ఆయుధము లతో యుద్ధము చేయగల అనేకులు సమర్థులైన వీరులు నా కొఱకు ప్రాణముల నర్పించుటకు సిద్ధముగా నున్నారు.

10. అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్।
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్॥

భీష్ములవారి అధీనమందున్న మన సేనా బలము అపూర్ణమైనది. కాని భీమునిచేత రక్షింపబడిన పాండవసేన పూర్ణమైనది.

11. అయనేషు చ సర్వేషు యథాభాగమవస్థితాః:
భీష్మమేవాభిరక్షంతు భవంతః సర్వ ఏవ హి॥

కావున మీరందరూ మీ మీ నియమిత స్థానము లందు నిలచి భీష్మాచార్యులవారిని అన్నివిధములా రక్షించ వలసినదని దుర్యోధనుడు కోరెను.

12. తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః।
సింహనాదం వినద్యోచ్చైః శంఖం దధ్మౌ ప్రతాపవాన్॥

అపుడు కురువృద్ధుడు ప్రతాపవంతుడైన భీష్మ పితామహుడు దుర్యోధనుని అభినందించుచూ సింహ నాదముచేసి శంఖమును పూరించెను.

13. తతః శంఖాశ్చ భేర్యశ్చ పణవానకగోముఖాః
సహసైవాభ్యహన్యన్త స శబ్దస్తుములోఽభవత్॥

అనంతరము కౌరవ సైనికులు శంఖములు, రణ భేరులు, పణవములు, నగారాలు, డోళ్లు, మృదంగములు మున్నగు రణ వాద్యములను ప్రయోగించిరి. వాటి ధ్వనులు భయావహములై వ్యాపించెను.

14. తతః శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ।
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః॥

15. పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః।
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః॥

ఇంతలో శ్వేతాశ్వములను బూన్చిన గొప్ప రథముపై కూర్చుండిన శ్రీ కృష్ణార్జునులు తమ దివ్యశంఖములను పూరించిరి. శ్రీకృష్ణుడు పాంచజన్యమును, దేవదత్తమును ధనంజయుడు (అర్జునుడు)ను, భీషణకార్యము లొనర్చు భీముడు పౌండ్రమను మహాశంఖమును పూరించిరి.

20. అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః।
ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః॥

21. హృషీకేశం తదా వాక్యమిదమాహ మహీపతే।
అర్జున ఉవాచ:—

సేనయోరుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత॥

ఓ ధృతరాష్ట్ర మహారాజా! కపిధ్వజముగల అర్జునుడు యుద్ధసన్నద్ధులైన కౌరవులను చూచి వింటిని సంధించి హృషీకేశునితో - "అచ్యుతా! నా రథమును ఉభయ సేనల నడుమ నిలుపుము."

22. యావదేతాన్నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్।
కైర్మయా సహ యోద్ధవ్యమస్మిన్రణసముద్యమే॥

"ఈ యుద్ధములో పాల్గొనుచున్నవారిని చూచి, నే నెవరితో పోరాడవలసియున్నదో తెలిసికొందును."

23. యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః।
ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధేర్యుద్ధే ప్రియచికీర్షవః॥

"దుష్టబుద్ధియగు దుర్యోధనుని హితము కోరివచ్చిన యోధులను ఒకపర్యాయము చూడనిమ్ము" అని అర్జును డనెను.

సంజయుడు చెప్పుచున్నాడు—

24 ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత ।
సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్ ॥

25 భీష్మద్రోణప్రముఖతః సర్వేషాం చ మహీక్షితామ్ ।
ఉవాచ పార్థ పశ్యైతా న్సమవేతాన్ కురూనితి ॥

రాజా! అర్జునుడు శ్రీకృష్ణునితో ఈ విధముగా అనిన తర్వాత శ్రీకృష్ణుడు భీష్మ ద్రోణులకును యెల్ల రాజులకును యెదుట రెండు సేనల మధ్య భాగమున రథమును నిలిపి, "ఓ అర్జునా! యుద్ధరంగమున చేరియున్న ఈ కౌరవులను చూడుము" అనెను.

26 తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్ ।
ఆచార్యాన్ మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్ సఖీంస్తథా॥

27 శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయోరుభయోరపి ।
తాన్సమీక్ష్య స కౌంతేయః సర్వాన్ బంధూనవస్థితాన్ ॥
28 కృపయా పరయావిష్టో విషీదన్నిదమబ్రవీత్ ॥

అక్కడ ఉభయ సేనలలోనున్న వయోవృద్ధులను, తాతను, గురువులను, మేనమామలను, సోదరులను, పుత్రులను, పౌత్రులను, మిత్రులను, మామలను, యితర బంధు వర్గమువారిని అర్జునుడు చూచెను. ఈ బంధువులందరినీ యుద్ధరంగమున చూచి అర్జునుడు దుఃఖించుచు దీన భావములో యిట్లనెను.

అర్జున ఉవాచ :—

28 దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్ ॥

29 సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి ।
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే ॥

అర్జును డనుచున్నాడు—

కృష్ణా! యుద్ధము చేయగోరి ఇచట కూడియున్న యీ బంధువులను చూచి నా అవయవములు పట్టుతప్పు చున్నవి. నోరెండి పోవుచున్నవి. శరీరము వణుకుచున్నది. గగుర్పాటు కలుగుచున్నది.

30 గాండీవం స్రంసతే హస్తాత్త్వక్ చైవ పరిదహ్యతే ।
న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః ॥

గాండీవము చేతినుండి జారిపోవుచున్నది. ఒడలు మండుచున్నది. నిలబడలేకయున్నాను. మనసు భ్రమచెందు చున్నది.

31 నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ ।
న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే ॥

కేశవా! అపశకునములు కనబడుచున్నవి. యుద్ధములో బంధువులను చంపినందువల్ల మేలు చేకూరునని నాకు తోచుటలేదు.

2)

32 న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ ।
కిం నో రాజ్యేన గోవింద కిం భోగైర్జీవితేన వా ॥

కృష్ణా! నేను విజయాన్ని కోరటంలేదు. రాజ్యమును గాని సుఖములనుగాని కోరను. గోవిందా! రాజ్యముతో గాని, భోగములతోగాని ప్రయోజనమేమి? జీవించుట ఎందుకు?

33 యేషామర్థే కాంక్షితం నో రాజ్యం భోగాః సుఖాని చ ।
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాంస్త్యక్త్వా ధనాని చ ॥

34 ఆచార్యాః పితరః పుత్రాస్తథైవ చ పితామహాః ।
మాతులాః శ్వశురాః పౌత్రాః స్యాలాః సంబంధినస్తథా ॥

ఎవరికొఱకు మనము రాజ్యమును, భోగములను, సుఖములను కోరుచున్నామో వారే-గురువులు, తండ్రులు, కుమారులు, తాతలు, మేనమామలు, మామలు, బావమఱదులు, యింకనూ యితర బంధువులు ధన ప్రాణములమీాది ఆశవదలి యుద్ధముచేయ సంసిద్ధులై వున్నారు.

35 ఏతాన్న హంతుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన ।
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే ॥

మధుసూదనా! వీరందరూ నన్ను చంపెదరుగాక, నాకు ముల్లోక రాజ్యములు లభించుగాక, నేను వీరిని చంప

నిచ్ఛగింపను. ఇక చారెడు భూమికొఱకు వీరి నెట్లు చంపు
దును ?

36 నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిః స్యాజ్జనార్దన ।
పాపమేవాశ్రయేదస్మాన్ హత్వైతానాతతాయినః ॥

ఓ జనార్దనా ! ధృతరాష్ట్రుని కుమారులను జంపిన
నాకేమి ఆనందము కల్గును ? ఈ దుర్మార్గులను చంపిన
మనకు పాపమే చుట్టుకొనును.

37 తస్మాన్నార్హావయం హంతుం ధార్తరాష్ట్రాన్ స్వబాంధవాన్
స్వజనం హి కథం హత్వా సుఖినః స్యామ మాధవ॥

మాధవా! కావున మన బంధువులైన దుర్యోధ
నాదులను జంపుట తగనిపని. స్వజనులనే చంపుకొని మన
మెట్లు సుఖపడగలము ?

38. యద్యప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః।
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్॥

39. కథం న జ్ఞేయమస్మాభిః పాపాదస్మాన్నివర్తితుమ్।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దన॥

ఓ జనార్దనా ! వారు లోభగుణమువలన మలిన
మనస్సు కలవారై కుల నాశనమువలన కలుగు దోషము
లను, మిత్ర ద్రోహముచే కలుగు పాపమును గమనింపలేక

పోవుచున్నారు. కాని కుల క్షయమువలన కలుగు దోషము లను తెలిసియున్న మనము ఈ పాపకార్యమునుండి ఏల మఱలకూడదు ?

40. కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాః సనాతనాః।
ధర్మే నష్టే కులం కృత్స్నమధర్మోఽభిభవత్యుత॥

కుల క్షయమువలన సనాతనములగు కుల ధర్మము లన్నియు నశించును. ధర్మము లోపించినందున అధర్మము ప్రబలి కులమంతయు అనాచారమునకు పాల్పడును.

41. అధర్మాభిభవాత్ కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః॥

కృష్ణా! అధర్మము వృద్ధియగుటచే కులస్త్రీలు చెడి పోవుదురు. స్త్రీలు చెడిపోయినందున వర్ణసంకర మేర్పడును.

42. సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ।
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః॥

ఈ వర్ణసంకరమువలన కులఘాతకులకు, వారి కులము నకు నరకము ప్రాప్తించును. అపుడు పితృదేవతలు పిండోదకాది క్రియలు (శ్రాద్ధతర్పణ కర్మలు) లోపించుటచే అధోగతి పాలగుదురు.

43. దోషై రేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః।
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః॥

ఈ వర్ణసంకరమునకు కారకులైన కులఘాతక దోషములచే సనాతన జాతి ధర్మములు, కులాచారము నశించుచున్నవి.

44. ఉత్పన్న కులధర్మాణాం మనుష్యాణాం జనార్దన।
నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమ॥

ఓ జనార్దనా! కులధర్మములు నశించిన మానవుల తప్పక నరకవాసము కలుగునని వినుచున్నాము.

45 అహో బత మహాత్పాపం కర్తుం వ్యవసితా వయమ్।
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజనముద్యతాః॥

అయ్యో! ఎంత దుఃఖకరమగు విషయము. మనః మహాపాపము చేయుటకు సిద్ధపడినాము. రాజ్య సుఖమం లోభగుణముచే బంధువులను చంపుటకు పూనుకొన్నావ

46 యది మామప్రతీకారమశస్త్రం శస్త్రపాణయః।
ధార్తరాష్ట్రా రణే హన్యుస్తన్మే క్షేమతరం భవేత్॥

ఆయుధములు పట్టి యెదిరించుట యిష్టములేని నన సాయుధులైన దుర్యోధనాదులు యుద్ధములో చంపిన నాకది శ్రేయస్కరమే కాగలదు.

సంజయ ఉవాచ: —

47 ఏవముక్త్వార్జునః సంఖ్యే రథోపస్థ ఉపావిశత్ ॥
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్నమానసః ॥

సంజయుడు చెప్పుచున్నాడు—

యుద్ధక్షేత్రములో అర్జుని డీ విధముగా అని దుఃఖముచే వ్యాకులచిత్తుడై ధనుర్బాణములను విసర్జించి రథము వెనుక భాగమున కూర్చుండెను.

ఈ విధముగా ఉపనిషదర్థ ప్రతిపాదకము, బ్రహ్మవిద్యా విషయిక యోగశాస్త్రమును, శ్రీ కృష్ణార్జున సంవాదమును అగు భగవద్గీతలోని అర్జున విషాదయోగమను మొదటి అధ్యాయము ముగిసినది.

ఓం తత్సత్.

# రెండవ అధ్యాయము

## సాంఖ్య యోగము

మోహావశమున మానవుడు అధర్మమును ధర్మముగా భావించుచున్నాడు. మోహావశుడై అర్జునుడు స్వ-పర భేదమును సృష్టించుకొనెను. ఈ భేదము మిథ్యయని దేహము వేరు, ఆత్మ వేరని భిన్నత్వమును శ్రీకృష్ణభగవానుడు బోధించుచున్నాడు. దేహముయొక్క అనిత్యత, భిన్నత్వ మును; ఆత్మయొక్క శాశ్వతత్వము, ఏకత్వమును తెలియ పరచుచున్నాడు. మానవుడు పురుషార్థములకు (కర్మచేయు టకు) మాత్రమే అర్హతకలవాడు, కాని ఫలితముల కొఱకు కాదు. కావున అతడు తన కర్తవ్యమును నిశ్చయించుకొని నిశ్చింతగా అందు నిమగ్నుడై యుండవలెను. ఇట్టి కర్తవ్య పరాయణత్వమువలన అతడు మోక్షమును పొందగల్గు చున్నాడు.

సంజయ ఉవాచ :—

1 తం తథా కృపయావిష్టమశ్రుపూర్ణాకులేక్షణమ్ ॥
విషీదన్తమిదం వాక్య మువాచ మధుసూదనః ॥

సంజయుడు చెప్పుచున్నాడు—

ఈ విధముగా కరుణకల్గి దీనుడై వ్యాకులచిత్తుడై

దుఃఖముచే కన్నీరు కార్చుచున్న అర్జునునితో మధుసూదను డిట్లనెను.

శ్రీభగవానువాచ :—

2 కుతస్త్వా కశ్మలమిదం విషమే సముపస్థితమ్ ।
అనార్యజుష్టమస్వర్గ్యమకీర్తికరమర్జున ॥

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు—

అర్జునా ! శ్రేష్ఠపురుషులకు అయోగ్యమైనట్టియు, స్వర్గప్రాప్తికి ఆటంకము కల్గించునట్టి, అపకీర్తిపాలు చేయునట్టి ఈ మోహము ఈ విపత్కర సమయంలో నీ కెక్కడ దాపురించినది ?

3 క్లైబ్యం మాస్మగమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే ।
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప ॥

పార్థా ! పిరికిపందవు కావలదు. ఇది నీకు శోభస్కరము కాదు. హేయమైన హృదయ దౌర్బల్యమును వదలి ఓ పరంతపా లెమ్ము. సిద్ధముకమ్ము.

అర్జున ఉవాచ :—

4. కథం భీష్మమహం సంఖ్యే ద్రోణం చ మధుసూదన ।
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హావరిసూదన ॥

అర్జునుడు చెప్పుచున్నాడు—

ఓ మధుసూదనా! భీష్మ, ద్రోణులను యుద్ధభూమిలో బాణములచే నే నెట్లు చంపగలను? అరిసూదనా! వీరు పూజనీయులుకదా!

5. గురూనహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్యమపీహ లోకే।
హత్వార్థ కామాంస్తు గురూనిహైవ
భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్

మహానుభావులైన గురుజనులను చంపుటకంటె ఈ లోకంలో భిక్షాన్నం తినటం మేలు. ఎందుకనగా - గురుజనులను చంపినందువల్ల రక్తంతో కూడిన అర్థకామ రూపములగు భోగములే అనుభవించుటకు మిగులునుగదా!

6. న చైతద్విద్మః కతరన్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః।
యానేవ హత్వా న జిజీవిషామ
స్తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః॥

మనము వారిని జయింపవలెనా? లేక వారు మనలను జయించుటయా? ఈ రెంటిలో ఏది మంచిదో నాకు తెలియకున్నది. ఎవరిని చంపి నేను జీవించ తలచుటలేదో ఆ ధృతరాష్ట్ర పుత్రులు యెదురుగా నిల్చియున్నారు.

7. కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసంమూఢచేతాః।
యచ్ఛ్రేయః స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్॥

పిరికితనముచే నా ప్రవృత్తి దెబ్బతినిపోయినది. నేను కర్తవ్య మూఢుడనైనాను. అందుచే నాకు హితము దేని యందు కలదో దానిని నిశ్చయముగా బోధింప ప్రార్థించు చున్నాను. మీ శిష్యుడను; మీ శరణు జొచ్చితిని. నాకు మార్గము చూపింపుడు.

8. న హి ప్రపశ్యామి మమాపనుద్యాద్
యచ్ఛోకముచ్ఛోషణమింద్రియాణామ్ ।
అవాప్య భూమావసపత్నమృద్ధం
రాజ్యం సురాణామపి చాధిపత్యమ్ ॥

ఈ లోకములో నిష్కంటకమైన ధనధాన్య సమృద్ధ మగు రాజ్యము; దేవేంద్ర పదవి లభించినను అవి ఇంద్రి యములను శుష్కింపజేయు నాయీ దుఃఖమును తొలగించు నదిగా నాకు కనుపించుటలేదు.

సంజయ ఉవాచ:—

9 ఏవముక్త్వా హృషీకేశం గూడాకేశః పరంతపః
న యోత్స్య ఇతి గోవిందముక్త్వా తూష్ణీం బభూవ హ॥

సంజయుడు చెప్పుచున్నాడు—

ఓ రాజా! శత్రు భీకరుడగు అర్జునుడు (గుడాకేశుడు) గోవిందునితో (హృషీకేశునితో) "కృష్ణా! నేను యుద్ధము చేయను" అని చెప్పి మౌనము వహించెను.

10. తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత।
సేనయోరుభ యోర్మధ్యే విషీదంతమిదం వచః॥

రాజా! రెండుసేనలమధ్య నిరుత్సాహపడి కూర్చున్న అర్జునునితో నవ్వుచూ శ్రీకృష్ణుడు యిట్లనెను.

శ్రీభగవానువాచ :—

11. అశోచ్యానన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే।
గతాసూనగతాసూంశ్చ నానుశోచంతి పండితాః॥

శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు—

నీవు శోకింపతగని విషయమై శోకించుచున్నావు, పండితునివలె మాట్లాడుచున్నావు. కాని పండితులు చనిపోయినవారిని గురించిగాని బ్రతికియున్నవారిని గురించిగాని దుఃఖింపరు.

12. న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః।
న చైవ న భవిష్యామః సర్వే వయ మతఃపరమ్॥

ఎందుకనగా నిజము గమనించినట్లయితే నేనును, నీవును, ఈ రాజులును ఒకపుడు లేకుండుటగాని, యిక ముందు లేకపోవుటకాని జరుగదు.

13. దేహినోఽస్మిన్ యథా దేహే కౌమారం యౌవనం జరా।
తథా దేహాంతరప్రాప్తిర్ధీర స్తత్ర న ముహ్యతి॥

దేహధారికి యీశరీరమందు బాల్యము, యౌవనము, ముసలితనము కలుగుచున్న విధముననే మరొక శరీరము కూడా లభించును. కనుక తెలిసిన పండితుడు దీనిని గురించి (మరణము గురించి) భ్రమపడడు.

14. మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః।
ఆగమాపాయినోఽనిత్యాస్తాం స్తితిక్షస్వ భారత॥

ఓ కౌంతేయా! ఇంద్రియముల స్పర్శ చలి - వేడి సుఖము - దుఃఖములను కలిగించును. అవి అనిత్యములు - అవి వచ్చి పోవుచుండును. వాటిని సహింపుము.

15. యం హి న వ్యథయన్త్యేతే పురుషం పురుషర్షభ।
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే॥

ఓ పురుషశ్రేష్ఠా! సుఖ దుఃఖములందు సమబుద్ధితో మెలగు బుద్ధిమంతుడైన పురుషుని యీ విషయములు వ్యాకులపరచవు. అతడే మోక్షమునకు అర్హుడగుచున్నాడు.

16. నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః।
ఉభయోరపి దృష్టోఽ న్త స్త్వనయో స్తత్త్వదర్శిభిః

అసత్తుకు ఉనికి లేదు (అ_స్తిత్వము లేదు) సత్తుకు నాశము లేదు. త త్త్వజ్ఞానులు ఈ రెంటియొక్క నిర్ణయమును తెలిసికొన్నారు.

17 అవినాశితు తద్విద్ధి యేన సర్వమిదమ్ తతమ్ ।
వినాశమవ్యయస్యాస్య న కశ్చిత్కర్తుమర్హతి ॥

ఈ సమస్త జగత్తు దేనిచే వ్యాపింపబడియున్నదో ఆ పదార్థము (ఆత్మ) నాశములేనిదిగా తెలిసికొనుము. ఈ అవ్యయమైన పదార్థమును ఎవరునూ నాశనము చేయలేరు.

18 అంతవంత ఇమే దేహా నిత్యస్యోక్తాః శరీరిణః ॥
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత ॥

అర్జునా! దేహి (ఆత్మ) నిత్యమయినది, అనంతమయినది. అది నశించిపోవునది కాదు. కాని అది ధరించు దేహములు నశించుపోవును. కనుక అర్జునా! నీవు యుద్ధము చేయుము.

19 య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతమ్ ।
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే ॥

దీనిని చంపునదిగాను, చంపబడునదిగాను భావించు వారు ఉభయులునూ తెలియనివారే. ఇది (ఆత్మ) చంపునదియూ కాదు, చంపబడునదియూ కాదు.

20 న జాయతే మ్రియతే వా కదాచి-
న్నాయం భూత్వా భవితా వా నభూయః ।
అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే ॥

ఇది పుట్టుటలేదు, గిట్టుటయూ లేదు. ఇది ఎల్లప్పుడూ వుండినదే; భవిష్యత్‌లోనూ వుండును. ఆత్మ పుట్టుక లేనిది, నిత్యమైనది, శాశ్వతమైనది, సనాతనమైనది. శరీరము నశించినను ఆత్మకు నాశము లేదు.

21 వేదావినాశినం నిత్యం య ఏనమజమవ్యయమ్ ।
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతికమ్ ॥

ఓ పార్థా! ఏ పురుషుడు ఈ ఆత్మను అనశ్వరముగను, నిత్యమైనదిగను, పుట్టుక లేనిదిగను, అవ్యయమైనదిగను భావించునో అతడు ఎవరిని ఎట్లు చంపగలడు? చంపించగలడు?

22 వాసాంసి జీర్ణాని యథా విహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి ।
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ ॥

మానవుడు యే విధముగా జీర్ణవస్త్రములను త్యజించి కొత్తవాటిని ధరించుచున్నాడో అటులనే ఆత్మశిథిలమైన దేహమును వదలి కొత్తశరీరమును పొందుచుండును,

23. నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః।
న చైనం క్లేదయన్త్యాపో న శోషయతి మారుతః॥

దీనిని (ఆత్మను) శస్త్రములు ఛేదింపజాలవు. నిప్పు కాల్చలేదు, నీరు తడుపజాలదు, గాలి శోషింప చేయలేదు.

24. అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమక్లేద్యోఽశోష్య ఏవ చ।
నిత్యః సర్వగతః స్థాణురచలోఽయం సనాతనః।

ఇది (ఆత్మ) ఛేదింపబడజాలదు, కాల్పబడజాలదు, తడుపబడజాలదు, యెండించుటకు వీలుకాదు. ఇది నిత్యమైనది, సర్వవ్యాప్తమైనది, స్థిరమైనది, అచలమైనది, అనాదియైనది.

25. అవ్యక్తోఽయమచిన్త్యోఽయమవికార్యోఽయముచ్యతే।
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితుమర్హసి॥

అంతయేగాక ఇది ఇంద్రియములకు, మనస్సునకు అగమ్యమైనది. వికారరహితమని చెప్పబడినది. కావున దీని యదార్థమును తెలిసికొని శోకింపతగదు.

26 అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్
తథాపి త్వం మహాబాహో నైనం శోచితుమర్హసి॥

అర్జునా ! నీవు దీనిని (ఆత్మను) నిత్యము పుట్టునది గాను, గిట్టునదిగాను భావించి నప్పటికీ నీవు శోకించుట తగదు.

27 జాతస్య హి ధ్రువో మృత్యుర్ధ్రువం జన్మ మృతస్య చ ।
తస్మాదపరిహార్యేఽర్థే న త్వం శోచితుమర్హసి ॥

పుట్టినవానికి చావు తప్పదు, చచ్చినవానికి పుట్టుక యునూ తప్పదు. అట్టి అనివార్యమైన విషయమునందు శోకించుట నీకు తగదు.

28 అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత ।
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరిదేవనా

ఓ అర్జునా! భూతజాలముల పుట్టుకకు పూర్వపుస్థితి యును మృత్యువునకు తరువాత స్థితియు గోచరము కాజాలదు కదా! అది అవ్యక్తము. మధ్యస్థితి మాత్రమే తెలియుచున్నది. ఇందు చింతించవలసిన పనియేమి ?

వ్యాఖ్య : భూతజాలమనగా స్థావర జంగమ సృష్టి.

29 ఆశ్చర్యవత్పశ్యతి కశ్చిదేన –
మాశ్చర్యవద్వదతి తథైవ చాన్యః ॥
ఆశ్చర్యవచ్చైనమన్యః శృణోతి
శ్రుత్వాప్యేనం వేద న చైవ కశ్చిత్ ॥

ఒకడు దీనిని (ఆత్మను) వింతగా చూచును. మరి యొకడు వింతగా వర్ణించును. ఇంకొకడది ఆశ్చర్యకరమగు విషయమువలె వినును. కాని ఏ రెవరునూ దానిని తెలిసి కొనజాలకున్నారు.

30 దేహీ నిత్యమవధ్యోఽయం దేహే సర్వస్య భారత ॥
తస్మాత్సర్వాణి భూతాని న త్వం శోచితుమర్హసి ॥

ఓ అర్జునా! అందరి దేహములలో నివసించు యీ దేహధారియగు ఆత్మ నిత్యము, అవధ్యము. అందుచే భూతజాల విషయమై శోకించుట నీకు తగదు.

వ్యాఖ్య : ఇంతవరకు శ్రీ కృష్ణుడు బుద్ధిని ఉపయోగించి ఆత్మయొక్క నిత్యతను, దేహముయొక్క అనిత్యతను విశదీకరించినాడు. ఒకవేళ యే పరిస్థితిలో నైనా దేహమును నశింపజేయుట ఉచితమని భావించిననూ, స్వజనులు-పరివారమని భావించి కౌరవులు తనవారే అని యెంచి వారిని చంపుట యెట్లు అని తలచుట మోహజనితమైనదని చెప్పి, ఇపుడు క్షత్రియ ధర్మమన నేమో అర్జునునకు బోధించుచున్నాడు.

31 స్వధర్మమపి చావేక్ష్య న వికంపితుమర్హసి ।
ధర్మ్యాద్ధి యుద్ధాచ్ఛ్రేయోఽన్యత్క్షత్రియస్య న విద్యతే ॥

స్వధర్మాన్నిబట్టి చూచినా నీకు యీ సంకోచము తగదు. ఎందుచేతననగా ధర్మయుద్ధమునకంటె క్షత్రియునకు శ్రేయస్కరమైనది మరియొకటి లేదు.

32 యదృచ్ఛయా చోపపన్నం స్వర్గద్వారమపావృతమ్ ।
సుఖినః క్షత్రియాః పార్థ లభంతే యుద్ధమీదృశమ్ ॥

ఓ పార్థా! స్వర్గ ద్వారములు తెరువబడి యున్నవా అనునట్లు స్వతస్సిద్ధముగ ప్రాప్తించిన ఈ ధర్మయుద్ధము అదృష్టవంతులగు క్షత్రియులకు మాత్రమే లభించును.

33 అథ చేత్త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి ।
తతః స్వధర్మం కీర్తిం చ హిత్వా పాపమవాప్స్యసి ॥

ఒకవేళ నీవు ఈ ధర్మయుద్ధము చేయకుందువేని స్వధర్మమును కీర్తిని పోగొట్టుకొని పాపమును పోగుచేసి కొన్నవాడవగుదువు.

34 అకీర్తించాపి భూతాని కథయిష్యంతి తేఽవ్యయామ్॥
సంభావితస్య చాకీర్తిర్మరణాదతిరిచ్యతే ॥

అందరూ నిన్ను నిరంతరము నిందించుచునే యుందురు. మర్యాదగల పురుషునకు అపకీర్తి మరణము కంటెనూ చెడ్డది.

35 భయాద్రణాదుపరతం మంస్యంతే త్వాం మహారథాః ।
యేషాం చ త్వం బహుమతో భూత్వా యాస్యసి లాఘవమ్ ॥

ఏ మహారథులందరూ నిన్ను గౌరవించినారో వారే నిన్ను భయముచేత యుద్ధభూమినుండి పారిపోయితివని తలచి నీచునిగా భావింతురు.

36 అవాచ్యవాదాంశ్చ బహూన్వదిష్యంతి తవాహితాః ।
నిందంతస్తవ సామర్థ్యం తతో దుఃఖతరం ను కిమ్ ॥

మరియు నీ శత్రువులు నీ బలమును నిందించుచూ అనరానిమాటలందురు. ఇంతకంటె మించిన దుఃఖకరమైన విషయము ఏమి ఉండును ?

37 హతో వా ప్రాప్స్యసి స్వర్గం జిత్వా వా భోక్ష్యసే మహీమ్ ।
తస్మాదుత్తిష్ఠ కౌంతేయ యుద్ధాయ కృతనిశ్చయః

ఒకవేళ యుద్ధమున నీవు చంపబడిననూ నీకు స్వర్గము లభించును. గెలిచినచో రాజ్యసుఖములను అనుభవింతువు. అందుచే కౌంతేయా ! యుద్ధమునకు సిద్ధమై నిలబడుము.

వ్యాఖ్య : ఈ విధముగా శ్రీకృష్ణ భగవానుడు ఆత్మయొక్క నిత్యతను దేహముయొక్క నశ్వరతను తెలిపినాడు. సహజముగా ప్రాప్తించిన యుద్ధము చేయుటలో క్షత్రియునకు ధర్మహాని కలుగదని బోధించినాడు. శ్లోకము 31 నుండి 37 వ శ్లోకము

నరకు భగవంతుడు పరమార్థముతోపాటు ఐహిక ప్రయోజనమునుకూడ సమన్వయపరచి వివరించినాడు. ఇంత విశదీకరించిన పిమ్మట భగవానుడు గీతోపదేశముయొక్క సారాంశమును తర్వాత శ్లోకములో చెప్పుచున్నాడు.

38 సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ।
తతో యుద్ధాయ యుజ్యస్వ నైవం పాపమవాప్స్యసి॥

సుఖదుఃఖములను జయాపజయములను సమానముగా భావించి యుద్ధము చేయుటకు సంసిద్ధుడవుకమ్ము. అపుడు నీకు పాపము తగులదు.

39 ఏషా తేఽభిహితా సాంఖ్యే బుద్ధిర్యోగే త్విమాం శృణు।
బుద్ధ్యా యుక్తోయయా పార్థ కర్మబంధం ప్రహాస్యసి॥

అర్జునా ! నేను నీకు సాంఖ్య సిద్ధాంతము (తర్కశాస్త్రము) ననుసరించి నీ కర్తవ్యమును తెలియపరచినాను. ఇప్పుడు దానిని యోగసిద్ధాంతము ననుసరించి తెలియపరచుచున్నాను, వినుము. దీని నాశ్రయించినందువలన నీవు కర్మబంధములను త్రెంచుకొనగలవు.

40 నేహాభిక్రమనాశోఽస్తి ప్రత్యవాయో న విద్యతే।
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ॥

ఈ యోగము (కర్మ) ప్రారంభించినదానికి నాశము లేదు. దుష్పరిణామము కలుగదు. ఈ కర్మయోగము ఏ కొంచె మాచరించినను మహత్తరమైన సంసార భయము నుండి కాపాడును.

41 వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునందన।
బహుశాఖా హ్యనంతాశ్చ బుద్ధయోఽవ్యవసాయినామ్॥

ఓ కురునందనా! యోగనిష్ఠ కలవాని బుద్ధి నిశ్చయాత్మకమై ఒకేవిధముగా నుండును. కాని నిశ్చయము లేనివారి బుద్ధులు అనేక శాఖలుగ అనంతములై యుండును.

వ్యాఖ్య: ఏకాగ్రబుద్ధి అనిశ్చలబుద్ధిగా మారినపుడు విషయవాసనగా పరిణమించుచున్నది. కనుక బుద్ధులనగా విషయవాసనలనియే తాత్పర్యము.

42 యామిమాం పుష్పితాం వాచం ప్రవదంత్యవిపశ్చితః।
వేదవాదరతాః పార్థ నాన్యదస్తీతివాదినః॥

43 కామాత్మానః స్వర్గపరా జన్మకర్మఫలప్రదామ్।
క్రియావిశేషబహుళాం భోగైశ్వర్యగతిం ప్రతి॥

44 భోగైశ్వర్యప్రసక్తానాం తయాపహృత చేతసామ్।
వ్యవసాయాత్మికా బుద్ధిః సమాధౌ న విధీయతే॥

మిథ్యా వేదాంతులు, "ఈ ప్రపంచముగాక మరొకటి లే"దనువారు, కామవాసనలుకలవారు, స్వర్గ సుఖములు

శ్రేష్ఠమని తలచువారందరూ జన్మమరణములనే ఫలితముగా ఇచ్చునట్టియు, భోగైశ్వర్యములను పొందుటకై చేయబడు కర్మలను గురించి విశేషముగా వర్ణించి చెప్పెదురు. భోగ-ఐశ్వర్యములందు ఆసక్తిగల వీరి బుద్ధి నశించపోవును. వీరి బుద్ధి పరిపరి విధముల పోవునేగాని ఏకాగ్రమై సమాధి నిష్ఠయందు స్థిరముగా ఉండజాలదు.

వ్యాఖ్య : పై మూడు శ్లోకములలో యోగశాస్త్రమునకు విరుద్ధమైన కర్మకాండ లేక వేదశాస్త్రమును గురించి చెప్పబడినది. కర్మకాండ లేక వేద శాస్త్రం అంటే - ఫలితములను సమకూర్చునట్టి అసంఖ్యాకములైన క్రియలే. ఈ క్రియ లన్నియు వేద రహస్యములకు, వేదాంతమునకు భిన్నముగా నుండి అల్పఫలితములను మాత్రమే యిచ్చుటచే ఇవి నిష్ప్రయోజనములు.

45 త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున ।
నిర్ద్వన్ద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్ ॥

అర్జునా ! వేదములు సత్త్వరజస్తమములను త్రిగుణములను చర్చించుచున్నవి. నీవు ఈ త్రిగుణములకు అతీతుడవుకమ్ము. సుఖదుఃఖాది ద్వంద్వముల నుండి ముక్తి పొందుము. పరమమైన నిత్యసత్యమునందే స్థిరుడవైయుండుము. ఏ వస్తువుగాని సంపాదించి దానిని సంరక్షించుకొను తగులాటమునందు చిక్కుపడకుము. ఆత్మపరాయణుడవు కమ్ము.

46 యావానర్థ ఉదపానే సర్వతః సంప్లుతోదకే ।
తావాన్సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః ॥

నీటితో నిండియున్న బావి వలన కలుగు ప్రయోజనములన్నియు ఇతర సరస్సులనుండి కూడ పొందవచ్చును. అటులనే వేదములయందున్న విషయములను జ్ఞానియగు బ్రహ్మవేత్త ఆత్మానుభవమువలన పొందుచున్నాడు. (తెలిసికొనుచున్నాడు)

47 కర్మణ్యేవాధికారస్తే మా ఫలేషు కదాచన ।
మాకర్మ ఫలహేతుర్భూర్మాతే సంగోఽ స్త్వకర్మణి ॥

కర్మచేయుటయందే నీ కధికారమున్నది. దానివలన లభించు ఫలితములయందు నీకేమాత్రము హక్కు లేదు. కర్మ ఫలము నీకొఱకుగాదు. కర్మచేయనక్కరలేదను భావము కూడ నీకు కలుగకూడదు.

48 యోగ స్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనుంజయ
సిద్ధ్యసిద్ధ్యోః సమో భూత్వా సమత్వం యోగ ఉచ్యతే ॥

ధనంజయా ! ఆసక్తిని విడచి యోగివై - అనగా ఫలితము కలిగిననూ కలుగకున్నను సమభావముతో కర్మ చేయుము. ఈ సమభావమే యోగమనబడుచున్నది.

49 దూరేణ హ్యవరం కర్మ బుద్ధియోగాద్ధనంజయ ।
బుద్ధౌ శరణమన్విచ్ఛ కృపణాః ఫలహేతవః ॥

ఈ సమబుద్ధితో చేయబడుకర్మతో పోల్చిచూచిన కామ్యకర్మ నికృష్టమైనది. కనుక నీవు సమబుద్ధినే అలవరచు కొనుము. ఫలాపేక్షతో కర్మచేయువారు దీనులు, దుఃఖ భాజనులు అగుదురు.

50 బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే ।
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్ ॥

బుద్ధికలిగి అనగా సమభావము గల పురుషునకు పాపపుణ్యములు అంటవు. అందుచే నీవు సమత్వమునకై ప్రయత్నించుము. సమభావమునందే కర్మ కుశలత గలదు.

51 కర్మజం బుద్ధియుక్తా హిఫలం త్యక్త్వా మనీషిణః ।
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయమ్ ॥

సమబుద్ధి కలవారు కర్మల వలన లభించెడి ఫలమును త్యజించుటచే జన్మబంధముల నుండి ముక్తులగు చున్నారు. మరియు నిష్కళంక పదము=మోక్షమును పొందుచున్నారు.

52 యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి ।
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ ॥

నీ బుద్ధి మోహాపంకము నుండి క్షాళితమైనప్పుడు వినిన విషయమునందు వినవలసిన దానియందు నీకు నిర్లిప్త భావమేర్పడును.

53 శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా ।
సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి ॥

అనేక విధములైన సిద్ధాంతములను విని వ్యగ్రత చెందిన నీ బుద్ధి సమాధి నిష్ఠకలిగి నిశ్చలముగా నున్నప్పుడు నీకు సమత్వము కలుగును.

అర్జున ఉవాచ :—

54 స్థితప్రజ్ఞస్య కా భాషా సమాధిస్థస్య కేశవ ।
స్థితధీః కిం ప్రభాషేత కిమాసీత వ్రజేత కిమ్

అర్జునుడు ప్రశ్నించుచున్నాడు—

ఓ కేశవా! స్థితప్రజ్ఞుని లేక సమాధినిష్ఠ గలవాని లక్షణములేవి? ఆ స్థితప్రజ్ఞు డేవిధముగా సంభాషించును? ఎట్లు వ్యవహరించును? అతని నడవడిక ఎట్లుండును?

శ్రీ భగవానువాచ :—

55 ప్రజహాతి యదా కామాన్సర్వాన్పార్థ మనోగతాన్।
ఆత్మన్యేవాత్మనా తుష్టః స్థితప్రజ్ఞస్తదోచ్యతే ॥

శ్రీ కృష్ణభగవానుడు చెప్పుచున్నాడు—

ఓ పార్థా! మానవుడు మనస్సులో కలిగే కోరికలన్నిటినీ త్యజించి ఆత్మద్వారా ఆత్మయందే సంతుష్టుడై నపుడు స్థితప్రజ్ఞుడని చెప్పబడుచున్నాడు.

వ్యాఖ్య : ఆత్మద్వారా ఆత్మయందు సంతుష్టుడగుట యనగా ఆత్మానందమును అంతరంగమందే వెదకుట యని అర్థము. సుఖ-దుఃఖములను కలిగించు బాహ్యవస్తువులను ఆనందమునకు మూలమని భావించకూడదు. ఆనందము సుఖముకంటె భిన్నమైనదని దృష్టియందుంచుకొనవలెను. ధనము లభించినచో సుఖముగా నుండునని భావించుట భ్రమ యగును. అటులనే బిచ్చమెత్తవలసి వచ్చినను, లేక తిండి దొరకనపుడు దొంగతనము మొదలైన ప్రలోభములకు లోనుగాకుండిన కలుగునదియే ఆనందము, అదే ఆత్మ సంతృప్తి.

56 దుఃఖేష్వనుద్విగ్నమనాః సుఖేషు విగతస్పృహః ।
వీతరాగభయక్రోధః స్థితధీర్మునిరుచ్యతే ॥

దుఃఖము కల్గినపుడు శోకింపనివాడు, సుఖము కలిగినపుడు ఉప్పొంగక రాగ - క్రోధ - భయరహితుడుగా నుండువాడు స్థిరబుద్ధిగల మునీశ్వరుడని పిలువబడుచున్నాడు.

57 యః సర్వత్రానభిస్నేహస్తత్తత్ప్రాప్య శుభాశుభమ్ ।
నాభినందతి న ద్వేష్టి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

సర్వత్ర రాగరహితుడై శుభాశుభములను పొందినపుడు సంతోష-విషాదములకు లోనుగాకుండువాని బుద్ధి స్థిరమైనది.

58 యదా సంహరతే చాయం కూర్మోఽంగానీవ సర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్యస్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

తాబేలు తన అవయవములను లోనికి ముడుచుకొను నట్లుగా స్థితప్రజ్ఞుడు తన యింద్రియములను విషయముల నుండి మరల్చి తన వశము నందుంచుకొనును. అట్టివాని బుద్ధి స్థిరమైనది.

59 విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః ;
రసవర్జం రసోఽప్యస్య పరం దృష్ట్వా నివర్తతే ॥

ఉపవాసము చేసినపుడు విషయ సుఖములు క్షీణించునే కాని విషయముల యందాసక్తి మాత్రము నశించదు. భగవత్ సాక్షాత్కారము కలిగినపుడే విషయములయందాసక్తి తొలగిపోవును.

వ్యాఖ్య : ఈ శ్లోకము ఉపవాసాదులను నిషేధించుటలేదు. వానికొక పరిమితిని సూచించుచున్నది. విషయములను శాంతింపచేయుటకు ఉపవాసాదులు అవసరము. కాని విషయ వాసనల మూలము అనగా రాగము (విషయేచ్ఛ) ఈశ్వర సాక్షాత్కారమైనపుడే నశించును. ఈశ్వర సాక్షాత్కారమను రసమును చవిచూచినవాడు ఇతర రసములను మరచిపోవును.

60 యతతో హ్యపి కౌంతేయ పురుషస్య విపశ్చితః ।
ఇంద్రియాణి ప్రమాథీని హరంతి ప్రసభం మనః ॥

ఓ కౌంతేయా ! బుద్ధిశాలి అయిన పురుషుడు ఎంత ప్రయత్నించినప్పటికీ బలవత్తరములైన యింద్రియములు వాని మనస్సును బలాత్కారముగ ఆకర్షించుచున్నవి; లాగివైచుచున్నవి.

61 తాని సర్వాణి సంయమ్య యుక్త ఆసీత మత్పరః ।
వశే హి యస్యేంద్రియాణి తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

ఇంద్రియములన్నిటిని లోబరచుకొని యోగి నా యందు తన్మయుడై యుండవలెను. తన యింద్రియములను స్వాధీనములో నుంచుకొను వానిబుద్ధి స్థిరముగా నుండును.

వ్యాఖ్య : భక్తి లేనిది ఈశ్వరుని సహాయము (అనుగ్రహము) లేనిది మానవుని ప్రయత్నము మిథ్య యగునని దీని తాత్పర్యము.

62 ధ్యాయతో విషయాన్పుంసః సంగస్తేషూపజాయతే ।
సంగాత్ సంజాయతే కామః కామాత్ క్రోధోఽభిజాయతే ॥

విషయ చింతనచేయు పురుషునకు విషయములందే ఆసక్తి కల్గుచున్నది. ఆసక్తి వలన కోరికలు పుట్టుచున్నవి. కోరికలు నెరవేరనందున క్రోధము కల్గుచున్నది.

వ్యాఖ్య : కోరికలు కలవానికి క్రోధము తప్పదు. ఎందు కనగా కామము (కోరిక) లెన్నటికినీ తీరునవి కావు.

63 క్రోధాద్భవతి సమ్మోహః సమ్మోహాత్స్మృతివిభ్రమః ।
స్మృతిభ్రంశాద్బుద్ధినాశో బుద్ధినాశాత్ప్రణశ్యతి ॥

క్రోధము వలన అవివేకము కలుగుచున్నది. అవివేకము వలన యుక్తాయుక్త విచక్షణ జ్ఞానము నశించుచున్నది. జ్ఞానము నశించినవాడు మృతప్రాయుడేయగును.

64 రాగద్వేషనియుక్తైస్తు విషయానింద్రియైశ్చరన్ ।
ఆత్మవశ్యైర్విధేయాత్మా ప్రసాదమధిగచ్ఛతి ॥

కాని ఎవని మనస్సు తన వశమునందుండునో, ఎవని యింద్రియములు రాగద్వేషములకు అతీతములై యుండి వశమందుండునో అట్టివాడు ఇంద్రియములతో వ్యవహరించియు ప్రసన్నచిత్తుడై యుండును.

65 ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే ।
ప్రసన్నచేతసో హ్యాశు బుద్ధిః పర్యవతిష్ఠతే ॥

ప్రసన్నచిత్తుడగువానికి దుఃఖములన్నియు తొలగిపోవును. ప్రసన్నచిత్తుని బుద్ధి త్వరగా స్థిరమగుచున్నది

66 నాస్తి బుద్ధిరయుక్తస్య న చాయుక్తస్య భావనా
న చాభావయతః శాంతి రశాంతస్య కుతః సుఖమ్ ॥

సమబుద్ధిలేనివానికి వివేకముండదు, భక్తికుదరదు. భక్తిలేనివానికి శాంతి ఉండదు. శాంతిలేక సుఖమెట్లు కలుగును ?

67 ఇంద్రియాణాం హి చరతాం యన్మనోఽనువిధీయతే ।
తదస్య హరతి ప్రజ్ఞాం వాయుర్నావమివామ్భసి

నీటిలోని పడవను గాలి ఇటునటు యీడ్చివేయునట్లు విషయములలో చిక్కుకొన్న ఇంద్రియముల వెంట పరుగెత్తు మనస్సుకలపురుషునియొక్క బుద్ధిని పెడదారి పట్టించును.

68 తస్మాద్యస్య మహాబాహో నిగృహీతాని సర్వశః ।
ఇంద్రియాణీంద్రియార్థేభ్య స్తస్య ప్రజ్ఞా ప్రతిష్ఠితా ॥

అందుచే అర్జునా ! ఎవని ఇంద్రియములు విషయ వాసనల నుండి మరలి స్వాధీనములో నుండునో అట్టివాని బుద్ధి స్థిరమైయుండును.

69 యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తిసంయమీ।
యస్యాం జాగ్రతిభూతాని సానిశా పశ్యతో మునేః ॥

భూతజాలమంతయు నిద్రించునప్పుడు జితేంద్రియుడు మేల్కొని యుండును. ప్రాణులన్నియు మేల్కొని యున్నపుడు జ్ఞానవంతుడగు ముని నిద్రించును.

వ్యాఖ్య : భోగపురుషుడు రాత్రి పన్నెండు ఒంటి గంటవరకు మేల్కొని యుండి నృత్యగీత వినోద భోజన పానాదికము లందు కాలము గడిపి, ఉదయము ఏడెనిమిది గంటలవరకు నిద్రించును. ఆత్మనిగ్రహము కలవాడు రాత్రి ఏడెనిమిది గంటలకే నిద్రించి, అర్ధరాత్రమున మేల్కొని ఈశ్వరుని ధ్యానించును. భోగి ప్రాపంచిక విషయములను పెంచుకొని భగవంతుని మరచిపోవును. కాని ఆత్మనిగ్రహము కలవాడు ప్రాపంచిక వ్యామోహములందు చిక్కుపడక ఈశ్వర సాక్షాత్కారమును పొందుచున్నాడు. వీరిరువురి మార్గములు భిన్నమైనవని భగవానుడీ శ్లోకములో చెప్పియున్నాడు.

70 ఆపూర్యమాణమచలప్రతిష్ఠం
సముద్రమాపః ప్రవిశంతి యద్వత్ ।
తద్వత్కామా యం ప్రవిశంతి సర్వే
సశాంతిమాప్నోతి న కామకామీ ॥

నదుల నీటిచే సముద్రము సదా నింపబడుచున్నను ఒకే రీతిని చలింపక స్థిరముగా నుండును. అట్టి సముద్రము వలె యోగియందు సకల విషయ వాసనలు ప్రవేశించినను అతడు శాంతిని పొందుచున్నాడు. కాని విషయములను కోరెడివాడు మాత్రము శాంతిని పొందజాలడు.

71 విహాయ కామాన్యః సర్వాన్పుమాంశ్చరతి నిస్స్పృహః
నిర్మమో నిరంహంకారః స శాంతిమధిగచ్ఛతి

కోరికలన్నిటినీ వదలి ఎవడు నిరపేక్షుడై అహంకార మమకారములను వీడి సంచరించునో వాడే శాంతిని పొందు చున్నాడు.

72 ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి ।
స్థిత్వాస్యామంతకాలేఽపి బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥

ఓ పార్థా! ఈశ్వరుని తెలిసికొన్నవాని స్థితి యిట్లుండును. ఆ స్థితిని పొందినవాడు మోహమునకు వశుడు కాడు. మరణకాలమునందు కూడ అట్టి స్థితి స్థిరమై యున్నచో అతడు బ్రహ్మనిర్వాణమును పొందును.

ఈ విధముగా ఉపనిషదర్థ ప్రతిపాదకము, బ్రహ్మ విద్యా విషయకము యోగశాస్త్రమును శ్రీకృష్ణార్జున సంవాదమును అగు భగవద్గీతలోని సాంఖ్యయోగమను రెండవ అధ్యాయము ముగిసినది.

ఓం తత్ సత్

# మూడవ అధ్యాయము

## కర్మ యోగము

గీతాస్వరూపమును తెలిసికొనుటకు ఈ అధ్యాయము కీలకమైనదని చెప్పవచ్చును. ఇందులో కర్మ ఎట్లుచేయవలెను? ఏ విధమైన కర్మను ఆచరించవలెను? దేనిని నిజమైనదని చెప్పవలెను? అను విషయములు స్పష్టముగా చెప్పబడినవి. యదార్థజ్ఞానము పారమార్థిక కర్మగా పరిణతి చెందవలెనని కూడా ఇందు చెప్పబడినది.

అర్జున ఉవాచ:—

1. జ్యాయసీ చేత్కర్మణస్తే మతా బుద్ధిర్జనార్దన।
తత్కింకర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ॥

అర్జునుడు ప్రశ్నించుచున్నాడు

జనార్దనా! కర్మకంటె బుద్ధి (జ్ఞానము) శ్రేష్ఠమని తలంచుచో నన్నీఘోరమగు కర్మచేయుటకు ఏల ప్రేరేపించు చున్నావు?

వ్యాఖ్య: బుద్ధియనగా సమత్వ బుద్ధి.

2. వ్యామిశ్రేణేవ వాక్యేన బుద్ధిం మోహయసీవ మే।
తదేకం వద నిశ్చిత్య యేన శ్రేయోఽహమాప్నుయామ్॥

సందిగ్ధమగు మాటలతో నాబుద్ధికి సందేహమేర్పడు నట్లు చేయుచున్నావు. కనుక నాకు దేని వలన శుభము కల్గునో ఆ విషయమును మాత్రమే స్పష్టముగా తెలియ జేయుము.

వ్యాఖ్య : అర్జునుడు సందేహములో పడినాడు. ఎట్లనగా— ఒకవైపు శ్రీ కృష్ణభగవానుడు అర్జునుని యందలి అలసతను నిరసించినాడు. మరొక వంక రెండవ అధ్యాయం 49,50 వ శ్లోకములలో సమత్వబుద్ధి యొక్క మహిమను పొగడుటచేత కర్మత్యాగము చేయవలెనను భ్రమ అర్జునునికి కలిగెను. కాని సూక్ష్మముగ ఆలోచించినచో అట్టి దేదియు లేదని యిప్పుడు చెప్పుచున్నాడు.

శ్రీ భగవాన్ ఉవాచ:—

3. లోకేఽస్మిన్ ద్వివిధా నిష్ఠా పురా ప్రోక్తా మయానఘ।
జ్ఞానయోగేన సాంఖ్యానాం కర్మయోగేన యోగినామ్॥

శ్రీ కృష్ణభగవానుడు చెప్పుచున్నాడు :—

అర్జునా! ఈ లోకంలో రెండు మార్గములను గురించి పూర్వమే చెప్పియుంటిని. ఒకటి—సాంఖ్యులకు జ్ఞానయోగ నిష్ఠ. రెండవది—కర్మయోగులకు కర్మయోగనిష్ఠ.

4. న కర్మణామనారంభా న్నైష్కర్మ్యం పురుషోఽశ్నుతే।
న చ సంన్యసనాదేవ సిద్ధిం సమధిగచ్ఛతి॥

మానవుడు కర్మలను ఆరభించకపోయినంత మాత్రమున నిష్కర్మత్వము అనుభవమును లేదు. కేవలము కర్మత్యాగ-బాహ్యత్యాగము వలన మోక్షమును కూడ పొందజాలడు.

వ్యాఖ్య : నిష్కర్మమనగా మనోవాక్కాయములచే కర్మను చేయకుండుట. ఇట్టి నిష్కర్మస్థితి కర్మచేయనంత మాత్రమున యెవరును పొందలేరు. అట్టి అనుభూతి యెట్లు కలుగునో తెలిసికొందము.

5. న హి కశ్చిత్క్షణమపి జాతు తిష్ఠత్యకర్మకృత్।
కార్యతే హ్యవశః కర్మ సర్వః ప్రకృతిజైర్గుణైః॥

నిజానికి ఎవరును ఒక్క క్షణమైనను కర్మచేయకుండా వుండలేరు. ప్రకృతి వలన కలుగు గుణములు మానవుని చేత విధిగా కర్మచేయించును.

6. కర్మేంద్రియాణి సంయమ్య య ఆస్తే మనసా స్మరన్।
ఇంద్రియార్థాన్విమూఢాత్మా మిథ్యాచారః స ఉచ్యతే॥

ఏ మానవుడు కర్మేంద్రియములను నిగ్రహించి ఆ యింద్రియముల యొక్క విషయవాసనలను మనస్సులో తలచుచున్నాడో వాడు మూఢుడు, దాంభికుడని పిలువబడుచున్నాడు.

వ్యాఖ్య : ఎట్లనగా నాల్కను నిగ్రహించుకొని మనస్సులో ఇతరులను దూషించువాడు నిష్కర్మచేయువాడు కాడు. మిథ్యాచారియగును. మనస్సును నిగ్ర

[illegible] శరీరమును నిగ్రహించుట నిరర్థకమని దీని భావము కాదు. శరీరమును నిగ్రహించనిదే మనస్సు స్వాధీనమునకు రాదు. కావున శరీరముతో పాటు మనస్సును కూడా నిగ్రహించుటకు ప్రయత్నించవలసినదే. ఎవరైతే భయము చేతనో లేక ఇతర బాహ్యకారణముల చేతనో శరీరమును మాత్రము నిగ్రహించి, మనస్సును నిగ్రహించక, మనస్సులోనే విషయ భోగములను అనుభవించుచూ, అవకాశము లభించినపుడు శరీరముచే కూడా అనుభవింతురో వారు మిథ్యాచారులని గర్హింపబడుచున్నారు. ముందు శ్లోకములో దీనికి భిన్న భావము సూచింపబడినది.

7. యస్త్వింద్రియాణి మనసా నియమ్యారభతేఽర్జున।
కర్మేంద్రియైః కర్మయోగమసక్తః స విశిష్యతే॥

ఓ అర్జునా! ఏ మనుష్యుడు ఇంద్రియములను మనసుతో నిగ్రహించి ఫలాసక్తి వదలి కర్మేంద్రియముల ద్వారా కర్మయోగమును ప్రారంభించునో వాడు శ్రేష్ఠుడు.

వ్యాఖ్య: ఇందు బాహ్యాభ్యంతరముల సమన్వయము చేయబడినది. మనసును నిగ్రహించుచూ కూడ శరీరముతో అనగా కర్మేంద్రియముల ద్వారా ఏదో ఒక పని చేయుచునే వుండును. కాని మనస్సును నిగ్రహించిన వాని కర్మేంద్రియములు —

చెవులు చెడుమాటలను వినక ఈశ్వరభజననే వినును. సజ్జనుల గుణగానములనే వినును. మనసును స్వాధీనమందుంచుకొన్నవానికి సామాన్యాలు విషయవాసనలని భావించు వానియందు అభిరుచికలుగదు. అట్టివాడు ఆత్మకు శ్రేయస్కరములగు పనులనే చేయును. ఇట్టి కర్మలను చేయుటయే కర్మమార్గము. ఏ ప్రయత్నముల వలన ఆత్మ శరీర బంధనముల నుండి విముక్తి పొందు యోగము సిద్ధించునో అది కర్మయోగము. ఇందు విషయ భోగముల ఆసక్తికి స్థానము వుండనే వుండదు.

8. నియతం కురు కర్మ త్వం కర్మ జ్యాయో హ్యకర్మణః।
శరీరయాత్రాపి చ తే న ప్రసిద్ధ్యేదకర్మణః॥

అందుచే నీవు నియతకర్మలను చేయుము. కర్మ చేయకుండుటకంటె కర్మచేయుట చాల మంచిది. నీ శరీరవ్యాపారముకూడ కర్మచేయక నడువజాలదు.

వ్యాఖ్య : 'నియత' శబ్దము మూలశ్లోకములో వున్నది. దీనికి క్రిందటి శ్లోకముతో సంబంధమున్నది. ఆ శ్లోకములో—మనసుచే యింద్రియములను నిగ్రహించి ఫలాసక్తి వదలి కర్మచేయువాని ప్రశంసకలదు. ఇక్కడ నియతకర్మ యనగా యింద్రియములను నిరోధించి చేయు కర్మయని స్పష్టపరచబడినది.

9. యజ్ఞార్థాత్కర్మణోఽన్యత్ర లోకోఽయం కర్మబంధనః।
తదర్థం కర్మ కౌంతేయ ముక్తసంగః సమాచర॥

యజ్ఞము కొఱకు చేయబడు కర్మలుగాక మిగిలిన కర్మలచే యీ లోకములో బంధనము లేర్పడుచున్నవి. అందువలన కౌంతేయా! నీవు ఫలాసక్తి విడచి యజ్ఞము కొఱకు పనిచేయుము.

వ్యాఖ్య: యజ్ఞమనగా పరోపకారార్థము ఈశ్వరప్రీతి కొఱకు చేయబడు కర్మలని యర్థము.

10. సహయజ్ఞాః ప్రజాః సృష్ట్వా పురోవాచ ప్రజాపతిః।
అనేన ప్రసవిష్యధ్వమేష వోఽస్త్విష్టకామధుక్॥

ప్రజాపతి బ్రహ్మ యజ్ఞముతోపాటు ప్రజలను సృష్టించి "ఈ యజ్ఞముచే మీరు వృద్ధిపొందుదురుగాక! ఇది మీ మనోవాంఛితములను నెరవేర్చుగాక!" అనెను.

11. దేవాన్ భావయతానేన తే దేవా భావయంతు వః।
పరస్పరం భావయంతః శ్రేయః పరమవాప్స్యథ॥

యజ్ఞముచేత దేవతలను మీరు పోషింపుడు, వారు మిమ్ములను పోషించెదరు. ఇట్లు ఉభయులు సంభావించుకొనిన మీరు పరమకళ్యాణములను పొందెదరు.

12. ఇష్టాన్భోగాన్హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః।
తైర్దత్తానప్రదాయైభ్యో యో భుంక్తే స్తేన ఏవ సః

యజ్ఞములచేత సంతుష్టులయిన దేవతలు నీకు కావలసిన భోగములను యిచ్చెదరు. వాటికి బదులుగా దేవతలకు ఏమీ యివ్వక వారొసగిన భోగములను తానే అనుభవించువాడు దొంగయగును.

వ్యాఖ్య : ఇచట దేవతలనగా సర్వభూతములు. అదే ఈశ్వరుని సృష్టి. సర్వప్రాణులకు చేయు సేవయే దేవతార్చన. అదే యజ్ఞము.

13. యజ్ఞ శిష్టాశినః సంతో ముచ్యంతే సర్వకిల్బిషైః।
భుంజతే తే త్వఘం పాపాయే పచన్త్యాత్మకారణాత్॥

యజ్ఞశేషమును భుజించువారు పాపమునుండి విముక్తులగుదురు. తమ కొఱకు మాత్రమే వండుకొని భుజించువారు పాపములకు గురియగుదురు.

14. అన్నాద్భవంతి భూతాని పర్జన్యా దన్నసంభవః।
యజ్ఞాద్భవతి పర్జన్యో యజ్ఞః కర్మసముద్భవః॥

అన్నమునుండియే ప్రాణులు ఉద్భవించుచున్నవి. వర్షముచే ఈ అన్నము ఉత్పత్తియగుచున్నది. యజ్ఞము వలన వానలు కురియుచున్నవి. కర్మవలన యజ్ఞము జరుగుచున్నది.

15. కర్మ బ్రహ్మోద్భవం విద్ధి బ్రహ్మాక్షరసముద్భవమ్।
తస్మాత్సర్వగతం బ్రహ్మ నిత్యం యజ్ఞే ప్రతిష్ఠితమ్॥

ప్రకృతి వలన కర్మ కలుగుచున్నదని తెలిసికొనుము. ఆ ప్రకృతి అక్షరబ్రహ్మవలన కలుగుచున్నది. కనుక సర్వ వ్యాపకమైన బ్రహ్మ యెల్లపుడూ యజ్ఞమందే వుండును.

16. ఏవం ప్రవర్తితం చక్రం నానువర్తయతీహ యః।
అఘాయురింద్రియారామో మోఘం పార్థ స జీవతి॥

ఓ పార్థా! ఈ విధముగా ప్రవర్తించుచున్న జగచ్చక్రమును అనుసరించి ప్రవర్తించనివాడు తన జీవితమును పాపమయము చేసికొనుచున్నాడు. అట్టివాడు ఇంద్రియ సుఖములందు తగుల్కొని నిరర్థక జీవితమును గడుపుచున్నాడు.

17. యస్త్వాత్మరతిరేవ స్యాదాత్మతృప్తశ్చ మానవః।
ఆత్మన్యేవ చ సన్తుష్టస్తస్య కార్యం న విద్యతే॥

కాని ఎవడు ఆత్మయందే ఆడుచూ పాడుచూ అందే సంతృప్తిచెంది ఆత్మానందమును అనుభవించునో వానికి చేయవలసిన కర్మ యేమీ వుండదు.

18. నైవ తస్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన।
న చాస్య సర్వభూతేషు కశ్చిదర్థవ్యపాశ్రయః॥

అట్టివానికి కర్మ చేయుటయందుగాని చేయకుండుట యందుగాని లాభనష్టములు కలుగవు. సర్వభూతముల విషయ

ములలో అతడు ఏలాటి ప్రయోజనమును ఆశించడు. ఏల నన ఆతనికి స్వార్థ మనునది వుండదు.

19. తస్మాదసక్తః సతతం కార్యం కర్మ సమాచార।
అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః॥

కనుక ఫలాసక్తి విడచి యెల్లప్పుడు కర్తవ్య కర్మలను చేయుము. ఫలాసక్తిలేకుండా కర్మచేయు పురుషుడు మోక్షమును పొందును.

20. కర్మణైవ హి సంసిద్ధిమాస్థితా జనకాదయః।
లోకసంగ్రహమేవాపి సంపశ్యన్ కర్తుమర్హసి॥

జనకుడు మొదలగు రాజర్షులు నిష్కామకర్మ చేసి పరమ సిద్ధిని పొందిరి. లోక కళ్యాణము కొఱకైననూ కర్మలను ఆచరించుట అవసరమై యున్నది.

21. యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః।
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే॥

ఉత్తమ పురుషులు యెట్లు ప్రవర్తింతురో యితరులు కూడ వారిని అనుసరింతురు. వారు దేనిని ప్రమాణముగా నిర్ణయింతురో ప్రజలు దానినే ఆచరింతురు.

22. న మే పార్థాస్తి కర్తవ్యం త్రిషు లోకేషు కించన।
నానవాప్తమవాప్తవ్యం వర్త ఏవ చ కర్మణి॥

ఓ పార్థా! ముల్లోకములలో నాకుగా నేను చేయవలసిన దేమీ లేదు. లభించవలసినది లభించకపోవటమూ లేదు. అయినను నేను కర్మలను చేయుచునే యున్నాను.

వ్యాఖ్య : సూర్యచంద్రులు, భూమి మొదలగునవి గతితప్పక నిరంతరమూ పరిభ్రమించుచున్నవి. ఇందు ఈశ్వరకర్మ సూచితమగుచున్నది. ఇవి కేవలము మానసిక కర్మలు కావు, శారీరక కర్మలుగ యెంచబడుచున్నవి. ఈశ్వరుడు నిరాకారుడై యుండియు శారీరక కర్మలను యెట్లు చేయుచున్నాడను సందేహమునకు తావు లేదు. ఎందుకనగా ఈశ్వరుడు శరీరము లేనివాడయి వుండియూ శరీరము కలవానివలె కర్మలను ఆచరించునట్లు కన్పట్టుచున్నాడు. కనుక ఆతడు కర్మ చేయుచున్నప్పటికీ అకర్మణ్యుడు, నిర్లిప్తుడు అయివున్నాడు. భగవంతుని ప్రతి ఒక సృష్టియూ యంత్రమువలె పనిచేయుచున్నది. అటులనే మానవుడు కూడ బుద్ధియుక్తుడై యంత్రమువలె నియమానుసారముగ పనిచేయవలెనని గ్రహించవలెను. యంత్రగతిని నిర్లక్ష్యముచేసి స్వేచ్ఛాచారిగా వుండుటలో మానవుని గొప్పతనము లేదు. జ్ఞానపూర్వకంగా అర్థము చేసికొని ఆ గతిని అనుకరించవలసియున్నది. నిర్లిప్తుడై అనాసక్తితో యంత్రమువలె పనిచేసినప్పటికీ అలసిపోడు. అరిగిపోడు, మృత్యుపర్యంతం నిత్య

నూతనుడగనే యుండును. శరీర ధర్మమునను సరించి కాలం తీరినపుడు శరీరము నశించుపోవు నేకాని అందలి ఆత్మ ఎప్పటివలెనే వుండును.

23. యది హ్యహం న వర్తేయం జాతు కర్మణ్యతంద్రితః।
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థః సర్వశః॥

ఓ పార్థా! నేనెప్పుడైనా అప్రమత్తుడనై కర్మచేయక వుండినచో ప్రజలు అన్ని విధములా నన్నే అనుసరింతురు.

24. ఉత్సీదేయురిమే లోకా న కుర్యాం కర్మ చేదహమ్।
సంకరస్య చ కర్తా స్యాముపహన్యామిమాః ప్రజాః॥

నేను కర్మచేయని యెడల యీ లోకములన్నియు భ్రష్టములగును, దాని అవస్థకు కారకుడనగుదును. ఈ లోకములను నశింప చేసినవాడనగుదును.

25. సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత।
కుర్యాద్విద్వాం స్తథాసక్తశ్చికీర్షుర్లోక సంగ్రహమ్॥

అర్జునా! అజ్ఞానులు విషయాసక్తితో కర్మలాచరించు విధముగా జ్ఞానులు ఆసక్తిరహితులై లోకకళ్యాణ భావంతో కర్మలాచరింపవలెను.

26. న బుద్ధిభేదం జనయేదజ్ఞానాం కర్మసంగినామ్।
యోజయేత్సర్వకర్మాణి విద్వాన్యుక్తః సమాచరన్॥

కర్మచేయుట యందాసక్తిగల అజ్ఞానులకు చిత్త చాంచల్యము కలుగకుండునటుల జ్ఞాని యగు వాడు సమబుద్ధితో కర్మనాచరించి వారు కూడ సమబుద్ధితో కర్మనాచరించునట్లు చేయవలెను.

27. ప్రకృతేః క్రియమాణాని గుణైః కర్మాణి సర్వశః।
అహంకార విమూఢాత్మా కర్తాహమితి మన్యతే॥

కర్మలన్నియు ప్రకృతిగుణములచే చేయబడుచున్నవి. అహంకారభావముతో మూఢుడైన మానవుడు తానే కర్తయని భావించుచున్నాడు.

వ్యాఖ్య: ఇంద్రియములను నిగ్రహించిన యెడల సూక్ష్మమైన కామమును జయించుట సరళమని, సుకరమని దీని భావము.

28. తత్త్వవిత్తు మహాబాహో గుణకర్మవిభాగయోః।
గుణా గుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే॥

అర్జునా! గుణముల యొక్కయు, కర్మలయొక్కయు విభాగ రహస్యములు తెలిసిన పురుషుడు ప్రకృతిగుణములు తమంతతామే వర్తింపబడుచున్నవని ఆసక్తిరహితుడై యుండుచున్నాడు.

వ్యాఖ్య:— ఉచ్ఛ్వాస-నిశ్వాస మొదలుగాగల పనులు తమంత తామే వర్తింపబడుచున్నవి. అందు

మానవుని ప్రమేయం వుండదు. ఏదైనా అవ యవమునకు వ్యాధిసోకినపుడు మాత్రమే వాటిని గురించి అతడు ఆలోచించును. వాటిస్థితిని గమ నించును. అటులనే సహజకర్మలు స్వాభావిక ముగ జరిగిపోవుచున్నపుడు వాటియందు ఆసక్తి కలుగదు. ఉదారస్వభావము గలవాడు తన ఔదార్యమును యెఱుగడు. దానముచేయకుండా అతడు వుండలేడు. దానము చేయుట అతనికి స్వాభావికకర్మ. ఇట్టి అనాసక్తి అభ్యాసము చేతను, ఈశ్వర కృపచేతను కల్గును.

29. ప్రకృతేర్గుణసంమూఢాః సజ్జంతే గుణకర్మసు।
తానకృత్స్నవిదో మందాన్ కృత్స్నవిన్న విచాలయేత్॥

ప్రకృతి గుణములచేత భ్రమలోపడిన మనుష్యుడు గుణములయొక్క కర్మలయందాసక్తుడై ఉండును. జ్ఞానులైన వారు ఇట్టి మందబుద్ధులయిన అజ్ఞానులకు చిత్త చాంచల్య మును కలిగించకూడదు.

30. మయి సర్వాణి కర్మాణి సంన్యస్యాధ్యాత్మచేతసా।
నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః॥

మనస్సును ఆధ్యాత్మిక చింతనయందు లగ్నముచేసి కర్మలన్నియు నాకు అర్పించి ఆసక్తిని, మమకారమును విడ నాడి సంతాపముచెందక యుద్ధము చేయుము.

వ్యాఖ్య:— సేవకుడు యజమానికొఱకై పనిచేసి ఫలితము సంతటిని ఆతనికే అర్పించును. ఈ విధముగా దేహములోని ఆత్మను గురించి దానిని పరమాత్మ యొక్క అంశమని తెలిసికొనినవాడు సర్వమును పరమాత్మకే అర్పించును.

31. యే మే మతమిదం నిత్యమనుతిష్ఠంతి మానవాః।
శ్రద్ధావంతోఽనసూయంతో ముచ్యంతే తేఽపి కర్మభిః॥

ద్వేష భావము లేక శ్రద్ధతో ఎవరు నేను ఉపదేశించిన మార్గమును అనుసరింతురో వారుకూడ కర్మబంధముల నుండి విముక్తులగుదురు.

32. యే త్వేతదభ్యసూయంతో నానుతిష్ఠంతి మే మతమ్।
సర్వజ్ఞానవిమూఢాంస్తాన్విద్ధి నష్టానచేతసః॥

కాని నేను చెప్పిన ఈ మార్గమునందు దోషము నెంచి దానిని అనుసరించని మూర్ఖులు, అజ్ఞానులు తప్పక నశింతురని తెలిసికొనుము.

33. సదృశం చేష్టతే స్వస్యాః ప్రకృతేర్జ్ఞానవానపి।
ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహః కిం కరిష్యతి॥

ప్రతి ప్రాణి (జీవి) యు తన స్వభావము ననుసరించి నడచుకొనును. జ్ఞానులుకూడ తమ స్వభావము ననుసరించియే

వ్యవహరింతురు అట్టియెడ ఇక నిర్బంధమునకు తావెక్కడ? తావేలేదు.

వ్యాఖ్య:— ఈ శ్లోకము రెండవ అధ్యాయమునందలి 61, 68 శ్లోకములకు విరుద్ధమైనది కాదు. ఇంద్రియములను నిగ్రహించుటకు మానవుడు కఠోర పరిశ్రమ చేయవలసియుండును. అయినప్పటికినీ ఫలితము కలుగనిచో అట్టి నిగ్రహము అనగా నిర్బంధము వృథయగును. ఇందు నిగ్రహమును దూషించుటలేదు. స్వభావముయొక్క బలవత్తరమగుశక్తి నిరూపింపబడినది. ఎవరైనా 'ఇది నా స్వభావము' అని చెప్పుగా ప్రవర్తించుచో వారీ శ్లోకమును అర్థము చేసికొనలేదని చెప్పవచ్చును. స్వభావముయొక్క నిజస్వరూపం మనకు తెలియదు. అలవాట్లన్నియు స్వభావములు కావు. ఉన్నతిని పొందుటయే ఆత్మయొక్క స్వభావము కనుక ఆత్మ అధోగతికి పోవనున్నపుడు దానిని ఉద్ధరించుటయే కర్తవ్యమైయున్నది. దీనినే క్రిందిశ్లోకము స్పష్టపరచుచున్నది.

34. నిరాశీర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః।
యే మే మతమిదం నిత్యమనుష్ఠంతి మానవాః॥

ఇంద్రియములకు కూడ వాటికి సంబంధించిన విషయవస్తువులందు సహజముగా రాగద్వేషములుండును. మాన

వుడు వాటికి వశుడు కారాదు. అవియే మానవుని ఆధ్యాత్మికాభివృద్ధికి అడ్డుతగులు శత్రువులు.

వ్యాఖ్య:— వినుట చెవియొక్క పని, తనకు ఇంపైనది వినుట రాగము, నచ్చని దానిని వినకుండుట ద్వేషము అనబడును. అది వాటి స్వభావమని తెలిసి రాగద్వేషములకు వశముకారాదు, వాటిని జయించవలెను. సుఖ దుఃఖములకు లోనుగాకుండుటయే ఆత్మయొక్క స్వభావము. మనుష్యుడట్టి స్వభావమును సంపాదించవలెను.

౩౫. శ్రేయాన్ స్వధర్మో విగుణః పరధర్మాత్ స్వనుష్ఠితాత్।
స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః॥

ఇతరుల ధర్మము యెంత సుకరమైననూ తన ధర్మము కష్టమైననూ తన ధర్మమే శ్రేష్ఠము. స్వధర్మాచరణములో మరణించినను మేలు. పరధర్మము భయంకరమైనది.

వ్యాఖ్య:— సమాజములో పారిశుధ్యపు పనిని ఒకరు చేస్తే, మరొకరు వ్రాతపనులు చేయుచూ వుందురు. వ్రాతపని చేయువాడు సమాజములో శ్రేష్ఠుడని యెంచబడుగాక, ఊడ్చేపని చేయువాడు తన ధర్మమును విడనాడుచో భ్రష్టుడగును. మరియు సమాజమునకు హానికలుగచేసిన వాడగును. పరమేశ్వరుని సన్నిధిలో యీ యిరువురి సేవల విలువ వారియొక్క కర్తవ్యనిష్ఠల ననుసరించి యెంచ

బడును. వృత్తి ధర్మములయొక్క విలువ సమా
నమే. ఇరువురూ ఈశ్వరార్పణ బుద్ధితో తమ
తమ విధ్యుక్త ధర్మముల నాచరించుచో మోక్ష
మునకు సమానముగా అర్హులగుదురు.

అర్జున ఉవాచ:—

36. అథ కేన ప్రయుక్తోఽయం పాపం చరతి పూరుషః।
అనిచ్ఛన్నపి వార్ష్ణేయ బలాదివ నియోజితః॥

అర్జునుడు ప్రశ్నించుచున్నాడు:—

ఓ కృష్ణా! ఎవరో బలవంతముచేసినట్లు తనకు ఇష్టములేకున్నను మనుష్యుడు పాపకార్యములు చేయుచున్నాడు. ఇది ఎవరి ప్రేరణవలన జరుగుచున్నది?

శ్రీభగవానువాచ:—

37. కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః।
మహాశనో మహాపాప్మా విద్ధ్యేనమిహ వైరిణమ్॥

శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు:—

రజోగుణమువలన ఉద్భవించు కామక్రోధములే ప్రేరేపించుచున్నవి. వీటికి తృప్తి యెన్నడునూ కలుగదు. ఇవియే మహాపాపులు కావున వీటిని పరమశత్రువులుగ భావింతుము.

[illegible] ప్రసంగమందే మన నిజమైన శత్రు వున్నాడు. దేనిని మనము కామము లేక క్రోధము అనుచున్నామో అదే మన శత్రువు.

38. ధూమేనావ్రియతే వహ్నిర్యథాదర్శో మలేన చ।
యథోల్బేనావృతో గర్భస్తథా తేనేదమావృతమ్॥

పొగచేత అగ్ని, మాలిన్యమువలన అద్దము, మావి చేత గర్భము కప్పబడియున్నట్లు కామక్రోధాది [illegible] ఈ జ్ఞానము మరుగుపడియున్నది.

39. ఆవృతం జ్ఞానమేతేన జ్ఞానినో నిత్యవైరిణా।
కామరూపేణ కౌంతేయ దుష్పూరేణానలేన చ॥

కౌంతేయా! తృప్తిపరచబడజాలనట్టి యీ కామరూపాగ్ని జ్ఞానికి నిత్యశత్రువు. దీనివలన జ్ఞానియొక్క జ్ఞానము మరుగుపడుచున్నది.

40. ఇంద్రియాణి మనో బుద్ధిరస్యాధిష్ఠానముచ్యతే।
ఏతైర్విమోహయత్యేష జ్ఞానమావృత్య దేహినమ్॥

ఇంద్రియములు, మనసు, బుద్ధి యీ శత్రువునకు నివాసస్థానములు. వీటితో జ్ఞానమును మరుగుపరచి ఈ శత్రువు మనుష్యుని భ్రమింపచేయుచున్నాడు.

వ్యాఖ్య :— ఇంద్రియములలో కామము వ్యాప్తమగుటచే మనస్సు మలినమగుచున్నది. అందువలన వివేకశక్తి మందగించుచున్నది. దానితో జ్ఞానము నశించుచున్నది. (రెండవ అధ్యాయం శ్లో. 62, 63, 64 లను చూడుడు.)

41. తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ।
పాప్మానం ప్రజహి హ్యేనం జ్ఞానవిజ్ఞాననాశనమ్॥

ఓ అర్జునా! అందువలన నీవు మొదట ఇంద్రియములను నిగ్రహించి జ్ఞానమును అనుభవమును నశింపజేయు ఈ పాపిని త్యజించుము.

42. ఇంద్రియాణి పరాణ్యాహురింద్రియేభ్యః పరం మనః।
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః॥

ఇంద్రియములు సూక్ష్మమైనవి. అంతకంటెను సూక్ష్మమైనది బుద్ధి. బుద్ధికంటె అత్యంత సూక్ష్మమైనది ఆత్మ.

వ్యాఖ్య : ఇంద్రియములను నిగ్రహించిన మొదట సూక్ష్మమైన కామమును జయించుట సరళమని, సుకరమని దీని భావము.

43 ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా।
జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్॥

ఓ అర్జునా! ఈ విధముగా బుద్ధికి అతీతమైన ఆత్మను గుర్తించి ఆత్మద్వారా మనస్సును నిగ్రహించి కామ మనెడి ప్రబల శత్రువును సంహరింపుము.

వ్యాఖ్య: మానవుడు శరీరమందున్న ఆత్మను తెలిసికొన్నట్లయితే మనస్సు తన వశమందుండును. ఇంద్రియములకు వశము కాదు. మనస్సును జయించినచో కామము ఏమి చేయగలదు?

ఈ విధముగా ఉపనిషదర్థప్రతిపాదకము, బ్రహ్మవిద్యా విషయము, యోగశాస్త్రమును, శ్రీ కృష్ణార్జున సంవాదమును అగు భగవద్గీతలోని కర్మయోగమనెడి మూడవ అధ్యాయము సమాప్తము.

ఓం తత్ సత్

# నాల్గవ అధ్యాయము
## జ్ఞాన కర్మ సన్యాసయోగము

మూడవ అధ్యాయంలో చెప్పబడిన విషయము ఈ అధ్యాయంలో మరింత స్పష్టముగా విశదీకరింపబడినది. వివిధ యజ్ఞముల వర్ణనకూడా యిందుగలదు.

శ్రీ భగవానువాచ:—

1 ఇమం వివస్వతే యోగం ప్రోక్తవానహమవ్యయమ్।
వివస్వాన్మనవే ప్రాహ మనురిక్ష్వాకవేఽబ్రవీత్॥

శ్రీ కృష్ణభగవానుడు చెప్పుచున్నాడు.

నాశరహితమైన ఈ యోగమును నేను పూర్వము సూర్యునకు చెప్పితిని. సూర్యుడు మనువునకును, ఆ మనువు ఇక్ష్వాకునకును చెప్పెను.

2 ఏవం పరంపరాప్రాప్తమిమం రాజర్షయో విదుః।
స కాలేనేహ మహతా యోగో నష్టః పరంతప॥

ఈ విధముగా రాజర్షులెరిగిన యీ యోగము పరంపరాగతముగా లభించి దీర్ఘకాలము గడచినందున విస్మరింపబడినది.

3 స ఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః।
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్॥

నీవు నా భక్తుడవుగనుక ఆ ప్రాచీనమైన ఉత్తమ యోగరహస్యమును నీకు ఉపదేశించితిని.

అర్జున ఉవాచ: —

4 అపరం భవతో జన్మ పరం జన్మ వివస్వతః।
కథమేతద్విజానీయాం త్వమాదౌ ప్రోక్తవానితి॥

అర్జునుడు ప్రశ్నించుచున్నాడు: —

కృష్ణా! నీవేమో ఇటీవల జన్మించితివి. సూర్యభగవానుడు అతి ప్రాచీనకాలములో పుట్టినాడు. అట్టిస్థితిలో ఈ యోగమును పూర్వమందే సూర్యునకు ఉపదేశించుట యెట్లు జరిగినదో నాకు తెలియకున్నది.

శ్రీ భగవానువాచ: —

5 బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున।
తాన్యహం వేద సర్వాణి న త్వం వేత్థ పరంతప॥

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు: —

అర్జునా! నీకునూ నాకునూ అనేక జన్మలు గతించినవి. ఆ జన్మల సంగతి నేనెరుగుదును, నీవు ఎరుగవు.

6 అజోఽపి సన్నవ్యయాత్మా భూతానామీశ్వరోఽపి సన్
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మమాయయా

నేను పుట్టుకలేనివాడను, నాశరహితుడను. భూతజాలమంతటికిని ప్రభువునై యుండికూడా నాస్వభావము ననుసరించి నా మాయాశక్తిచే ప్రభవించుచున్నాను.

7\. యదా యదా హి ధర్మస్య గ్లానిర్భవతి భారత ।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్ ॥

ఓ అర్జునా ! ధర్మమునకు హాని కలిగి అధర్మము ప్రబలినపుడు నేను అవతరించుచున్నాను.

8\. పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే ॥

దుష్టశిక్షణ సాధురక్షణ చేసి ధర్మమును పునరుద్ధరించుటకు ప్రతి యుగమందును నేను అవతరించుచున్నాను.

వ్యాఖ్య : ఇచట శ్రద్ధాళువులైన భక్తులకు అభయమిచ్చుచున్నాడు. సత్యము, ధర్మముగొక్క సుస్థిరతను చాటి చెప్పుచున్నాడు. ఈ సంసారసాగరంలో ఆటుపోటులు అనగా ధర్మ అధర్మములు విజృంభించి సమసిపోతూవుంటవి. చివరకు ధర్మమే జయించును. "సత్యమునకు నాశము లేదుగాన సజ్జనులు నశించరు. అసత్యమునకు అస్థిత్వమే లేదుగాన దుష్టులు నశింతురు." ఇట్లనినందున మానవుడు కర్తృత్వభారంవహించి అహంభావ

ముతో హింసగాని దుష్కృత్యములు గాని చేయ వచ్చునని అర్థముకాదు.

ఈశ్వరుని ప్రబలమైన మాయ తన పని తాను నిర్వర్తించుచునే యుండును. భగవదవతార మన్నా లేక భగవంతుని పుట్టుక అనినా యిదియే. వాస్తవానికి ఈశ్వరుడు జన్మించవలసిన పనియే లేదు.

9. జన్మ కర్మ చ మే దివ్యమేవం యో వేత్తి తత్త్వతః
త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున ॥

ఓ అర్జునా! ఈ విధముగా నా దివ్యజన్మ — కర్మల రహస్యము తెలిసినవాడు శరీరమును త్యజించి పునర్జన్మ పొందక నన్నే చేరుచున్నాడు.

వ్యాఖ్య : ఎందుకనగా భగవంతుడు సత్యమునకే జయము చేకూర్చుచున్నాడు అను విశ్వాసము కలిగిన మానవుడు సత్యమును విడచిపెట్టడు. ధైర్యముగా వుండును. దుఃఖమును సహించును. మమకారము లేక యుండును. అందుచేత జన్మ—మరణములనెడి చక్రమునుండి తప్పించుకొని ఈశ్వరధ్యానము చేయుచు అందే లీనమైయుండును.

10 వీతరాగభయక్రోధా మన్మయా మాముపాశ్రితాః ।
బహవో జ్ఞానతపసా పూతా మద్భావమాగతాః ॥

రాగద్వేష భయక్రోధరహితులై నన్నే ధ్యానించుచు, నాశరణు జొచ్చి జ్ఞానమనెడి తపస్సుతో పవిత్రులైన వారనేకులు నాస్థితిని పొందిరి.

11 యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్
మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః ॥

ఎవరు నన్ను ఏ విధముగా ఆశ్రయింతురో నేను వారికి అట్టి ఫలితమునే యిచ్చుచున్నాను. ఓ పార్థా! ఏ విధముననైననూ సరే మనుష్యులందరూ నా మార్గమునే అనుసరించుచున్నారు, నా అధీనములోనే వున్నారు.

వ్యాఖ్య : ఎవరునూ భగవంతుని నియమమును ఉల్లంఘించలేరని దీని తాత్పర్యము. ఏ విత్తనము నాటితే ఆ ఫలమునే పొందుదుము. చేసియున్న కర్మను బట్టి ఫలితమును పొందుచున్నాము. ఈశ్వర నియమములో ఈ కర్మసిద్ధాంతమునకు మినహాయింపులు, రాయితీలు లేవు. అందరికీ సమానముగా — వారి వారి యోగ్యతల ననుసరించ న్యాయము లభించును.

12 కాంక్షంతః కర్మణాం సిద్ధిం యజంత ఇహ దేవతాః ।
క్షిప్రం హి మానుషే లోకే సిద్ధి ర్భవతి కర్మజా ॥

కర్మఫలమును ఆశించువారు ఈ లోకములో దేవతలను పూజింతురు. అందువలన వారికి కర్మజనితమైన ఫలము వెంటనే మనుష్యలోకమునందే లభించుచున్నది.

గాంధీజీ: దేవతలనగా స్వర్గములోనుండెడి ఇంద్రవరుణాది దేవతా వ్యక్తులు కారు. దేవతలనగా ఈశ్వరాంశ సంభూతమైన శక్తులు. ఈ అర్థంలో మానవుడు కూడా దేవతే. ఆవిరి, విద్యుత్తు మొదలగు గొప్ప శక్తులు దేవతలే. వాటిని సేవించిన యెడల ఫలితము వెంటనే ఈ లోకములోనే లభించుట మనము చూచుచునే యున్నాము. ఆ ఫలితము క్షణికము. అది ఆత్మకు ఆనందము కల్గించునదికాదు. అట్టి స్థితిలో మోక్షమును ఎచటినుండి తెచ్చి ఇవ్వగలను?

13 చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగశః।
తస్య కర్తారమపి మాం విద్ధ్యకర్తారమవ్యయమ్ ॥

గుణ—కర్మ విభాగముల ననుసరించి నేను నాలుగు వర్ణములను సృజించితిని. వాటి కన్నిటికి నేను కర్తనైనప్పటికీ నీవు నన్ను నాశరహితుడుగను అకర్తగను గుర్తించుము.

14 న మాం కర్మాణి లింపంతి న మే కర్మఫలే స్పృహా।
ఇతి మాం యోఽభిజానాతి కర్మభిర్న స బధ్యతే ॥

కర్మలు నన్ను అంటుకొనవు. నాకు వాని ఫలితము లందునూ ఆసక్తి లేదు. ఇవ్విధముగా నన్ను సరిగా తెలిసికొన్నవారు కర్మ బంధములలో చిక్కుకొనరు.

వ్యాఖ్య: తాను కర్మచేయుచూ చేయనివానివలె వుండెడి ఉత్తమమైన దృష్టాంతము ఈశ్వరుడు మన ఎదుట వుంచినాడు. అన్నిటికినీ కర్త ఈశ్వరుడేయని, మనము నిమిత్తమాత్రులమేనని భావించినపుడు మనకు కర్తృత్వ అభిమానము ఎట్లు కలుగును?

15 ఏవం జ్ఞాత్వా కృతం కర్మ పూర్వైరపి ముముక్షుభిః ।
కురు కర్మైవ తస్మాత్త్వం పూర్వైః పూర్వతరం కృతమ్ ॥

ఈ విధముగా తెలిసికొని ముముక్షువులు కర్మ నాచరించిరి. మొదటినుండీ పూర్వీకులు ఆచరించినట్లుగనే నీవు కూడా చేయుము.

16 కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః ।
తత్తే కర్మ ప్రవక్ష్యామి యజ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్

కర్మయన నేమి ? అకర్మయనగా నేమి? అను విషయమై తెలివిగలవారుకూడా భ్రమపడినారు. ఈ కర్మను గురించి నీకు నేను స్పష్టముగా చెప్పెదను. దీనిని తెలిసికొని నీవు అశుభములనుండి రక్షింపబడెదవు.

17 కర్మణో హ్యపి బోద్ధవ్యం బోద్ధవ్యంచ వికర్మణః ।
అకర్మణశ్చ బోద్ధవ్యం గహనా కర్మణో గతిః ॥

కర్మ, నిషిద్ధకర్మ, మరియు అకర్మలయొక్క భేదమును తెలిసికొనవలెను. ఈ కర్మతత్త్వము చాల నిగూఢమైనది.

18 కర్మ ణ్యకర్మ యః పశ్యే దకర్మణి చ కర్మ యః :
స బుద్ధిమా న్మనుష్యేషు స యుక్తః కృత్స్నకర్మకృత్ ॥

కర్మలో అకర్మను, అకర్మలో కర్మను చూచువాడు బుద్ధిమంతుడుగా గణింపబడుచున్నాడు. అతడే యోగియు, సంపూర్ణకర్మలను చేసినవాడగుచున్నాడు.

వ్యాఖ్య : కర్మచేయుచూకూడ కర్తృత్వ అభిమానములేని వాని కర్మ అకర్మయగును. బాహ్యరూపమున కర్మను త్యజించినప్పటికినీ మనసులో అనురక్తుడైన వాని అకర్మ కర్మయే యగును. పక్షవాతపు రోగియత్నపూర్వకముగా అభిమానముతో చచ్చుపడిన అవయవమును కదిలించినపుడే అది కదలును. అట్టివాడు అవయవమును కదిలించు క్రియకు కర్తయగు చున్నాడు. ఆత్మయొక్క గుణము అకర్తయొక్క గుణము వంటిది. మోహపాశమునపడి తానే కర్తగా భావించుకొను వాని ఆత్మకు పక్షవాతము వచ్చినదని చెప్పవచ్చును. అట్టివాడు అహంభావముతో కర్మచేయును. ఈ విధముగా కర్మతత్త్వమును తెలిసినవాడు బుద్ధికుశలుడు, యోగి, కర్తవ్యపరాయణుడు అని యెంచబడుచున్నాడు. "నేను చేయుచున్నాను" అని

భావించువాడు కర్మ, నిషిద్ధకర్మల భేదమును మరచిపోవుచున్నాడు. సాధనము యొక్క మంచి చెడ్డలను విచారించడు. ఫలాపేక్షయే ప్రధానముగా తలచి చెడుసాధనమునైనా ఉపయోగించును. ఆత్మ సహజముగా ఊర్ధ్వగతియందే పయనించును. కాబట్టి నీతిమార్గమునుండి తొలగినవానికి అహంకార మున్నదని చెప్పవచ్చును. అహంకారరహితుడై కర్మల నాచరించు వాని కర్మలు సహజముగా సాత్త్వికములే అయి వుండును.

19 యస్య సర్వే సమారంభాః కామసంకల్ప వర్జితాః ।
జ్ఞానాగ్నిదగ్ధకర్మాణం తమాహుః పండితం బుధాః ॥

ఎవని సమస్త కర్మారంభములు కామ సంకల్పములు లేకుండా వుండునో వాని కర్మలు జ్ఞానమనెడి అగ్నిలో భస్మమగును. అట్టివానినే జ్ఞానులు పండితుడని చెప్పెదరు.

20 త్యక్త్వా కర్మఫలాసంగం నిత్యతృప్తో నిరాశ్రయః ।
కర్మణ్యభిప్రవృత్తోఽపి నైవ కించిత్కరోతి సః॥

కర్మఫలమును త్యజించి సదాసంతుష్టుడై పరుల ఆశ్రయమును ఆశ్రయించనివాడు కర్మలో నిమగ్నుడై యుండియు ఏమీ చేయనివాడే అని చెప్పబడును.

వ్యాఖ్య : అనాసక్తివానికి కర్మబంధముల ననుభవించవలసి యుండదు.

21 నిరాశీర్యతచిత్తాత్మా త్యక్తసర్వపరిగ్రహః ।
శారీరం కేవలం కర్మ కుర్వన్నాప్నోతి కిల్బిషమ్ ॥

ఆశలు వదలి మనస్సును స్వాధీనమందుంచుకొని వస్తుసంగ్రహాసక్తిని త్యజించినవాడు శరీరముతో కర్మ చేయుచున్నను వానికి పాపము అంటదు.

వ్యాఖ్య : "నేను చేయుచున్నాను" అను అభిమానంతో చేయబడు కర్మలు సాత్వికములైనప్పటికినీ బంధమును కల్గించునట్టివే యగును. ఈశ్వరార్పణ బుద్ధితో అహంభావ రహితముగా ఆచరించబడు కర్మలు బంధరహితము లగుచున్నవి. ఎవనికి "నేను" అను అహంభావము నశించునో వాని శరీరము మాత్రమే కర్మచేయును. నిద్రించువాడు శరీరముమాత్రమే కర్మచేయుచున్నదని చెప్పవచ్చును. జైలుశిక్షపడిన ఖైదీ తన ఇష్టమునకు వ్యతిరేకముగా నాగలి దున్నవలసి వచ్చినప్పుడు అతని శరీరముమాత్రమే పని చేయును. అట్లే తనకుతానుగా ఈశ్వరాధీను డైన వాని శరీరముమాత్రమే కర్మ చేయును. ఎవనికి "నేను" నశించి వానికి ఈశ్వరుడే కర్తయై యున్నాడు.

22 యదృచ్ఛాలాభసంతుష్టో ద్వంద్వాతీతో విమత్సరః।
సమః సిద్ధావసిద్ధౌ చ కృత్వాపి న నిబధ్యతే ॥

లభించినదానితో సంతుష్టుడై సుఖదుఃఖములకు అతీతుడై ద్వేషరహితుడై కార్యము సిద్ధించిననూ సిద్ధించక పోయినను తటస్థభావముతో మెలగువాడు కర్మచేయుచూ కూడ బంధనములలో చిక్కుకొనడు.

23 గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థిత చేతసః
యజ్ఞా యాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే ।

ఆసక్తిలేనివాడై జ్ఞానబుద్ధికలవాడై రాగద్వేషముల నుండి ముక్తుడై కేవలము యజ్ఞముకొఱకే పనిచేయువాని కర్మలన్నియు హరించిపోవును.

24 బ్రహ్మార్పణం బ్రహ్మహవిర్బ్రహ్మాగ్నౌ బ్రహ్మణా హుతమ్
బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మసమాధినా ॥

"యజ్ఞముచేయుట కుపయోగింపబడు హోమ సాధనములు బ్రహ్మమే, హవనవస్తువు బ్రహ్మము, బ్రహ్మరూపు డగు అగ్నియందు బ్రహ్మస్వరూపునిచేత హవనము చేయబడుచున్నదియు బ్రహ్మమే" యని కర్మలయందు ఆ బ్రహ్మమునే దర్శించు బ్రహ్మకర్మ సమాధినిష్ఠుడైనవాడు పొందు ఫలముకూడ బ్రహ్మమే యగును.

25 దైవమేవాపరే యజ్ఞం యోగినః పర్యుపాసతే।
బ్రహ్మాగ్నావపరే యజ్ఞం యజ్ఞేనైవోపజుహ్వతి॥

ఎందరో యోగులు దేవతా పూజ యనెడి యజ్ఞము చేయుచున్నారు. ఇంకెందరో బ్రహ్మరూపుడైన అగ్నిలో యజ్ఞద్వారమున యజ్ఞమే హోమము చేయుచున్నారు.

26 శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి ।
శబ్దాదీన్విషయానన్యే ఇంద్రియాగ్నిషు జుహ్వతి ॥

ఎందరో శ్రవణాది యింద్రియ నిగ్రహమనెడి యజ్ఞము చేయుచున్నారు. మరికొందరు శబ్దాది విషయములను ఇంద్రియములనెడి అగ్నిలో హోమము చేయుచున్నారు.

వ్యాఖ్య: వినుట మొదలగు క్రియలను నిగ్రహించుట మొదటిది. రెండవది - ఇంద్రియములను ఉపయోగిస్తూ వాటి విషయములను భగవంతుని ప్రీతి కొఱకు వినియోగించుట. అనగా-హరికథా కీర్తనాదుల వినుట. వాస్తవమునకు యీ రెండునూ ఒకటే.

27 సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే ॥

మరి యెందరో సమస్త యింద్రియముల కర్మలను, ప్రాణాయామాది కర్మలను జ్ఞానదీపముచే ప్రజ్వలింపబడిన ఆత్మనిగ్రహ మనెడి యోగాగ్నిలో హోమము చేయుచున్నారు.

ఎందరో యోగులు దేవతా పూజ యనెడి యజ్ఞము చేయుచున్నారు. ఇంకెందరో బ్రహ్మరూపుడైన అగ్నిలో యజ్ఞ ద్వారమున యజ్ఞమే హోమము చేయుచున్నారు.

26 శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి ।
శబ్దాదీన్విషయానన్యే ఇంద్రియాగ్నిషు జుహ్వతి ॥

ఎందరో శ్రవణాది యింద్రియ నిగ్రహమనెడి యజ్ఞము చేయుచున్నారు. మరికొందరు శబ్దాది విషయములను ఇంద్రియములనెడి అగ్నిలో హోమము చేయుచున్నారు.

వ్యాఖ్య : వినుట మొదలగు క్రియలను నిగ్రహించుట మొదటిది. రెండవది - ఇంద్రియములను ఉపయోగిస్తూ వాటి విషయములను భగవంతుని ప్రీతి కొఱకు వినియోగించుట. అనగా-హరికథా కీర్తనాదుల వినుట. వాస్తవమునకు యీ రెండునూ ఒకటే.

27 సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే ॥

మరి యెందరో సమస్త యింద్రియముల కర్మలను, ప్రాణాయామాది కర్మలను జ్ఞానదీపముచే ప్రజ్వలింపబడిన ఆత్మనిగ్రహ మనెడి యోగాగ్నిలో హోమము చేయుచున్నారు.

మరికొందరు యోగులు దేవతా పూజ యనెడి యజ్ఞము చేయుచున్నారు. మరికొందరు బ్రహ్మరూపమైన అగ్నిలో యజ్ఞద్వారమున యజ్ఞమే హోమము చేయుచున్నారు.

26 శ్రోత్రాదీనీంద్రియాణ్యన్యే సంయమాగ్నిషు జుహ్వతి ।
శబ్దాదీన్విషయానన్య ఇంద్రియాగ్నిషు జుహ్వతి ॥

మరికొందరు శ్రవణాది యింద్రియ నిగ్రహమనెడి యజ్ఞము చేయుచున్నారు. మరికొందరు శబ్దాది విషయములను ఇంద్రియములనెడి అగ్నిలో హోమము చేయుచున్నారు.

వ్యాఖ్య: వినుట మొదలగు క్రియలను నిగ్రహించుట మొదటిది. రెండవది - ఇంద్రియములను ఉపయోగిస్తూ వాటి విషయములను భగవంతుని ప్రీతికొరకు వినియోగించుట. అనగా-హరికథా కీర్తనాదులు వినుట. వాస్తవమునకు యీ రెండునూ ఒకటే.

27 సర్వాణీంద్రియకర్మాణి ప్రాణకర్మాణి చాపరే ।
ఆత్మసంయమయోగాగ్నౌ జుహ్వతి జ్ఞానదీపితే ॥

మరి యొందరో సమస్త యింద్రియముల కర్మలను, ప్రాణాపానాది కర్మలను జ్ఞానదీపముచే ప్రజ్వలింపబడిన ఆత్మసంయమ మనెడి యోగాగ్నిలో హోమము చేయుచున్నారు.

వ్యాఖ్య : అనగా పరమాత్మలో తాదాత్మ్యము చెందు చున్నారని భావము.

28 ద్రవ్యయజ్ఞాస్తపోయజ్ఞా యోగయజ్ఞాస్తథాపరే ।
స్వాధ్యాయజ్ఞానయజ్ఞాశ్చ యతయః సంశితవ్రతాః ॥

ఈ విధముగా కొందరు యజ్ఞముకొఱకు ద్రవ్యము యిచ్చెడి వారుందురు. కొందరు తపస్సు చేయువారుందురు. కొందరు అష్టాంగ యోగసాధన చేయువారుందురు. మరి కొందరు స్వాధ్యాయజ్ఞాన యజ్ఞములను చేయువారుందురు. వీరందరు కఠోర వ్రతములు చేయు ప్రయత్నశీలురైన యాజ్ఞికులు.

29 అపానే జుహ్వతి ప్రాణం ప్రాణేఽపానం తథాపరే ।
ప్రాణాపానగతీ రుద్ధ్వా ప్రాణాయామపరాయణాః ॥

ప్రాణాయామమును చేయువారెందరో అపానమును ప్రాణవాయువులో హోమము చేయుదురు. అటులనే ప్రాణ మును అపానములో హోమము చేయుదురు. లేక ప్రాణా పాన వాయువుల రెంటినీ నిరోధించుచుందురు.

వ్యాఖ్య : ప్రాణాయామము త్రివిధములుగా నుండును. రేచకము, పూరకము, కుంభకము. ప్రాణవాయు శబ్దమునకు సంస్కృత భాషలోగల అర్థము - హిందీ, గుజరాతీ భాషలలోని అర్థమునకు వ్యతిరేకముగా నున్నది. లోనుండి బయటకు

వచ్చుదానిని వారు ప్రాణవాయువందురు. సాధారణముగా మనము బయటినుండి లోనికి పీల్చుకొను గాలిని ప్రాణవాయువు ('ఆక్సిజన్') అని వ్యవహరింతుము.

30 అపరే నియతాహారాః ప్రాణాన్ప్రాణేషు జుహ్వతి।
సర్వేఽప్యేతే యజ్ఞవిదో యజ్ఞక్షయితకల్మషాః॥

మరికొందరు ఆహార నియమము కలవారై ప్రాణములను ప్రాణములందే హోమము చేయుదురు. ఎవరు యజ్ఞముల ద్వారా తమ పాపములను నశింప చేసికొందురో వారందరూ కూడ యజ్ఞములను తెలిసికొన్నవారే.

31 యజ్ఞశిష్టామృతభుజో యాంతి బ్రహ్మ సనాతనమ్।
నాయం లోకోఽస్త్యయజ్ఞస్య కుతోఽన్యః కురుసత్తమ॥

ఓ అర్జునా! యజ్ఞములు చేయగా మిగిలిన అమృతమును భుజించువారు సనాతనమైన బ్రహ్మను పొందుదురు. యజ్ఞము చేయనివారికి యీ లోకమే లేదు. అట్టియెడ పరలోకమెట్లు లభ్యమగును?

32 ఏవం బహువిధా యజ్ఞా వితతా బ్రహ్మణో ముఖే।
కర్మజాన్విద్ధి తాన్సర్వానేవం జ్ఞాత్వా మోక్ష్యసే॥

ఈ విధముగా వేదములలో అనేక విధములైన యజ్ఞములు వర్ణింపబడియున్నవి. ఇవన్నియు కర్మనుండి

ఉద్భవించినవేయని యెఱుంగుము ఈ విధముగా అన్నిటిని తెలిసికొని నీవు మోక్షము పొందెదవు.

వ్యాఖ్య : ఇక్కడ కర్మకు వ్యాపకమైన అర్థమును గ్రహించవలెను. అనగా - శరీరమునకు, మనస్సునకు మరియు ఆత్మకు సంబంధించిన కర్మలని అర్థము. అట్టి కర్మలేకుండా యజ్ఞము పరిపూర్తి కాజాలదు. యజ్ఞము లేకుండా మోక్షము రాదు. ఈ విధముగా తెలిసికొని తదనుసారము ఆచరించుటయే యజ్ఞమును తెలిసికొనుటయని చెప్పవచ్చును. మానవుడు తన శరీరమును, బుద్ధిని, ఆత్మను భగవంతుని ప్రీతికొఱకు లోకసేవయందు ఉపయోగించని యెడల అతడు దొంగయని పేర్కొనబడుచున్నాడు. మోక్షమునకు అర్హుడు కాజాలడని దీనిభావము. కేవలము బుద్ధిబలమునే ఉపయోగించి శరీరమును ఆత్మను దాచుకొనువాడు పూర్ణయాజ్ఞికుడు కాడు. ఈ శక్తులను సమకూర్చుకొనకుండా పరోపకారము కొఱకు వీటిని వినియోగించుట జరుగనేరదు. కనుక ఆత్మశుద్ధి లేనిది లోకసేవచేయుట అసంభవము. సేవకుడైనవానికి శరీరము, బుద్ధి, ఆత్మ, యీ మూడింటి ధర్మముల సంపుటిని సమానముగా వికసింపచేసికొనుట కర్తవ్యమైయున్నది.

33 శ్రేయాంద్రవ్యమయాద్యజ్ఞా జ్ఞానయజ్ఞః పరంతప ।
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే

ఓ అర్జునా! ద్రవ్యయజ్ఞము కంటె జ్ఞానయజ్ఞము శ్రేష్ఠమైనది. ఎందుకనగా - కర్మలన్నియు జ్ఞానమునందే పరిసమాప్తిని చేరుచున్నవి.

వ్యాఖ్య: పరోపకారబుద్ధితో యివ్వబడిన ద్రవ్యముకూడా జ్ఞానపూర్వకముగా యివ్వనియెడల తఱచుగా హాని కలిగించుచున్నది. ఇది అందరి అనుభవములో ఉన్నవిషయమే. మంచిబుద్ధితో చేయబడిన కర్మలన్నియు జ్ఞానముతో కూడియున్నపుడే రాణించుచున్నవి. అందుచేత కర్మలన్నియు జ్ఞానమునందే పూర్ణాహుతి చెందుచున్నవి.

34 తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా।
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వదర్శినః ॥

తత్త్వమెరిగిన జ్ఞానుల సేవచేసి వినయపూర్వకముగా వివేకవంతుడవై పదేపదే ప్రశ్నించి దీనిని నీవు తెలిసికొనుము. వారు నీ జిజ్ఞాసను తృప్తిపరచెదరు.

వ్యాఖ్య: జ్ఞానముపొందుటకు మూడు విధులున్నవి. ప్రణిపాతము, పరిప్రశ్న, సేవ. ఈ కాలంలో అందరూ వీటిని బాగుగా గుర్తుంచుకొనవలెను. ప్రణిపాతమనగా - నమ్రత, వివేకము; పరిప్రశ్న యనగా - మాటిమాటికి ప్రశ్నించుట; సేవ - సేవలేని వినయము ముఖస్తుతిగా పరిణమించును. జిజ్ఞాస లేనిదే జ్ఞానము కలుగదు. అందువలన జిజ్ఞాస

గల శిష్యుడు తనకు పూర్తిగా బోధపడునంత వరకు గురువును పదేపదే విధేయతతో ప్రశ్నించి తెలిసికొనవలెను. ఇదే జిజ్ఞాసకుగుర్తు. ఇందు శ్రద్ధ చాలా అవసరము. దేనియందు శ్రద్ధయుండదో దానియందు హృదయములో నమ్రభావము కూడా ఉండదు. నమ్రత, శ్రద్ధలేనివాడు సేవ ఎట్లు చేయగలడు ?

35 యజ్ఞాత్వా న పునర్మోహమేవం యాస్యసి పాండవ ।
యేన భూతాన్యశేషేణ ద్రక్ష్యస్యాత్మన్యథో మయి ॥

ఓ పాండవా ! ఈజ్ఞానము కలిగిన తదుపరి నీకు ఇట్టి మోహముకలుగదు. ఈ జ్ఞానము వలన నీవు సర్వభూతము లను ఆత్మయందు, నాయందును చూచెదవు.

వ్యాఖ్య : "యథాపిండే తథా బ్రహ్మాండే." అనుదానికి యిదియే అర్థము. ఆత్మసాక్షాత్కారము పొందిన వానికి తన ఆత్మయందు – పరుల ఆత్మయందును భేదము కనుపించదు.

36 అపి చేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః ।
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి ॥

నీవు మహాపాపివి అయినప్పటికినీ యీ పాపములన్నిటినీ జ్ఞానమనెడి నౌకద్వారా తరించగలవు.

37 యథైధాంసి సమిద్ధోఽగ్నిర్భస్మసాత్కురుతేఽర్జున ।
జ్ఞానాగ్నిః సర్వకర్మాణి భస్మసాత్కురుతే తథా ॥

ఓ అర్జునా ! మండుచున్న అగ్ని కట్టెలను భస్మము చేయువిధముగా జ్ఞానమనెడి అగ్ని అన్నికర్మలను భస్మము చేయును.

38 న హి జ్ఞానేన సదృశం పవిత్రమిహ విద్యతే ।
తత్స్వయం యోగ సంసిద్ధః కాలేనాత్మని విందతి ॥

జ్ఞానమువలె పవిత్రమైనది మరొకటి యీ ప్రపంచములో లేదు. యోగములోను, సమత్వములోను పరిపూర్ణత పొందిన మానవుడు కాలక్రమమున తనకు తానే అట్టి జ్ఞానమును పొందును.

39 శ్రద్ధావాన్ ల్లభతే జ్ఞానం తత్పరః సంయతేంద్రియః ।
జ్ఞానం లబ్ధ్వా పరాం శాంతి మచిరేణాధిగచ్ఛతి ॥

శ్రద్ధకలవాడు, ఈశ్వరపరాయణుడు, ఇంద్రియ నిగ్రహము కలవాడు జ్ఞానమును పొందును. జ్ఞానము పొందిన వెంటనే ఆతడు పరమశాంతిని పొందును.

40 అజ్ఞశ్చాశ్రద్దధానశ్చ సంశయాత్మా వినశ్యతి ।
నాయం లోకోఽస్తి న పరో న సుఖం సంశయాత్మన ॥

అజ్ఞాని, శ్రద్ధలేక సంశయాత్ముడైనవాడు నశించును. సంశయాత్మునకు ఇహలోకము లేదు, పరలోకమునూ లేదు. అతనికి ఎచటనూ సుఖము లేదు.

41 యోగ సంన్యస్తకర్మాణం జ్ఞానసంఛిన్న సంశయం ।
ఆత్మవంతం న కర్మాణి నిబధ్నంతి ధనంజయ ॥

అర్జునా! సమబుద్ధియనెడి యోగముద్వారా కర్మలను అనగా కర్మఫలమును త్యజించి, జ్ఞానముద్వారా సంశయనివృత్తి చేసికొనిన ఆత్మసాక్షాత్కారపరునకు కర్మలు బంధనములు కావు.

42 తస్మాదజ్ఞానసంభూతం హృత్స్థం జ్ఞానాసినాత్మనః ।
ఛిత్త్వైనం సంశయం యోగమాతిష్ఠోత్తిష్ఠ భారత ॥

అందువలన ఓ అర్జునా! హృదయమునందు అజ్ఞానమువలన కలిగిన సంశయమును ఆత్మజ్ఞానమనెడి కత్తితో ఛేదించి యోగము - సమత్వమును కలిగి నిలబడుము. యుద్ధమునకు సంసిద్ధుడవుకమ్ము.

ఓం తత్ సత్

ఈ విధముగా ఉపనిషదర్థ ప్రతిపాదకము బ్రహ్మ విద్యా
విషయిక యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున
సంవాదమును అగు భగవద్గీతలోని
జ్ఞాన కర్మసన్యాసయోగమను
నాల్గవ అధ్యాయము
సమాప్తము

# ఐదవ అధ్యాయము
## కర్మసన్న్యాస యోగము

కర్మయోగము లేనిదే కర్మసన్న్యాసము పొసగనేరదు. వాస్తవమునకు యీ రెండునూ ఒకటేయని ఈ అధ్యాయమునందు విశదీకరింపబడినది.

అర్జున ఉవాచ—

1. సంన్యాసం కర్మణాం కృష్ణ పునర్యోగం చ శంససి।
యచ్ఛ్రేయ ఏతయోరేకం తన్మే బ్రూహి సునిశ్చితమ్॥

అర్జునుడు ప్రశ్నించుచున్నాడు :

ఓ కృష్ణా! నీవు ఒక పర్యాయము కర్మత్యాగమును గురించి, మరొకపుడు కర్మయోగమును గురించియూ ప్రశంసించుచున్నావు. ఈ రెంటిలో నాకు ఏది శ్రేయస్కరమో నిర్ధారణచేసి స్పష్టముగా తెలియజెప్పుము.

శ్రీభగవానువాచ:—

2. సంన్యాసః కర్మయోగశ్చ నిఃశ్రేయసకరావుభౌ।
తయోస్తు కర్మసంన్యాసాత్కర్మయోగో విశిష్యతే॥

శ్రీకృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు :

కర్మత్యాగము, కర్మయోగము రెండునూ మోక్షదాయకములే. వాటిలో కర్మసన్న్యాసముకంటె కర్మయోగమే శ్రేష్ఠమైనది.

3. జ్ఞేయః స నిత్యసంన్యాసీ యో న ద్వేష్టి నకాంక్షతి।
నిర్ద్వంద్వోహి మహాబాహో సుఖం బంధాత్ప్రముచ్యతే॥

రాగద్వేషములు లేనివాడు సదా సన్యాసియని తెలిసికొనుము. సుఖ దుఃఖములు మొదలగు ద్వంద్వములనుండి విముక్తుడైనవాడు సులభముగా సంసారబంధముల నుండి విముక్తుడగును.

వ్యాఖ్య : దీని అర్థమేమనగా కర్మలను త్యజించుటయే సన్యాసము యొక్క లక్షణము కాజాలదు. కాని ద్వంద్వములకు అతీతుడై యుండుటయే సన్యాసముయొక్క ముఖ్యలక్షణము. ఒకడు కర్మ చేయుచుండియూ సన్యాసి కాగలడు. మరియొకడు కర్మ చేయకపోయినప్పటికినీ మిథ్యాచారియగును. కర్మసన్యాసి కాజాలడు.

(మూడవ అధ్యాయములో 6 వ శ్లోకమును చూడుడు.)

4. సాంఖ్యయోగౌ పృథగ్బాలాః ప్రవదంతి నపండితాః।
ఏకమప్యాస్థితః సమ్య గుభయోర్విందతే ఫలమ్॥

సాంఖ్యము (జ్ఞానయోగము), యోగము (కర్మయోగము) వేరు వేరని అజ్ఞానులు తలచెదరు. కాని పండితులట్లు తలచరు. ఏ ఒకదానినైననూ స్థిరముగా ఆచరించినచో రెండింటి ప్రయోజనమును పొందెదరు.

వ్యాఖ్య : జ్ఞానయోగి లోకసంగ్రహ రూపమగు కర్మ యోగము యొక్క విశేషఫలమును సంకల్ప మాత్రముచేతనే పొందుచున్నాడు. కర్మయోగి యైన అనాసక్తివలన బాహ్యకర్మలు చేయుచుండియు జ్ఞానయోగి పొందుశాంతిని సులభముగా పొందుచున్నాడు.

5 యత్సాంఖ్యైః ప్రాప్యతే స్థానం తద్యోగైరపి గమ్యతే।
ఏకం సాంఖ్యం చ యోగం చ యః పశ్యతి స పశ్యతి॥

సాంఖ్యమార్గము (జ్ఞానమార్గము)ను అనుసరించినవాడు పొందుస్థానమునే యోగి (కర్మయోగి)కూడా పొందుచున్నాడు. సాంఖ్యమును యోగమును ఒకటిగా చూచువాడే నిజమైన ద్రష్ట.

6 సంన్యాసస్తు మహాబాహో దుఃఖమాప్తుమయోగతః।
యోగయుక్తో మునిర్బ్రహ్మ న చిరేణాధిగచ్ఛతి॥

ఓ అర్జునా! కర్మయోగములేనిది కర్మత్యాగము దుస్సాధ్యము. కాని సమబుద్ధిగల మునీశ్వరుడు శీఘ్రముగా మోక్షమును పొందుచున్నాడు.

7 యోగయుక్తో విశుద్ధాత్మా విజితాత్మా జితేంద్రియః।
సర్వభూతాత్మభూతాత్మా కుర్వన్నపి న లిప్యతే॥

యోగమును సాధించినవాడు, హృదయమును పరిశుద్ధము చేసికొన్నవాడు, మనసును, ఇంద్రియములను

జయించినవాడు, సర్వభూతములను తనవలె భావించుకొను వాడు కర్మచేయుచున్నప్పటికిని నిర్లిప్తుడుగానుండును.

8 నైవ కించిత్కరోమీతి యుక్తో మన్యేత తత్త్వవిత్।
పశ్యన్ శృణ్వన్ స్పృశన్ జిఘ్రన్
అశ్నన్ గచ్ఛన్ స్వపన్ ఛ్వసన్॥

9 ప్రలప న్విసృజన్ గృహ్ణన్ ఉన్మిషన్ నిమిషన్నపి।
ఇంద్రియాణీంద్రియార్థేషు వర్తంత ఇతి ధారయన్॥

చూచుచు, వినుచు, స్పృశించుచు, వాసనచూచుచు, తినుచు, నడచుచు, నిద్రించుచు, శ్వాసపీల్చుచు, విడుచుచు, మాట్లాడుచు, వదలుచు, తీసికొనుచు, కన్నులు తెరచుచు, మూయుచుకూడా తత్త్వము తెలిసినయోగి తానేమియు చేయుటలేదనియు, ఇంద్రియములే తమ తమ పనులు చేయుచున్నవనియు భావించును.

వ్యాఖ్య : అభిమానమున్నంతవరకు ఇట్టి నిర్లిప్తస్థితి లభించదు. విషయలోలుడు విషయభోగములను తాను అనుభవించుటలేదని, ఇంద్రియములు తమ తమ పనులు చేయుచున్నవని చెప్పి తాను పాపముల నుండి తప్పించుకొనజాలడు. ఈవిధముగా అపార్థముచేయువాడు గీతను అర్థముచేసికొనలేదు, ధర్మమును తెలిసికొనలేదు. ఈ విషయమునే క్రింది శ్లోకము స్పష్టపరచుచున్నది.

10 బ్రహ్మణ్యాధాయ కర్మాణి సంగం త్యక్త్వాకరోతి యః।
లిప్యతే న స పాపేన పద్మపత్రమివాంభసా॥

ఈశ్వరార్పణముగావించి ఆసక్తిరహితుడై (ఫలాశ వదలి) కర్మల నాచరించువాడు నీటిలోనుండియు కమలము నీటిని అంటుకొనని విధముగా పాపములనుండి నిర్లిప్తుడై యుండును.

11 కాయేన మనసా బుద్ధ్యా కేవలై రింద్రియైరపి।
యోగినః కర్మ కుర్వంతి సంగం త్యక్త్వాత్మశుద్ధయే॥

శరీరముతో, మనసుతో, బుద్ధితోను, కేవలం ఇంద్రియములతోనైననూ ఆసక్తిరహితులై యోగులు ఆత్మశుద్ధి కొఱకు కర్మలు చేయుదురు.

12 యుక్తః కర్మఫలం త్యక్త్వా శాంతిమాప్నోతి నైష్ఠికీమ్।
అయుక్తః కామకారేణ ఫలే సక్తో నిబధ్యతే॥

సమబుద్ధికలవాడు కర్మఫలమును త్యజించి పరమ శాంతినిపొందును. స్థిరచిత్తములేనివాడు కోరికలు కలిగి యున్నందువలన కర్మఫలమును ఆశించి బంధములలో చిక్కు పడును.

13 సర్వకర్మాణి మనసా సంన్యస్యాఽఽస్తే సుఖం వశీ।
నవద్వారే పురే దేహీ నైవ కుర్వన్న కారయన్॥

నిగ్రహముకలవాడు మనసుచే కర్మలన్నిటినీ త్యజించి నవద్వారములుగల నగరమనెడి యీ శరీరములోనుండియూ కూడా ఏమియూ చేయక, చేయించక సుఖముగా ఉండ గలుగుచున్నాడు.

వ్యాఖ్య : ముక్కు రంధ్రములు రెండు, రెండు చెవులు, రెండు కళ్లు, మలమూత్ర విసర్జనామార్గములు రెండు, నోరు-ఇవి శరీరమున ముఖ్యమైన నవద్వార ములు. ఇంకను చర్మములో అసంఖ్యాకములైన రంధ్రములున్నవి. ఈ ద్వారముల కాపలాదారు లోనికి రాదగిన అర్థులను మాత్రమే రాని చ్చుచు, పోనిచ్చుచు తన ధర్మమును సరిగా నెర వేర్చినచో - రాకపోకలనెడి కర్మలు జరుగు చున్నప్పటికినీ అతడు బాధ్యుడుగాక కేవలము సాక్షిగా మాత్రమే ఉండును. అందుచే అతడు కర్మచేయుటయూ లేదు, చేయించుటయునూ లేదు.

14 న కర్తృత్వం న కర్మాణి లోకస్య సృజతి ప్రభుః।
న కర్మఫలసంయోగం స్వభావస్తు ప్రవర్తతే॥

సర్వజగత్తునకు ప్రభువైన ఈశ్వరుడు కర్తృత్వ మునుగాని, కర్మనుగాని సృష్టించుటలేదు. కర్మ- దాని ఫలి తమునకుగల సంబంధమునుకూడ స్థాపించలేదు. ప్రకృతియే అన్నిటిని చేయుచున్నది.

వ్యాఖ్య : ఈశ్వరుడు కర్త కాడు. కర్మయొక్క నియమము స్థిరమైనది, అనివార్యమైనది. ఎవరు ఎట్టి కర్మలాచరింతురో వారికి అట్టి ఫలితములే లభించును. ఇందులోనే ఈశ్వరుని అనంతదయ, న్యాయము నిండియున్నవి. నిర్దుష్టమైన న్యాయములో విశుద్ధమైన దయయుండును. న్యాయసమ్మతము కాని దయ దయకాదు, అది క్రూరత్వమేయగును. కాని మనుష్యుడు త్రికాలవేది (జ్ఞాని) కాడు గదా! అందుచే దయ, క్షమలే అతనికి తెలిసిన న్యాయము. అతడెల్లపుడు స్వయముగా న్యాయమునకు పాత్రుడై క్షమనుయాచించును. ఇతరులకును క్షమద్వారానే న్యాయము కలుగజేయజూచును. క్షమాగుణమును వికసింపచేసికొనుట వల్లనే చివరకు అకర్తయై, యోగియై, సమబుద్ధి కలవాడై కర్మాచరణమునందు నేర్పరియగును.

15 నాదత్తే కస్యచిత్ పాపం న చైవ సుకృతం విభుః।
అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః॥

భగవంతుడు ఎవరి పాప పుణ్యములనుగాని తన మీాద వేసికొనడు. అజ్ఞానమువలన జ్ఞానము మరుగుపడుటచే జనులు మోహములో చిక్కుకొనుచున్నారు.

వ్యాఖ్య : అజ్ఞానముచేత 'నేను కర్తను' అనుభావముతో కర్మ బంధములలో తగుల్కొనుచున్నాడు. అయినప్పటికీ మంచిచెడ్డల ఫలితమును భగవంతుని యందు ఆరోపించుచున్నాడు. ఇదియే మోహజాలము.

16 జ్ఞానేన తు తదజ్ఞానం యేషాం నాశితమాత్మనః ।
తేషామాదిత్యవత్ జ్ఞానం ప్రకాశయతి తత్పరమ్ ॥

కాని, ఎవరి అజ్ఞానము ఆత్మజ్ఞానముచే నశించిపోయినదో అట్టివాని జ్ఞానము సూర్యునివలె ప్రకాశవంతమై పరతత్త్వమును దర్శింపజేయుచున్నది.

17. తద్బుద్ధయ స్తదాత్మాన స్తన్నిష్ఠాస్తత్పరాయణాః ॥
గచ్ఛంత్యపునరావృత్తిం జ్ఞాననిర్ధూతకల్మషాః ॥

ఎవరు జ్ఞానముచే తమ పాపప్రక్షాళనము చేసికొని ఈశ్వర ధ్యానముచేయుచు అందు తన్మయులై - అనగా ధ్యానము నందే స్థిరముగానుండి, దానినే సర్వస్వముగా భావించుదురో వారు మోక్షమును పొందుదురు.

18. విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శినః ॥

విద్వాంసుడు, వినయగుణ సంపన్నుడైన బ్రాహ్మణుని యందు, పశు పక్ష్యాదులగు - ఆవు, ఏనుగు, కుక్క

యందును, ఆఖరికి కుక్కమాంసము భుజించు వారియందును జ్ఞానులు సమభావము కలిగియుందురు.

వ్యాఖ్య: వారి వారి అవసరముల ననుసరించి జ్ఞానులు అందరికీ సేవచేయుదురని దీని తాత్పర్యము. బ్రాహ్మణుని యందును, చండాలుని యందును సమభావము కలిగియుండుట అనగా-బ్రాహ్మణునకు పాము కఱచినపుడు అతని గాయమునుండి వెలువడు విషపు రక్తమును జ్ఞాని ప్రేమ భావముతో పీల్చి విషమును తొలగించుటకు ప్రయత్నించును. అటులనే చండాలునకు పాము కఱచినపుడుకూడా ప్రేమ భావముతోనే సేవచేయును.

19. ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః॥

ఎవని మనసు సమభావముతో స్థిరపడియుండునో అట్టివాడు ప్రపంచమును జయించినవాడగును. బ్రహ్మము నిష్కలంకమై, సమభావము కలిగినట్టిదై యున్నది. కనుక అట్టివాడు బ్రహ్మమందే స్థిరుడై యుండును.

వ్యాఖ్య: మానవుడు ఎవ్విధముగా దేనిని చింతనచేయునో ఆవిధముగా రూపొందును. అందువలన సమత్వమును చింతనచేసి దోషరహితుడై సమత్వమూర్తీభవించిన నిష్కలంకమైన బ్రహ్మను పొందుచున్నాడు.

యందును, ఆఖరికి కుక్కమాంసము భుజించు వారియందును జ్ఞానులు సమభావము కలిగియుందురు.

వ్యాఖ్య: వారి వారి అవసరముల ననుసరించి జ్ఞానులు అందరికీ సేవచేయుదురని దీని తాత్పర్యము. బ్రాహ్మణుని యందును, చండాలుని యందును సమభావము కలిగియుండుట అనగా-బ్రాహ్మణునకు పాము కఱచినప్పుడు అతని గాయమునుండి వెలువడు విషపు రక్తమును జ్ఞాని ప్రేమ భావముతో పీల్చి విషమును తొలగించుటకు ప్రయత్నించును. అటులనే చండాలునకు పాము కఱచినప్పుడుకూడా ప్రేమ భావముతోనే సేవచేయును.

19. ఇహైవ తైర్జితః సర్గో యేషాం సామ్యే స్థితం మనః।
నిర్దోషం హి సమం బ్రహ్మ తస్మాద్బ్రహ్మణి తే స్థితాః॥

ఎవని మనసు సమభావముతో స్థిరపడియుండునో అట్టివాడు ప్రపంచమును జయించినవాడగును. బ్రహ్మము నిష్కలంకమై, సమభావము కలిగినట్టిదై యున్నది. కనుక అట్టివాడు బ్రహ్మమందే స్థిరుడై యుండును.

వ్యాఖ్య: మానవుడు ఎవ్విధముగా దేనిని చింతనచేయునో ఆవిధముగా రూపొందును. అందువలన సమత్వమును చింతనచేసి దోషరహితుడై సమత్వము మూర్తీభవించిన నిష్కలంకమైన బ్రహ్మను పొందుచున్నాడు.

విషయజన్యభోగములు తప్పనిసరిగా దుఃఖకారణము లగుచున్నవి. ఓ అర్జునా! అవి ఆది అంతములు కలవి. అనగా పుట్టిగిట్టునవి. బుద్ధిమంతుడు వాటియందు మనస్సును లగ్నముచేయడు.

23 శక్నోతీహైవ యః సోఢుం ప్రాక్శరీరవిమోక్షణాత్।
కామక్రోధోద్భవం వేగం స యుక్తః స సుఖీ నరః॥

దేహము చాలించుటకుముందే అనగా జీవించియున్నపుడే ఏ మానవుడు కామక్రోధముల తీవ్రతను సహించు శక్తిని సంపాదించుచున్నాడో వాడే సమత్వమును పొందిన వాడై సుఖించును.

వ్యాఖ్య : చనిపోయిన శరీరానికి కోరికలు, ద్వేషము, సుఖ-దుఃఖాలు లేనివిధంగా జీవించియున్నపుడుకూడా శవమువలె; జడభరతునివలె; దేహమునకు అతీతుడుగానుండగలిగినవాడు ఈ ప్రపంచమును జయించినవాడగును. అట్టివాడు నిజమైన సుఖమేదో తెలిసికొనును.

24 యోఽంతఃసుఖోఽంతరారామ స్తదాంతర్జ్యోతిరేవ యః।
సయోగీ బ్రహ్మనిర్వాణం బ్రహ్మభూతోఽధిగచ్ఛతి॥

అంతరంగమందు ఆనందమును పొందినవాడు, హృదయములో శాంతిని పొందినవాడు, ఆత్మజ్ఞానమును పొందిన

వాడు బ్రహ్మరూపమైన యోగియై బ్రహ్మ నిర్వాణమును పొందును.

25 లభంతే బ్రహ్మనిర్వాణమృషయః క్షీణకల్మషాః।
ఛిన్నద్వైధా యతాత్మానః సర్వభూతహితే రతాః॥

పాపములన్నియు నశించిన, సంశయము లన్నియు నమసి శాంతిపొందిన, మనసును స్వాధీనమందుంచుకొన్న సర్వప్రాణుల హితమునందే నిమగ్నుడై యుండు ఋషి బ్రహ్మనిర్వాణమును పొందును.

26 కామక్రోధవియుక్తానాం యతీనాం యతచేతసామ్।
అభితో బ్రహ్మనిర్వాణం వర్తతే విదితాత్మనామ్॥

తనను తాను యెరిగినట్టి, కామక్రోధములను జయించి నట్టి, మనసును స్వాధీనపరచుకొన్నట్టి యతీశ్వరులకు సర్వత్ర బ్రహ్మానందమే యగును.

27 స్పర్శాన్ కృత్వాంబహిర్బాహ్య శ్చక్షుశ్చై వాంతరేభ్రువోః।
ప్రాణాపాదో సమౌ కృత్వా నాసాభ్యంతరచారిణౌ॥

28 యతేంద్రియమనోబుద్ధిర్మునిర్మోక్షపరాయణః।
విగతేచ్ఛాభయక్రోధో యః సదా ముక్త ఏవ సః॥

బాహ్యవిషయ భోగములను వదలివేసి, దృష్టిని కను బొమలనడుమ నిలిపి, నాసికద్వారా పీల్చి, వదలునట్టి

ప్రాణ అపానవాయువులయొక్క గతిని సమముచేసి, ఇంద్రియములను, మనస్సును, బుద్ధిని స్వాధీనమొనర్చుకొని, రాగభయ క్రోధములనువిడచి మోక్షపరాయణులై యుండు మునీశ్వరులు ఎల్లప్పుడు ముక్తులై యుందురు.

వ్యాఖ్య: ఈ శ్లోకములలో యోగాభ్యాసమునకు సంబంధించిన ప్రాణాయామము మున్నగు యోగిక క్రియలు సమర్థించబడినవి. ప్రాణాయామము మొదలగునవి బాహ్యక్రియలు. వాటి ప్రభావము శరీరమును ఆరోగ్యముగనుంచుటకు, పరమాత్మ నివసించుటకు యోగ్యమైన మందిరముగ సిద్ధపరచుటకు మాత్రమే పరిమితమైనది. భోగియగువానికి సాధారణ వ్యాయామమువలన కలుగుఫలితము యోగికి ప్రాణాయామము ద్వారా సమకూడుచున్నది. భోగి యొక్క వ్యాయామము వాని ఇంద్రియములను ఉత్తేజపరుచుటలో సహాయపడుచున్నది. యోగి యొక్క ప్రాణాయామము శరీరమును ఆరోగ్యముగను, దృఢముగనునుంచి ఇంద్రియములను శాంతపరచుటకు ఉపయోగపడుచున్నది. ఈ రోజులలో ప్రాణాయామము యొక్క విధివిధానము చాలకొద్దిమందికే తెలియును. అట్లు తెలిసినవారిలోకూడ బహుకొద్దిమంది మాత్రమే దానిని సద్వినియోగపరచుచున్నారు. ఇంద్రియములను, మనస్సును బుద్ధిని - సంపూర్ణముగా గాకపోయిననూ కొంతవరకైనా

జయించి స్వాధీనమందుంచుకొని, మోక్షము కావలెనను తీవ్రమైన కోరికకలిగి, రాగద్వేషములను జయించి, భయమును విడనాడిన వానికి ప్రాణాయామాదులు ఉపయోగకరములు, సహాయకారులగుచున్నవి. అంతరంగశుద్ధిలేని ప్రాణాయామాదులు బంధనములకే సాధనములై మానవుని మోహకూపములోనికి దిగజార్చుచున్నవని అనేకుల అనుభవములు తెలుపుచున్నవి. కనుకనే యోగీంద్రుడగు పతంజలి యమనియమములకు ప్రథమ స్థానమిచ్చి సాధకునకు మోక్షమార్గములో ప్రాణాయామాదులు సహకరించునని చెప్పినాడు.

యమములు అయిదు : అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము.

నియమములు అయిదు : శౌచము, సంతోషము, తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ధ్యానము.

29 భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరమ్।
సుహృదయం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతిమృచ్ఛతి।

యజ్ఞమునకు తపస్సునకు భోక్తగాను, సర్వలోకములకు మహేశ్వరునిగను, సర్వభూతములకు హితము చేయువాడుగను 'నన్ను' ఎరిగిన మునీశ్వరుడు శాంతిని పొందును.

వ్యాఖ్య : ఈ అధ్యాయములోని పదునాలుగు, పదిహేనవ శ్లోకములు మరికొన్ని యిటువంటి శ్లోకములకును ఈశ్లోకము విరుద్ధముగానున్నదని ఎవరును భావించ రాదు. ఈశ్వరుడు సర్వశక్తిమంతుడై యుండి కూడ 'కర్త - అకర్త'; 'భోక్త - అభోక్త' అని మనము ఎట్లు భావించిన అట్లే యుండును. భగవం తుడు వర్ణనాతీతుడు. మానవ భాషకు అతీతుడు. అందుచేత పరస్పర విరుద్ధ గుణములను శక్తులను కూడా ఆతనియందు ఆరోపించి మానవుడు అట్టి పరమాత్మను దిఙ్మాత్రముగానైనను దర్శింప గోరుచున్నాడు.

ఈవిధముగా ఉపనిషదర్థ ప్రతిపాదకము, బ్రహ్మ విద్యా విషయిక యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదమును అగు భగవద్గీతలోని కర్మసన్యాసయోగమును అయిదవ అధ్యాయము ముగిసినది.

ఓం తత్ సత్ !

# ఆరవ అధ్యాయము

## ధ్యాన యోగము

ఈ అధ్యాయములో యోగసాధనకు, సమత్వప్రాప్తికి యెన్నో సాధనలు తెలుపబడినవి.

శ్రీ భగవానువాచ :—

1. అనాశ్రితః కర్మఫలం కార్యం కర్మ కరోతి యః ।
న సంన్యాసీ చ యోగీ చ న నిరగ్నిర్న చాక్రియః ॥

శ్రీకృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు :

కర్మఫలము మీద ఆధారపడక కర్తవ్యమును నెరవేర్చువాడు సన్యాసి, యోగి అగును. అగ్నిహోత్రమును, మరియు ఇతర కర్మలన్నింటిని విడిచి కూర్చుండువాడు యోగి కాజాలడు.

వ్యాఖ్య : అగ్ని అనగా సమస్త సాధనములని తాత్పర్యం. అగ్నిద్వారా హోమము చేయు కాలములో అగ్ని అవసరమైయుండెడిది. ఈరోజుల్లో సేవచేయుటకు రాట్నచక్రము సాధనమైనదనుకొనుడు. దానిని త్యజించుటవలన సన్యాసికాజాలడు.

2. యం సన్యాసమితి ప్రాహుర్యోగం తం విద్ధి పాండవ ।
న హ్యసంన్యస్తసంకల్పో యోగీ భవతి కశ్చన ॥

ఓ అర్జునా! సన్న్యాసమని చెప్పబడుదానిని నీవు యోగముగా తెలిసికొనుము. మనసులోని సంకల్పములను విడిచిపెట్టలేనివాడు ఎన్నటికిని యోగి కాజాలడు.

3. ఆరురుక్షోర్మునేర్యోగం కర్మ కారణముచ్యతే।
యోగారూఢస్య తస్యైవ శమః కారణముచ్యతే॥

యోగమును సాధనచేయువానికి కర్మసాధనమనియును యోగసిద్ధిపొందిన జ్ఞానికి శాంతియే మోక్ష సాధనమగుచున్నదనియు చెప్పబడుచున్నది.

వ్యాఖ్య: ఆత్మశుద్ధి కలిగినవానికి సమత్వము సిద్ధించినవానికి ఆత్మసాక్షాత్కారము సహజముగా కలుగును. యోగారూఢుడు లోకకళ్యాణ కర్మలను చేయవలసిన అవసరములేదని దీని అర్థముకాదు. లోకకళ్యాణార్థమై కర్మలు చేయకుండా అతడు జీవింపలేడు. సేవచేయుట అతనికి సహజగుణమగును. ఆడంబరముకొరకై అతడేపనియు చేయడు. మూడవ అధ్యాయములో నాల్గవ శ్లోకము, అయిదవ అధ్యాయంలో రెండవ శ్లోకములను చూడుడు.

4. యదా హి నేంద్రియార్థేషు న కర్మస్వనుషజ్జతే।
సర్వసంకల్పసంన్యాసీ యోగారూఢస్తదోచ్యతే॥

మానవుడు ఇంద్రియముల యొక్క విషయవాసనల యందు లేక కర్మలయందు ఆసక్తి విడచి అన్ని సంకల్పము లను త్యజించినపుడు యోగారూఢుడని చెప్పబడుచున్నాడు.

5. ఉద్ధరేదాత్మనాత్మానం నాత్మానమవసాదయేత్ ।
ఆత్మైవ హ్యాత్మనో బంధురాత్మైవ రిపురాత్మనః ।

మానవుడు ఆత్మచేతనే ఆత్మోద్ధరణము చేసికొన వలెను. దానిని అధోగతిపాలు చేయరాదు. ఆత్మయే తనకు బంధువు, అదియే తనకు శత్రువు అగును.

6. బంధురాత్మాత్మనస్తస్య యేనాత్మైవాత్మనా జితః ।
అనాత్మనస్తు శత్రుత్వే వర్తేతాత్మైవ శత్రువత్ ।

తన ఆత్మబలముచేత మనస్సును జయించినవానికి ఆత్మయే బంధువగును. ఆత్మను జయించనివాడు తనయెడల తానే శత్రువుగా వ్యవహరించును.

7. జితాత్మనః ప్రశాంతస్య పరమాత్మా సమాహితః ।
శీతోష్ణసుఖదుఃఖేషు తథా మానావమానయోః ॥

మనస్సును జయించి సంపూర్ణమైన శాంతిని పొందిన వానిఆత్మ శీతోష్ణములు, సుఖ - దుఃఖములు, మానావ మానములందు ఒకేరీతిగానుండును.

8. జ్ఞానవిజ్ఞానతృప్తాత్మా కూటస్థో విజితేంద్రియః ।
యుక్త ఇత్యుచ్యతే యోగీ సమలోష్టాశ్మకాంచనః ॥

జ్ఞాన, అనుభవములద్వారా తృప్తినిపొంది స్థిరుడై ఇంద్రియములను జయించినవానికి రాయి, మట్టి, బంగారములు సమముగా భాసించును. అట్టి ఈశ్వరపరాయణుడైన మానవుడు యోగి అనబడుచున్నాడు.

9. సుహృన్మిత్రార్యుదాసీనమధ్యస్థద్వేష్యబంధుషు ।
సాధుష్వపి చ పాపేషు సమబుద్ధిర్విశిష్యతే ॥

తన హితము కోరువారియందును, మిత్రునియందును, శత్రువునందును, ఇరుపక్షముల మేలుకోరు నిష్పక్షపాతియగు వానియందును, ద్వేషియందును, బంధువునందును, పుణ్యాత్మునియందును, పాపియగువానియందును అనగా అందరియందును సమభావము కలిగియుండువాడు శ్రేష్ఠుడు.

10. యోగీ యుంజీత సతతమాత్మానం రహసి స్థితః ॥
ఏకాకీ యతచిత్తాత్మా నిరాశీరపరిగ్రహః ।

స్థిరచిత్తుడై విషయవాసనలను, సంగ్రహమును త్యజించి ఒంటరిగా ఏకాంతములోనుండి యోగి నిరంతరము ఆత్మను పరమాత్మయందు లగ్నముచేయును.

11. శుచౌ దేశే ప్రతిష్ఠాప్య స్థిరమాసనమాత్మనః ।
నాత్యుచ్ఛ్రితం నాతినీచం చైలాజినకుశోత్తరమ్ ॥

12. తత్రైకాగ్రం మనః కృత్వా యతచిత్తేంద్రియక్రియః ।
ఉపవిశ్యాసనే యుంజ్యాద్యోగమాత్మవిశుద్ధయే ॥

పవిత్ర స్థలమునందు దర్భలు, జింకచర్మము, వస్త్రము ఒకదానిమీద ఒకటిపరచి అంతయెక్కువగాను మరిఅంత తక్కువగాను ఎత్తులేనిచోట తనకొరకు స్థిరమైన ఆసనమును ఏర్పరచుకొనవలెను. దానిమీద కూర్చుని ఏకాగ్ర చిత్తముతో మనస్సును, ఇంద్రియములను వశమందుంచుకొని ఆత్మశుద్ధికై యోగసాధనము చేయవలెను.

13. సమం కాయశిరోగ్రీవం ధారయ న్నచలం స్థిరః ।
సంప్రేక్ష్య నాసికాగ్రం స్వం దిశశ్చానవలోకయన్ ॥

14. ప్రశాంతాత్మా విగతభీర్బ్రహ్మచారివ్రతే స్థితః ।
మనః సంయమ్య మచ్చిత్తో యుక్త ఆసీత మత్పరః ।

శరీరము, మెడ, తలను నిటారుగా కదలకుండా ఉంచి స్థిరుడై ఇటునటుచూడక నాసికాగ్రమున దృష్టిని కేంద్రీకరించి, పరిపూర్ణమైన శాంతితో నిర్భయుడై దృఢముగా బ్రహ్మచర్యము నవలంబించి మనస్సును జయించి నాయందే చిత్తము కలవాడైన యోగి నన్నే ధ్యానించుచుండును.

వ్యాఖ్య : నాసికాగ్రమనగా కనుబొమల మధ్యభాగము. (అయిదవ అధ్యాయం ఇరవై యేడవ శ్లోకము చూడుడు.) బ్రహ్మచర్యవ్రత మనగా కేవలము వీర్యనిగ్రహము నేకాదు, దానితోపాటు బ్రహ్మను పొందుటకు అవసరమైన అహింసాది వ్రతములను పాటించుటకూడా అవసరము.

15. యుంజన్నేవం సదాత్మానం యోగీ నియతమానసః
శాంతిం నిర్వాణపరమాం మత్సంస్థామధిగచ్ఛతి ॥

ఈ విధముగా మనస్సును నిగ్రహించిన యోగి ఆత్మను పరమాత్మతో సంధానముగావించును. మరియు నన్ను పొందుటవలన కలిగెడి మోక్షమను పరమశాంతిని పొందుచున్నాడు.

16. నాత్యశ్నతస్తుయోగోఽస్తిన చైకాంతమనశ్నతః ।
నచాతిస్వప్నశీలస్య జాగ్రతో నైవ చార్జున ॥

ఓ అర్జునా ! ఈ సమత్వమనెడి యోగము మితిమీరి భుజించువానికి కుదరదు. కేవలము ఉపవాసము చేయువానికి కలుగదు. అటులనే అతినిద్రాపరునకు, మితిమీరి మేలుకొను వానికికూడా లభించదు.

17. యుక్తాహారవిహారస్య యుక్తచేష్టస్య కర్మసు ।
యుక్తస్వప్నావబోధస్య యోగో భవతి దుఃఖహా ॥

ఆహార విహారములలోను, ఇతర కర్మలలోను- నిద్రించుట మేల్కొనుటలో కూడా మితముగానుండు వాని యోగము దుఃఖమును పోగొట్టునదియగును.

18. యదా వినియతం చిత్తమాత్మన్యేవావతిష్ఠతే।
నిఃస్పృహః సర్వకామేభ్యో యుక్త ఇత్యుచ్యతే తదా ॥

బాగుగా నియమబద్ధమైన మనస్సు ఆత్మలో స్థిరమై యున్నపుడు, మానవుడు కోరికలన్నింటియందు నిర్లిప్త భావము కలిగియుండును. అపుడతడు యోగియని పిలువబడు చున్నాడు.

19. యథా దీపో నివాతస్థో నేంగతే సోపమా స్మృతా ।
యోగినో యతచిత్తస్య యుంజతో యోగమాత్మనః ॥

గాలి లేనిచోట నుంచబడిన దీపము ఎట్లు నిశ్చల ముగానుండునో అటులనే ఆత్మను పరమాత్మతో సంధా నముచేయ ప్రయత్నించు స్థిరచిత్తుడైన యోగియొక్క స్థితి నిశ్చలముగానుండును.

20. యత్రోపరమతె చిత్తం నిరుద్ధం యోగసేవయాః ।
యత్ర చైవాత్మనాత్మానం పశ్యన్నాత్మని తుష్యతి ॥

21 సుఖమాత్యంతికం యత్తద్బుద్ధిగ్రాహ్యమతీంద్రియమ్ ।
వేత్తి యత్ర న చైవాయం స్థితశ్చలతి తత్త్వతః ॥

22. యం లబ్ధ్వా చాపరం లాభం మన్యతే నాధికం తతః ।
యస్మిన్‌స్థితో న దుఃఖేన గురుణాపి విచాల్యతే॥

23. తం విద్యాద్దుఃఖసంయోగ వియోగం యోగసంజ్ఞితమ్ ।
స నిశ్చయేన యోక్తవ్యో యోగోऽనిర్విణ్ణచేతసా ॥

ఎవనియందు యోగానుష్ఠానముచేత మనసు స్వాధీ నమై శాంతిని పొందునో, ఎవడు ఆత్మద్వారా ఆత్మను

గుర్తించి ఆత్మలోనే సంతోషమును పొందునో మరియు ఇంద్రియములకు అతీతమైన బుద్ధిద్వారా గ్రహించదగిన అనంత సుఖానుభవము ఎచటకల్గునో, ఎచటనుండినట్లయితే మానవుడు మూలవస్తువు (ఆత్మతత్త్వము) నుండి చలించబడడో, దేనిని పొందిన పిమ్మట వేరొకలాభము వుండదని తెలియునో, దేనియందు స్థిరుడై వుండిన ఘోర దుఃఖములో కూడా తొట్రుబాటు చెందడో, అట్టి దుఃఖమునకు తావు లేనిస్థితిని యోగస్థితియని తెలిసికొనుము. ఈ యోగము విసుగు చెందక దృఢనిశ్చయముతో సాధింపతగినది.

24 సంకల్పప్రభవాన్కామాం స్త్యక్త్వా సర్వాన శేషతః ।
మనసైవేంద్రియ గ్రామం వినియమ్య సమంతతః ॥

25. శనై శ్శనై రుపరమేద్బుద్ధ్యా ధృతిగృహీతయా ।
ఆత్మసంస్థం మనః కృత్వా న కించిదపి చింతయేత్ ॥

సంకల్పమువలన కలిగెడి సమస్త కోరికలను సంపూర్ణముగా త్యజించి, మనసుచేతనే ఇంద్రియము లన్నింటిని అన్నివైపులనుండి బాగుగా నిగ్రహించి స్థిరబుద్ధితో యోగియగువాడు నెమ్మది నెమ్మదిగా శాంతిని పొందుచూ మనసును ఆత్మతో చేర్చి మరియొక ఇతర ఆలోచన చేయరాదు.

26. యతో యతో నిశ్చరతి మనశ్చంచలమస్థిరమ్ ।
తత స్తతో నియమ్యైతదాత్మన్యేవ వశం నయేత్ ॥

చంచలమై అస్థిరమై మనసు ఏయే విషయములందు చరించునో ఆయా విషయములనుండి దానినిమరల్చి యోగి నియమబద్ధమొనర్చి వశమందుంచుకొనవలెను.

27. ప్రశాంతమనసం హ్యేనం యోగినం సుఖముత్తమమ్ ।
ఉపైతి శాంతరజసం బ్రహ్మభూతమకల్మషమ్ ॥

ప్రశాంతమైన మనస్సుకలవాడు రజోగుణ దోషములు అణగిపోయినవాడు పాపరహితుడై బ్రహ్మత్వమును పొందిన యోగి తప్పక ఉత్తమ సుఖమును పొందును.

28. యుంజన్నేవం సదాత్మానం యోగీ విగతకల్మషః ।
సుఖేన బ్రహ్మసంస్పర్శమత్యంతం సుఖమశ్నుతే ॥

ఆత్మతో నిరంతరము అనుసంధానముగావించు పాపరహితుడైన యోగి సులభముగా బ్రహ్మప్రాప్తి యనెడి అనంతసుఖమును అనుభవించుచున్నాడు.

29. సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని ।
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః ॥

సర్వత్ర సమభావమును కలిగిన యోగి తనను సర్వభూతములయందును, తనయందు సర్వభూతములను చూచును.

30 యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి ।
తస్యాహం న ప్రణశ్యామి స చ మే న ప్రణశ్యతి ॥

అన్నిటియందు నన్నును నాయందు అన్నిటిని దర్శించువాడు నాదృష్టినుండి మరుగుపడడు, నేను అతని దృష్టినుండి మరుగుపడను.

31 సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః ।
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే ॥

నాలో లీనమైన యోగి సర్వభూతములలో నుండెడి నన్ను భజించును. అట్టివాడు ఏవిధముగా వ్యవహరించినను నాయందే ప్రవర్తించుచున్నాడు.

వ్యాఖ్య : 'నేను' అనుభావమున్నంతవరకు పరమాత్మ 'పరు'డేయగుచున్నాడు. 'స్వ'తొలగినపుడు మాత్రమే పరమాత్ముని సర్వత్రా చూచును. (పదమూడవ అధ్యాయం ఇరవై మూడవ శ్లోకపు వ్యాఖ్యానము చూడుడు.)

32. ఆత్మౌపమ్యేన సర్వత్ర సమం పశ్యతి యోఽర్జున ।
సుఖం వా యది వా దుఃఖం స యోగీ పరమో మతః ॥

ఓ అర్జునా ! ఎల్లరను తనవలె చూచునట్టియు సుఖ-దుఃఖముల రెండిని సమానముగా భావించునట్టి యోగి శ్రేష్ఠుడని యెంచబడుచున్నాడు.

**అర్జున ఉవాచ :**

33. యోఽయం యోగస్త్వయా ప్రోక్తః సామ్యేన మధుసూదన ।
ఏతస్యాహం న పశ్యామి చంచలత్వాత్ స్థితిం స్థిరామ్ ॥

   

అర్జునుడు ప్రశ్నించుచున్నాడు :—

ఓ మధుసూదనా! నీవు చెప్పిన ఈ సమత్వమనెడి యోగమును దాని స్థిరత్వమును నేను చంచలచిత్తము గల వాడనగుటచే చూడలేక పోవుచున్నాను.

34. చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢమ్ ।
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్ ॥

ఓ కృష్ణా! మనసు చంచలమైనది. దేహేంద్రియము లను క్షోభ పెట్టునది, చాల బలమైనది. గాలిని అణచియుంచుట ఎంతకష్టమో మనస్సును వశమందుంచుటకూడ అంత కష్టమని నేను తలచుచున్నాను.

శ్రీ భగవానువాచ :—

35. అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలమ్ ।
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే ॥

శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు :—

అర్జునా! నిజమే. మనస్సు చంచలమైనదగుటచే దానిని వశమందుంచుకొనుట కష్టమే. కాని కౌంతేయా! అభ్యాసమువలన వైరాగ్యముచేత దానిని వశపరచుకొన వచ్చును.

36. అసంయతాత్మనా యోగో దుష్ప్రాప ఇతి మే మతిః ।
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తుముపాయతః ॥

మనసు తన వశమందు లేనివానికి యోగసాధన మిక్కిలి కష్టము. కాని మనసును తన వశమందుంచు కొన్నట్టి ప్రయత్నశీలుడు ఉపాయముచేత దానిని సాధించ గలడు.

**అర్జున ఉవాచ :—**

37. అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః ।
అప్రాప్య యోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి ॥

అర్జునుడు ప్రశ్నించుచున్నాడు :—

ఓ కృష్ణా ! శ్రద్ధగలవాడై యుండికూడా ప్రయత్న లోపమువలన యోగభ్రష్టుడై సఫలతపొందలేక పోయిన వానిగతి ఏమగును ?

38. కచ్చిన్నోభయవిభ్రష్టశ్ఛిన్నాభ్రమివ నశ్యతి ।
అప్రతిష్ఠో మహాబాహో విమూఢో బ్రహ్మణః పథి ॥

ఓ కృష్ణా ! యోగభ్రష్టుడై బ్రహ్మమార్గమున దారి తప్పినవాడు ఛిన్నాభిన్నములైన మేఘశకలములవలె ఉభయ భ్రష్టుడై పోవుటలేదుకదా !

39. ఏతన్మే సంశయం కృష్ణ ఛేత్తుమర్హస్యశేషతః ।
త్వదన్యః సంశయస్యాస్య ఛేత్తా న హ్యుపపద్యతే ।

ఓ కృష్ణా! నా యీ సందేహమును తీర్చుటకు నీవే సమర్థుడవు. నీకంటె యీ సందేహమును తీర్చగలవారు మరి యొకరు లభించరు.

శ్రీ భగవానువాచ :—

40. పార్థ నైవేహ నాముత్ర వినాశ స్తస్య విద్యతే ।
నహి కల్యాణ కృత్కశ్చిద్దుర్గతిం తాత గచ్ఛతి ॥

శ్రీభగవానుడు చెప్పుచున్నాడు :—

పార్థా! అట్టివారికి యీ లోకమందును పరలోకమందును కూడా నాశనము లేదు. అర్జునా! కళ్యాణమార్గమున పయనించువానికి దుర్గతి ఎన్నటికినీ కలుగదు.

41 ప్రాప్య పుణ్యకృతాంల్లోకానుషిత్వా శాశ్వతీః సమాః ॥
శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే ॥

పుణ్యాత్ములు పొందు పదవిని పొంది, అచట చాల కాలముండి యోగభ్రష్టుడైన మానవుడు పవిత్రుడై సాధనాపరుని యింట జనన మొందును.

42. అథవా యోగినామేవ కులే భవతి ధీమతామ్ ।
ఏతద్ధి దుర్లభతరం లోకే జన్మ యదీదృశమ్ ॥

లేదా జ్ఞానవంతులైన యోగుల యింటనే జన్మించును. ప్రపంచములో యిట్టి జన్మ లభించుట కడుదుర్లభము.

43. తత్ర తం బుద్ధిసంయోగం లభతే పౌర్వదేహికమ్ ।
యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన ॥

ఓ కురునందనా! అక్కడ అతనికి పూర్వజన్మలోని బుద్ధి సంస్కారములు లభించును. అటనుండి మోక్షము పొందుటకై ఆతడు ముందుకు సాగును.

44. పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః ।
జిజ్ఞాసురపి యోగస్య శబ్దబ్రహ్మాతివర్తతే ॥

ఆ పూర్వాభ్యాసమువలన అతడు అప్రయత్నముగ యోగ సాధనవైపు ఆకర్షింపబడును. యోగ జిజ్ఞాసువుకూడ సకామవైదిక కర్మలాచరించువాని స్థితినిదాటి ఉత్తమస్థితిని పొందును.

45. ప్రయత్నాద్యతమానస్తు యోగీ సంశుద్ధకిల్బిషః ।
అనేక జన్మసంసిద్ధస్తతో యాతి పరాం గతిమ్ ॥

శ్రద్ధతో ప్రయత్నించుచూ యోగి పాప విముక్తుడై అనేక జన్మలద్వారా విశుద్ధుడగుచూ పరమగతిని పొందును.

46. తపస్విభ్యోఽధికో యోగీ జ్ఞానిభ్యోఽపి మతోఽధికః ।
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీ భవార్జున ॥

తపస్వికంటె యోగి గొప్పవాడు. జ్ఞానికంటెను అతడు మిన్నగా భావించబడుచున్నాడు. అదే విధముగా

కర్మకాండలు చేయువానికంటెకూడా అతడు అధికుడే యగును. కావున అర్జునా! నీవు యోగివికమ్ము.

వ్యాఖ్య: ఇక్కడ తపస్వియనగా ఫలేచ్ఛతో కూడిన తపస్సు చేయువాడనియు, జ్ఞాని యనగా అనుభవ జ్ఞానము లేని వాడనియు గమనించవలెను.

47? యోగినామపి సర్వేషాం మద్గతేనాంతరాత్మనా ।
శ్రద్ధావాన్భజతే యో మాం స మే యుక్తతమో మతః ॥

నా యందు మనసు లగ్నముచేసి నన్నే శ్రద్ధతో భజించు వానిని యోగులందరిలోను సర్వశ్రేష్ఠ యోగిగా నేను భావించుచున్నాను.

ఈ విధముగా ఉపనిషదర్థ ప్రతిపాదకము, బ్రహ్మవిద్యా
విషయిక యోగశాస్త్రమును, శ్రీ కృష్ణార్జున
సంవాదమును అగు భగవద్గీతలోని
ధ్యాన యోగమను ఆరవ
అధ్యాయము
సమాప్తము
ఓం తత్ సత్

# ఏడవ అధ్యాయము

## జ్ఞాన విజ్ఞాన యోగము

ఈ అధ్యాయమందు ఈశ్వరతత్త్వము, ఈశ్వరభక్తి యనగా ఎట్టిదో బోధింపబడినది.

శ్రీభగవానువాచ :—

1. మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్మదాశ్రయః ।
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు ॥

శ్రీకృష్ణపరమాత్మ చెప్పుచున్నాడు :—

అర్జునా! నా యందు మనసు నిలిపి నన్నాశ్రయించి సంపూర్ణముగను సంశయరహితముగ నన్నెట్లు తెలిసికొన గలవో చెప్పుచున్నాను, దీనిని ఆలకింపుము.

2. జ్ఞానం తేఽహం సవిజ్ఞానమిదం వక్ష్యామ్యశేషతః ।
యజ్జ్ఞాత్వా నేహ భూయోఽన్యజ్జ్ఞాతవ్యమవశిష్యతే ॥

అనుభవముతో కూడిన యీ విషయమును నేను నీకు సవిస్తారముగా చెప్పెదను. దీనిని గ్రహించిన పిమ్మట యీ లోకమందు యిక అధికముగా తెలిసికొన వలసిన దేమియు ఉండదు.

3. మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే ।
యతతామపి సిద్ధానాం కశ్చిన్మాం వేత్తి తత్త్వతః ॥

వేలకొలది మనుష్యులలో కొందరు మాత్రమే సిద్ధి కొఱకై ప్రయత్నించుచుందురు. ప్రయత్నము చేయు వారిలోకూడా కొందరు మాత్రమే యదార్థముగా నన్ను తెలిసికొనగలుగుచున్నారు.

4. భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ ।
అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతిరష్టధా ॥

భూమి, నీరు, అగ్ని, గాలి, ఆకాశము, మనస్సు, బుద్ధి, అహంకారము-అను ఎనిమిది విధములుగా నా ప్రకృతి వున్నది.

వ్యాఖ్య : ఈ ఎనిమిది తత్వములతో కూడిన స్వరూపము నకే క్షేత్రమనియు లేక క్షరపురుషుడనియు పేర్లు కలవు.

5. అపరేయమితస్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్
జీవభూతాం మహాబాహో యయేదం ధార్యతే జగత్

ఈ అపరాప్రకృతి తక్కువ స్థితియందున్నది. దీని కంటె ఉన్నతమైనది పరాప్రకృతి జీవరూపమైనది. ఈనా పరాప్రకృతి ఆధారంగానే జగత్తంతయు నడచుచున్నది.

6. ఏతద్యోనీని భూతాని సర్వాణీత్యుపధారయ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళయస్తథా॥

సకలభూతముల పుట్టుకకు ఈ పరా అపరా ప్రకృతులే కారణభూతములని యెరుంగుము. సమస్త విశ్వముయొక్క సృష్టి - లయములకు కారణము నేనే అగుచున్నాను.

7. మత్తః పరతరం నాన్యత్కించిదస్తి ధనంజయ।
మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥

అర్జునా! నాకంటె శ్రేష్ఠమైనదేదియును లేదు. సూత్రమునందు మణులు గుచ్చబడిన చందమున ఈ జగమంతయు నాయందే కూర్చబడియున్నది.

8. రసోఽహమప్సు కౌంతేయ ప్రభాస్మి శశిసూర్యయోః।
ప్రణవః సర్వవేదేషు శబ్దః ఖే పౌరుషం నృషు॥

ఓ అర్జునా! జలమునందలి రసము నేనే. సూర్య చంద్రుల యందలి తేజస్సు నేనే. సకలవేదములందలి ఓంకారమును నేనే. ఆకాశమందలి శబ్దమును నేనే. పురుషుల యందలి పరాక్రమమును నేనే.

9. పుణ్యో గంధః పృథివ్యాం చ తేజశ్చాస్మి విభావసౌ।
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు॥

పృథివియందలి సుగంధమును, అగ్నియందలి తేజస్సు, సకల భూతములందలి ప్రాణమును, తపశ్శాలుర యొక్క తపస్సు నేనే.

10. బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనమ్
బుద్ధిర్బుద్ధిమతామస్మి తేజస్తేజస్వినామహమ్॥

పార్థా! సనాతనుడనైన నేనే సర్వభూతములకు జనన కారకుడనని తెలిసికొనుము. బుద్ధిమంతులయొక్క బుద్ధియు, తేజోవంతుల యందలి తేజస్సును నేనేయని తెలిసికొనుము.

11. బలం బలవతామస్మి కామరాగవివర్జితమ్
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ॥

కామరాగములను వర్జించిన బలాఢ్యులయొక్క బలము నేనే. అర్జునా! ప్రాణులయందలి ధర్మవిరుద్ధము కాని కామమును నేనేయని తెలిసికొనుము.

12. యే చైవ సాత్త్వికా భావా రాజసాస్తామసాశ్చయే।
మత్త ఏవేతి తాన్విద్ధి న త్వహం తేషు తే మయి॥

సత్వరజస్తమో గుణములవలన ఏయే భావములు వున్నవో అవి అన్నియు నావలననే కలుగుచున్నవి. అవి నాయందున్నవి కాని వాటియందు నేను లేను.

వ్యాఖ్య: పరమేశ్వరుడీ భావములపై ఆధారపడియుండ లేదు కాని యీభావములు పరబ్రహ్మపై ఆధారపడియున్నవి. వాని అధీనమునందే యున్నవి.

13. త్రిభిర్గుణమయైర్భావై రేభిః సర్వమిదం జగత్।
మోహితం నాభిజానాతి మామేభ్యః పరమవ్యయమ్॥

ఈ త్రిగుణములయొక్క ప్రభావము వలననే సకల ప్రపంచము మోహమున మునిగిపోవుచున్నది. అందువల్లనే యీగుణములకంటె భిన్నమై ఉన్నతమై నాశములేకండా వున్న నన్ను ప్రపంచము తెలిసికొనజాలకున్నది.

14. దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।
మామేవ యే ప్రపద్యంతే మాయామేతాం తరంతితే॥

నాయొక్క యీత్రిగుణములతో కూడిన దైవ సంబంధమగు మాయను అతిక్రమించుట కష్టము, కానినన్నె వరు శరణుజొచ్చెదరో వారు మాత్రము యీ మాయను అతిక్రమించగల్గుదురు.

15. నమాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః
మాయయాపహృతజ్ఞానా ఆసురం భావమాశ్రితాః॥

పాపాత్ములు, మూఢులు, మానవాధములు నన్ను శరణుజొచ్చుటకురారు. వారు రాక్షస స్వభావముకలవారై యుందురు. మాయచే వారిజ్ఞానము హరింపబడిపోవును.

16. చతుర్విధా భజంతే మాం జనాః సుకృ నోఽర్జున।
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ॥

ఓ అర్జునా! నాలుగు విధములైన పుణ్యాత్ములు నన్నుభజింతురు. వారెవరనగా - దుఃఖితులు, జిజ్ఞాసువులు

అర్థమును అభిలషించువారు, ఏదేని ఒక ప్రయోజనము పొందగోరు జ్ఞానులు.

17. తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే।
ప్రియో హి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమ ప్రియః॥

వీరిలో నిత్యము సమభావముగలవాడును ఏకాగ్ర భక్తితో పరమాత్మయగు నన్నే భజించు జ్ఞానియే శ్రేష్ఠుడు. ఆ జ్ఞాని నాకు అత్యంతప్రియమైనవాడు. ఆతనికి నేనే మిక్కిలి ప్రేమాస్పదుడను.

18. ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్,
ఆస్థితః స హి యుక్తాత్మా మామేవానుత్తమాం గతిమ్॥

ఈ భక్తులందరునూ ఉత్తములే. కాని జ్ఞాని నా ఆత్మయేని నాభావము. ఎందుకనగా - ఆ యోగి నన్ను పొందుటకంటే సద్గతి వేరొకటిలేదని యెరిగి నన్నే ఆశ్రయించుచున్నాడు.

19. బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్మాం ప్రపద్యతే
వాసుదేవః సర్వమితి స మహాత్మా సుదుర్లభః॥

అనేక జన్మలు గడచిన పిమ్మటనే జ్ఞాని నన్ను పొందుచున్నాడు. అంతయు వాసుదేవమయమని తెలిసికొను మహాత్ముడు అరుదుగానుండును.

20. కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః।
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యానియతాః స్వయా॥

అనేకమైన కోరికలచేత జ్ఞానమును పోగొట్టుకొనిన వారు తమ ప్రకృతి ననుసరించి వివిధమార్గలలో ఇతర దేవతలను ఆరాధింతురు.

21. యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి।
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్॥

ఏయే భక్తుడు ఏయే దేవతా స్వరూపమును శ్రద్ధతో ఆరాధింప కోరుచున్నాడో వానికి ఆయా దేవతా రూపము నందు శ్రద్ధను స్థిరపరచుచున్నాను.

12. స తయా శ్రద్ధయా యుక్తస్తస్యారాధన మీహతే
లభతే చ తతః కామాన్మయైవ విహితాన్హితాన్॥

ఏ భక్తుడు శ్రద్ధతో ఆయా దేవతా స్వరూపమును ఆరాధించుచున్నాడో అతడు నాచే నిర్ణీతములైనట్టి, తనకు హితమైన కోరికలనే పొందుచున్నాడు.

23. అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్।
దేవాన్దేవయజో యాంతి మద్భక్తా యాంతిమామపి॥

అట్టి అల్పబుద్ధులకు లభించుఫలితము నశ్వరమైనది. దేవతలను భజించువాడు దేవతలనే పొందుచున్నాడు. నన్ను భజించువాడు నన్నే పొందును.

24. అవ్యక్తం వ్యక్తిమాపన్నం మన్యంతే మామబుద్ధయః
పరం భావమజానంతో మమావ్యయమనుత్తమమ్॥

నాయొక్క పరమమైన, అనశ్వరమైన, అనుపమాన మైన నా స్వరూపమును తెలియని బుద్ధిహీనులు ఇంద్రియములకు అతీతుడనైన నన్ను ఇంద్రియముల ద్వారా పొంద వచ్చునని భావించుచున్నారు.

25. నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః
మూఢోఽయం నాభిజానాతి లోకో మామజమవ్యయమ్॥

నా యోగముచేత కప్పబడియున్న నేను అందరికీ గోచరించను ఈ మూఢజగత్తు పుట్టుకలేనివాడను అవ్యయుడను నగు నన్ను సరిగా గుర్తించుటలేదు.

వ్యాఖ్య: ఈ దృశ్య జగత్తును సృష్టించుటకు సామర్థ్యము కలిగియుండియు నిర్లిప్తుడగుటచేత పరమాత్ముడు అగోచరుడను భావము యోగమాయ వలన కలుగుచున్నది.

26. వేదాహం సమతీతాని వర్తమానాని చార్జున ।
భవిష్యాణి చ భూతాని మాంతు వేద న కశ్చన॥

ఓ అర్జునా! భూత భవిష్యత్ వర్తమాన కాలములందలి భూతజాలము లన్నింటిని నేను ఎరుగుదును. కాని నన్ను ఎవరునూ ఎరుగరు.

27. ఇచ్ఛాద్వేషసముత్థేన ద్వంద్వమోహేన భారత।
సర్వభూతాని సంమోహం సర్గే యాంతి పరంతప॥

అర్జునా ! ఈ జగత్తులో రాగ ద్వేషములచే ఉత్పన్నమగు సుఖ దుఃఖాది ద్వంద్వముల మోహములో ప్రతి ప్రాణియు తగుల్కొనియున్నది.

28. యేషాం త్వన్తగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్
తే ద్వంద్వమోహనిర్ముక్తా భజంతే మాం దృఢ వ్రతాః॥

కాని పాపములు నశించిపోయినట్టి సదాచారసంపన్నులు ఈ ద్వంద్వములయొక్క మోహమునుండి విముక్తులైన దృఢవ్రతధారులు నన్ను భజించుచున్నారు.

29. జరామరణమోక్షాయ మామాశ్రిత్య యతంతియే
తే బ్రహ్మ తద్విదుః కృత్స్నమధ్యాత్మం కర్మచాఖిలమ్॥

నన్ను ఆశ్రయించి జరామరణముల నుండి ముక్తులగుటకు ప్రయత్నించువారు పరబ్రహ్మ స్వరూపమును, ఆత్మతత్వమును, సకల స్వభావమును ఎరుగుదురు.

30. సాధిభూతాధిదైవం మాం సాధియజ్ఞం చ యే విదుః
ప్రయాణకాలేఽపి చ మాం తే విదుర్యుక్తచేతసః ।

అధిభూతమును, అధిదైవమును, అధియజ్ఞమును నేనే యని యెరిగినవారు సమత్వమునుపొంది మృత్యుసమయమందుకూడ నన్ను గుర్తించుచున్నారు.

వ్యాఖ్య : అధిభూతములకు అర్థము ఎనిమిదవ అధ్యాయములో చెప్పబడినది. ఈ ప్రపంచములో ఈశ్వరుడు తప్ప మరియొకటిలేదు. సమస్త కర్మలకు కర్తయు భోక్తయు ఆతడే. ఈ విధముగా తెలిసికొని వ్యత్యాసమయ మం కూడా శాంతముగా నుండి ఈశ్వరుని యందు తన్మయుడై ఎట్టి కోరికలు లేనట్టివాడు ఈశ్వరుని గుర్తించినవాడగును. అట్టివాడు మోక్షమును పొందినవాడగునాడని యీశ్లోకమునకు భావార్థము.

ఈవిధముగా ఉపనిషదర్థ ప్రతిపాదకము బ్రహ్మ విద్యా విషయిక యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదమును అగు భగవద్గీతలోని జ్ఞాన విజ్ఞాన యోగమనెడి ఏడవ అధ్యాయము ముగిసినది.

ఓం తతస్సత్ .

# ఎనిమిదవ అధ్యాయము

## అక్షరబ్రహ్మ యోగము

ఈ అధ్యాయములో ఈశ్వరతత్త్వమును గురించి ప్రత్యేకముగా చెప్పబడినది.

**అర్జున ఉవాచ :—**

1. కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మం కిం కర్మ పురుషోత్తమ ।
అధిభూతం చ కిం ప్రోక్తమధిదైవం కిముచ్యతే ॥

అర్జునుడు ప్రశ్నించుచున్నాడు :—

పురుషోత్తమా ! బ్రహ్మయొక్క స్వరూప మెట్టిది ? అధ్యాత్మమననేమి ? కర్మయనగా నేమి? అధిభూతమని దేనిని అందురు ? అధిదైవమని దేనినందురు ?

2. అధియజ్ఞః కథం కోఽత్ర దేహేఽస్మిన్ మధుసూదన।
ప్రయాణకాలే చ కథం జ్ఞేయోఽసినియతాత్మభిః॥

మధుసూదనా ! ఈ దేహములో అధియజ్ఞము అని దేనిని వ్యవహారింతురు ? అది ఏ విధముగా ఉన్నది ? ఆత్మ నిగ్రహము కలవాడు మృత్యుసమయమున నిన్ను ఎట్లు గుర్తించగలడు ?

**శ్రీభగవానువాచ :—**

3. అక్షరం బ్రహ్మ పరమం స్వభావోఽధ్యాత్మముచ్యతే ।
భూతభావోద్భవకరో విసర్గః కర్మసంజ్ఞితః ॥

సర్వోత్తమమై నాశరహితమైనట్టిది బ్రహ్మము. సర్వ భూతముల యందు తనశక్తిచే ఉండునదే అధ్యాత్మము. ప్రాణికోటిని ఉత్పత్తిచేయు సృష్టివ్యాపారమే కర్మయనబడు చున్నది.

4 అధిభూతం క్షరో భావః పురుషశ్చాధిదైవతమ్ ।
అధియజ్ఞోఽహమేవాత్ర దేహే దేహభృతాం వర ॥

అర్జునా ! నశ్వరమైన భూతముల నా ఉపాధి స్వరూ పమే అధిభూతము. అందుండు నా జీవస్వరూపము అధి దైవతము. యజ్ఞములద్వారా పరిశుద్ధమై ఈ శరీరంలో నున్నట్టి జీవరూపమునే అధియజ్ఞమందురు.

వ్యాఖ్య: అవ్యక్తమైన బ్రహ్మమొదలుకొని నశ్వరమైన దృశ్యపదార్థమువరకు అంతయూపరమాత్మయే. సర్వము అతని సృష్టియేయని తాత్పర్యము. అట్టి స్థితిలో మనుష్యుడు తానే కర్తయని అభి మానపడుటకు బదులు పరమాత్మకు దాసుడై సర్వము అతనికే ఏల అర్పణచేయకూడదు?

5 అన్తకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరమ్ ।
యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః ॥

అంత్యకాలమునందు నన్నే స్మరించుచూ దేహమును త్యజించువాడు నా స్వరూపమునే పొందును. ఇందు సందేహ మేమియును లేదు.

6 యం యం వాఽపి స్మరన్ భావం త్యజత్యంతే కళేబరమ్ ।
తం తమేవైతి కౌంతేయ సదా తద్భావ భావితః ॥

ఓ కౌంతేయా ! మనుష్యుడు నిత్యమూ ఏ స్వరూపమును ధ్యానించుచుండునో ఆ స్వరూపమే అంత్యకాలమునందు కూడా స్మరించుచు దేహమును విడచును. అందువల్ల అతడు అట్టి స్వరూపమునే పొందును.

7 తస్మాత్ సర్వేషు కాలేషు మామనుస్మర యుధ్య చ ।
మయ్యర్పిత మనోబుద్ధి ర్మామేవైష్య స్యసంశయః ॥

అందువలన సతతము నన్నే స్మరించుచూ యుద్ధము కూడ చేయుము. ఈ విధముగా నీ మనస్సును, బుద్ధిని నా యందు లగ్నము చేసిన యెడల నీవు తప్పక నన్నే పొందెదవు.

8 అభ్యాసయోగయుక్తేన చేతసా నాన్యగామినా ।
పరమం పురుషం దివ్యం యాతి పార్థానుచింతయన్ ॥

పార్థా ! అభ్యాసమువలన చిత్తమును స్థిరముగానుంచి దానిని అటునిటు పరుగిడనీయక ఏకాగ్రమొనర్చిన వాడు దివ్యమైన పరమపురుషుని పొందుచున్నాడు.

9 కవిం పురాణ మనుశాసితార -
మణోరణీయాంస మనుస్మరేద్యః ।
సర్వస్య ధాతార మచింత్యరూప -
మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ॥

10 ప్రయాణకాలే మనసాఽచలేన
భక్త్యాయుక్తో యోగబలేన చైవ।
భ్రువోర్మధ్యే ప్రాణమావేశ్య సమ్యక్
స తం పరం పురుషముపైతి దివ్యమ్॥

మృత్యు సమయమున ఎవడు నిశ్చల చిత్తముతో, భక్తితో, యోగబలముచే, భ్రుకుటి మధ్యమున ప్రాణమును ప్రతిష్ఠించి, సర్వజ్ఞుడు సనాతనుడు, సర్వజగత్తును శాసించువాడు, సూక్ష్మాతిసూక్ష్మరూపుడు, సకలజగత్తును పోషించువాడు, ఊహాతీతుడు, సూర్యునివలె తేజస్సంపన్నుడు, అజ్ఞానమనెడి అంధకారమునకు అతీతుడును అగు ఆ దివ్యమైన పరమపురుషుని స్మరించునో ఆతడు ఆ దివ్య పరమపురుషునే పొందును.

11 యదక్షరం వేదవిదో వదంతి
విశంతి యద్యతయో వీతరాగాః।
యదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి
తత్తే పదం సంగ్రహేణ ప్రవక్ష్యే॥

దేనిని వేదము తెలిసినవారు 'అక్షరమని' —నాశరహితమైనదని వర్ణించిరో, దేనియందు రాగరహితులైన మునులు ప్రవేశింతురో, దేనిని పొందుటకై బ్రహ్మచర్యవ్రతమును పాలింతురో ఆ పరమ పదమును గురించి నేను క్లుప్తముగా నీకు వివరించి చెప్పెదను.

12 సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్య చ ।
మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణామ్ ॥

13 ఓమిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్మామనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజం దేహం సయాతి పరమాం గతిమ్ ॥

ఇంద్రియద్వారములన్నిటినీ బంధించి మనసును హృదయములో నిలిపి, ప్రాణమును శిరసునందుంచి సమాధిస్థుడై 'ఓం' అనెడి ఏకాక్షరీబ్రహ్మను ఉచ్చరించుచూ, నన్ను ధ్యానించుచు దేహమును త్యజించువాడు పరమగతిని పొందుచున్నాడు.

14 అనన్యచేతాః సతతం యో మాం స్మరతి నిత్యశః ।
తస్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః ॥

పార్థా! చిత్తమును ఇతర విషయములందు లగ్నము చేయక నిత్యము నిరంతరము నన్నే స్మరించునట్టి యోగారూఢుడు నన్ను సులభముగా పొందును.

15 మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్ ।
నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః ॥

నన్ను పొందిన పిదప పరమగతిని పొందిన మహాత్ములు దుఃఖమునకు నిలయమైనట్టి అశాశ్వతమైన పునర్జన్మను పొందరు.

16. ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినోఽర్జున।
మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే॥

ఓ కౌంతేయా! బ్రహ్మలోకమువరకుగల ఏ లోకమునకు వెళ్లినవారైనా మరల జన్మమెత్తుచున్నారు. కాని నన్ను పొందిన వారికి మాత్రము పునర్జన్మ లేదు.

17. సహస్రయుగ పర్యంత మహర్యద్బ్రహ్మణో విదుః।
రాత్రిం యుగసహస్రాంతాం తేఽహోరాత్రవిదో జనాః॥

వేయి యుగములు బ్రహ్మకు ఒక పగలనియు, వేయి యుగములు ఒక రాత్రియని తెలిసినట్టివాడు కాల పరిమితిని యెరిగిన వాడగును.

వ్యాఖ్య : మన ఇరవై నాలుగుగంటల రాత్రిం బవళ్ళు కాల చక్రములో ఒక క్షణముకంటెనూ తక్కువే. దీనికేమీ విలువ లేదు. కనుక యీ కొద్ది సమయములో లభించు సుఖసౌఖ్యములు గగనకుసుమముల వంటివని గుర్తెరింగి మానవుడు వాటియందు ఉపేక్ష వహించవలెను. మనకు లభించిన యీ కొద్ది సమయమును భగవద్భక్తి, లోకసేవయందు గడపి జీవితమును సార్థకపరచుకొనవలెను. వెనువెంటనే ఆత్మ సాక్షాత్కారము కానియెడల ఒకింత ఓపిక పట్టవలెను.

18. అవ్యక్తాద్వ్యక్తయః సర్వాః ప్రభవం త్యహరాగమే।
రాత్ర్యాగమే ప్రలీయంతే తత్రైవావ్యక్తసంజ్ఞకే॥

బ్రహ్మయొక్క పగలు ప్రారంభమైనపుడు అవ్యక్తమునుండి సర్వభూతములు వ్యక్తమగును. తిరిగి రాత్రి సమయమైనపుడు ప్రళయమగును. అనగా అవ్యక్తములో తిరిగి లీనమైపోవును.

వ్యాఖ్య : ఇది తెలిసిన మానవుడు తన చేతిలో (అధీనములో) ఏమియు లేదని యెరుగవలెను. సృష్టి-లయములు రెండునూ ఒకదానివెంట మరొకటి జరుగుచునే యుండును.

19\. భూతగ్రామః స ఏవాయం భూత్వా భూత్వా ప్రలీయతే।
రాత్ర్యాగమేఽవశః పార్థ ప్రభవత్యహరాగమే॥

ఓ పార్థా! ఈ విధముగా జీవరాశి యంతయు జన్మించుచూ రాత్రి అయినపుడు విధిగా లయమగుచున్నది. మరల పగలు కాగా యథాప్రకారము ఉత్పన్నమగు చుండును.

20\. పరస్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః।
యః స సర్వేషు భూతేషు నశ్యత్సు న వినశ్యతి॥

ఈ అవ్యక్తమునకు అతీతముగా మరియొక సనాతనమైన అవ్యక్త పరబ్రహ్మభావ మొకటి కలదు. సమస్తభూతజాలములు నశించినప్పటికినీ ఆ సనాతనమైన అవ్యక్త పరబ్రహ్మభావము నశింపదు.

21\. అవ్యక్తోఽక్షర ఇత్యుక్త స్తమాహుః పరమాం గతిమ్ః
యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ॥

అవ్యక్తము, అక్షరము అని చెప్పబడుదానినే పరమ గతి యందురు. దానిని పొందినవారికి పునర్జన్మ యుండదు. అదే నాయొక్క పరంధామము.

22\. పురుషః స పరః పార్థ భక్త్యా లభ్య స్త్వనన్యయాః
యస్యాంతఃస్థాని భూతాని యేన సర్వమిదం తతమ్॥

ఓ పార్థ! ఈ పురుషోత్తమ దర్శనము అనన్య భక్తి వలన కలుగును. వానియందు భూతజాలమంతయు నిండి యున్నది. వానివలననే ఇవన్నియు వ్యాప్తి జెందుచున్నవి.

23\. యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః॥
ప్రయాతా యాంతి తం కాలం వక్ష్యామి భరతర్షభ॥

ఓ పార్థా! ఏ కాలమందు మరణించిన యోగులు మోక్షమును పొందుచున్నారో, ఏ కాలమున మరణించి పునర్జన్మ పొందుదురో అట్టి వేళలను గురించి నీకు చెప్పెదను.

24\. అగ్నిర్జ్యోతిరహః శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్ః
తత్ర ప్రయాతా గచ్ఛంతి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః॥

ఉత్తరాయణమునందు ఆరు మాసములలో శుక్ల పక్షమునందు పగటివేళ అగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లునప్పుడు మరణించు బ్రహ్మవేత్త పరబ్రహ్మమును పొందుచున్నాడు.

25: ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్।
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే॥

దక్షిణాయనమందు ఆరు మాసములలో కృష్ణపక్షమి రాత్రివేళ పొగ వ్యాపించియున్న సమయమందు మరణించిన బ్రహ్మవేత్త చంద్రలోకమునుపొంది మరల జన్మ మెత్తు చున్నాడు.

వ్యాఖ్య: పై రెండు శ్లోకములు నాకు పూర్తిగా అర్థ మగుటలేదు. ఈ శ్లోకముల శబ్దార్థమునకు గీత బోధించు విషయములకు సమన్వయము కుదురుట లేదు. గీతాబోధ ననుసరించి సేవామార్గమును అవలంబించి జ్ఞానియైన భక్తుడు ఎప్పుడు మరణిం చినను మోక్షమును పొందును. దీనికి యీ శ్లోక ముల శబ్దార్థము విరుద్ధముగా నున్నది. యజ్ఞము చేయువాడు—అనగా పరోపకారములో జీవి తము గడుపువాడు, జ్ఞానమెరిగినవాడు - అనగా బ్రహ్మవేత్త అయిన జ్ఞాని మృత్యుసమయమందు కూడ అట్టి స్థితినే కలిగియున్నచో మోక్షము పొందునని వీటి భావము కావచ్చును. ఇందుకు భిన్నముగా యజ్ఞము చేయనట్టివాడు, జ్ఞానము

లేనట్టి వాడు, భక్తి లేనివాడు చంద్రలోకము — అనగా క్షణికమైన లోకమును పొంది తిరిగి సంసారచక్రములో పడుచున్నాడు. చంద్రునకు స్వయంప్రకాశక శక్తి లేదు.

26. శుక్లకృష్ణే గతీ హ్యేతే జగతః శాశ్వతే మతే।
ఏకయా యాత్యనావృత్తి మన్యయా వర్తతే పునః

జగత్తులో పరంపరానుగతముగా జ్ఞానమార్గము, అజ్ఞానమార్గమనెడి రెండు మార్గములు కన్పట్టుచున్నవి. —ఒకటి జ్ఞానమార్గముద్వారా మానవుడు మోక్షమును పొందుచున్నాడు. రెండవది — అజ్ఞాన మార్గముద్వారా పునర్జన్మ పొందుచున్నాడు.

27. నైతే సృతీ పార్థజానన్ యోగీ ముహ్యతి కశ్చన।
తస్మాత్సర్వేషు కాలేషు యోగయుక్తో భవార్జున॥

ఓ పార్థా! ఈ రెండు మార్గములనెరిగిన యే యోగియైనా మోహమున తగుల్కొనడు. కనుక అర్జునా! నీవు యెల్లవేళలయందు యోగయుక్తుడవై యుండుము.

వ్యాఖ్య : రెండుమార్గములను యెరిగినవాడు సమభావము కలవాడై యుండును. అంధకారమయమగు అజ్ఞాన మార్గమును స్వీకరింపడు. దీనినే మోహములో పడకుండుట యందురు. అనగా మోహములో చిక్కుకొనడు.

28. వేదేషు యజ్ఞేషు తపస్సు చైవ
దానేషు యత్పుణ్యఫలం ప్రదిష్టమ్।
అత్యేతి తత్సర్వమిదం విదిత్వా
యోగీ పరం స్థాన ముపైతిచాద్యమ్॥

ఈ విషయమును తెలిసికొనిన తర్వాత వేదములోను, యజ్ఞములోను, తపస్సునందును, దానములోను ఏయే పుణ్యఫలములు లభించునని తెలుపబడినచో అట్టివానిని మించిన ఉత్తమమైన పరమపదమును యోగి అయినవాడు పొందుచున్నాడు.

వ్యాఖ్య: జ్ఞానము, భక్తి, సేవా కార్యములందు సమభావము కలిగినవానికి ఆయా కర్మల పుణ్యఫలము లేగాక పరమమోక్షపదము కూడా లభించును.

ఈ విధముగా ఉపనిషదర్థ ప్రతిపాదకము,
బ్రహ్మవిద్యావిషయిక యోగశాస్త్రమును
శ్రీకృష్ణార్జున సంవాదమును అగు
భగవద్గీతలోని అక్షర
బ్రహ్మయోగమను
ఎనిమిదవ అధ్యాయము
సమాప్తము

ఓం తత్సత్

# తొమ్మిదవ అధ్యాయము

## రాజవిద్యా రాజగుహ్యయోగము

ఇందు భక్తియొక్క మహిమ కీర్తింపబడినది. శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు.

శ్రీ భగవానువాచ :–

1 ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యామ్యనసూయవే।
జ్ఞానం విజ్ఞానసహితం యజ్జ్ఞాత్వా మోక్ష్యసేఽశుభాత్॥

నీవు ద్వేషరహితుడవు. అందుచే నేను నీకు గూఢాతి గూఢమైన అనుభవముతో కూడిన జ్ఞానమును బోధించుచున్నాను. దీనిని తెలిసికొనిన నీవు రక్షింపబడెదవు.

2. రాజవిద్యా రాజగుహ్యం పవిత్రమిద ముత్తమమ్।
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తుమవ్యయమ్॥

విద్యలలో ఇది రాజు. (శ్రేష్ఠమయినది) నిగూఢ విషయములలోకూడా యిది రాజే. ఈ విద్య పవిత్రమైనది; ఉత్తమమైనది, ప్రత్యక్షానుభవములోనికి రాదగినది, ధార్మికమైనది. సులభముగా ఆచరించుటకు వీలయినది. మరియు నాశరహితమైనది.

3. అశ్రద్ధధానాః పురుషా ధర్మస్యాస్య పరంతప।
అప్రాప్య మాం నివర్తంతే మృత్యుసంసారవర్త్మని॥

ఓ పార్థా! ఈ ధర్మమందు శ్రద్ధలేనట్టివారు నన్ను పొందలేక మాటిమాటికి మృత్యుమయమైన ప్రపంచ మార్గమునబడి కొట్టుమిట్టాడుచుందురు.

4. మయా తతమిదం సర్వం జగదవ్యక్తమూర్తినా।
మత్ స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః॥

నా అవ్యక్త స్వరూపముచే ఈ జగత్తంతయూ నిండి యున్నది. నన్నాధారము చేసికొని సర్వభూతములు నా యందే యున్నవి. నేను వాటిమీద ఆధార పడిలేను.

5. న చ మత్ స్థాని భూతాని పశ్య మే యోగమైశ్వరమ్।
భూతభృన్న చ భూతస్థో మమాత్మా భూతభావనః॥

అయినప్పటికినీ జీవకోటి నా యందు లేదని కూడా చెప్పవచ్చును. నా ఈ యోగబలమును నీవు తెలిసికొనుము. జీవులను పాలించువాడనైయుండి కూడా నేనువాటియందు లేను. కాని వాటి ఉత్పత్తికి కారణ భూతుడను నేనే.

వ్యాఖ్య : నాలో సర్వప్రాణులు వున్నవి, లేవనిచెప్ప వచ్చునుకూడా. కానివాటియందు నేను ఉన్నాను. అటులనే లేననికూడా చెప్పవచ్చు. ఈ ఈశ్వర యోగబలమే ఈశ్వరమాయ, ఇదే విచిత్రము. ఈశ్వర వర్ణనమును శ్రీకృష్ణపరమాత్మకూడా మానవభాషలోనే చేయవలసివచ్చినది. అందు చేత అనేకవిధములైన భాషాప్రయోగములు

చేసి అర్జునుని తృప్తిపరచుచున్నాడు. అంతా ఈశ్వరమయమే. కనుక సర్వము ఈశ్వరునియందే యున్నది. ఈశ్వరుడు నిర్లిప్తుడు. వాస్తవానికి కర్తకాడు. అందుచేత అతనిలో జీవములేదని చెప్పవచ్చును. కాని ఆతడు తన భక్తులయందు తప్పక ఉన్నాడు. నాస్తికులైనవారికి వారిదృష్టిలో ఈశ్వరుడు లేడు. దీనిని ఈశ్వరుని విచిత్రమైన మాయగాక మరేమనవలెను.

6. యథాకాశస్థితో నిత్యం వాయుః సర్వత్రగో మహాన్।
తథా సర్వాణి భూతాని మత్స్థానీ త్యుపధారయ ॥

సర్వత్రా వీచుచున్నగాలి నిత్యమూ ఆకాశములో వుండునట్లుగా అన్ని ప్రాణులు నాలో వున్నవని తెలిసికొనుము.

7. సర్వ భూతాని కౌంతేయ ప్రకృతిం యాంతి మామికామ్।
కల్పక్షయే పునస్తాని కల్పాదౌ విసృజామ్యహమ్॥

అర్జునా! అన్నిప్రాణులు కల్పాంతమందు నా ప్రకృతిలో కలియుచున్నవి. తిరిగి కల్పారంభము కాగానే వాటిని నేను సృష్టించుచున్నాను.

8. ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః।
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్॥

నా మాయయొక్క సహాయముచే ప్రకృతి ప్రభావములోనుండెడి ప్రాణి సముదాయమంతటిని నేను మరల మరల సృష్టించుచున్నాను.

9. న చ మాం తాని కర్మాణి నిబధ్నంతి ధనంజయ।
ఉదాసీనవదాసీన మసక్తం తేషు కర్మసు॥

ధనంజయా! ఈ కర్మలు నన్ను బంధించవు. ఏలనన-నేను వాటియందు తటస్థుడనై ఆసక్తిరహితుడనై వ్యవహరించుచున్నాను.

10. మయాధ్యక్షేణ ప్రకృతిః సూయతే సచరాచరమ్।
హేతు నానేన కౌంతేయ జగద్విపరివర్తతే॥

నా అధికారములో ప్రకృతి స్థావర జంగమ జగత్తును సృష్టించుచున్నది. ఈ కారణమున జగత్తు పరిభ్రమించుచున్నది.

11. అవజానంతి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్।
పరంభావ మజానంతో మమ భూతమహేశ్వరమ్॥

సర్వభూత నియామకుడగు మహేశ్వర భావమును తెలుసుకొనని మూర్ఖులు మనుష్య శరీరము ధరించిన నన్ను అనాదరము చేయుచున్నారు.

వ్యాఖ్య: ఈశ్వరశక్తిని అంగీకరింపనివారు మానవ శరీరమందున్న అంతర్యామిని గుర్తింపజాలరు. పర

మాత్మయొక్క అస్తిత్వాన్ని అంగీకరించక వారు జడవాదులుగ నుందురు

12. మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః
రాక్షసీమాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః॥

వ్యర్థమైన ఆశలుగలవారు, వ్యర్థములగు కర్మలు చేయువారు, నిరర్థకమైన జ్ఞానముకల మూఢులు మోహమును కలిగించునట్టి రాక్షసప్రవృత్తికి వశులగుదురు.

13. మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతిమాశ్రితాః
భజంత్యనన్యమనసో జ్ఞాత్వా భూతాదిమవ్యయమ్॥

అర్జునా! దీనికి విరుద్ధముగా మహాత్ములు దైవీ ప్రకృతి నాశ్రయించి సకల భూతములకు మూలకారకుడనైనట్టి, నాశములేనట్టి నన్నెరిగి తదేకనిష్ఠతో నన్ను భజింతురు.

14. సతతం కీర్తయంతో మాం యతంతశ్చ దృఢవ్రతాః
నమస్యంతశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే।

ఆ దృఢ నిశ్చయముకలవారు ప్రయత్నశీలురు నిరంతరము నన్ను కీర్తింతురు. భక్తిపూర్వకముగా నమస్కరించుచు ధ్యానించుచు నన్ను ఉపాసింతురు.

15. జ్ఞానయజ్ఞేన చాప్యన్యే యజంతో మాముపాసతే।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్॥

మరికొందరు అద్వైత రూపముగను ద్వైతరూపము నను ఇంకనూ వివిధ రూపములలో సర్వవ్యాపకుడనగు నన్ను జ్ఞానముచే ఉపాసింతురు.

16. అహం క్రతురహం యజ్ఞః స్వధాహమహమౌషధమ్।
మంత్రోఽహ మహమేవాజ్య మహమగ్నిరహం హుతమ్।

యజ్ఞ సంకల్పము, యజ్ఞము, పితృయజ్ఞము, వన స్పతులును, మంత్రములు, అగ్ని, ఆహుతి, హవనద్రవ్యము లన్నియు నేనే.

17. పితాహమస్య జగతో మాతా ధాతా పితామహః।
వేద్యం పవిత్రమోంకార ఋక్ సామ యజురేవ చ॥

ఈ జగత్తునకు తల్లి - తండ్రి ధారణకర్త, పితా మహుడు, తెలియదగినవాడు, పవిత్రమగు ఓంకారమును, ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదములునూ నేనే.

18. గతిర్భర్తా ప్రభుః సాక్షి నివాసః శరణం సుహృత్।
ప్రభవః ప్రళయః స్థానం నిధానం బీజమవ్యయమ్॥

నేనేగతిని, పోషకుడను, ప్రభువును, సాక్షిని, ఉనికి పట్టును, ఆశ్రయమును, హితైషిని, ఉత్పత్తి-స్థితి-లయమును, విధానమును, నాశములేని బీజము - అన్నియు నేనే అయి వున్నాను.

19. తపామ్యహ మహం వర్షం నిగృహ్ణామ్యుత్సృజామి చ।
అమృతం చైవ మృత్యుశ్చ సదసచ్చాహమర్జున।

నేను వేడిని కలుగజేయుచున్నాను. వానలను కురిపించుచున్నాను. వాటిని నిలిపివేయుచున్నాను. అమరత్వమును, మృత్యువును నేనే. సత్-అసత్‌లను కూడా నేనే.

20. త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞైరిష్ట్వా స్వర్గతిం ప్రార్థయంతే।
తే పుణ్యమాసాద్య సురేంద్రలోక—
మశ్నంతి దివ్యాన్‌దివి దేవభోగాన్॥

మూడు వేదములలో చెప్పబడిన కర్మలు చేయువారు, సోమరసము త్రాగి పాపములనుండి విముక్తులైనవారును, యజ్ఞములద్వారా నన్ను పూజించి స్వర్గమును కోరుచుందురు. వారు పవిత్రమగు దేవలోకమును చేరి స్వర్గమందు దివ్యభోగములను అనుభవించుచుందురు.

వ్యాఖ్య: సమస్త వైదికకర్మలు ఫలాపేక్షతో జరుగుచుండెడివి. అందులో కొన్ని కర్మలందు సోమపానము జరుగుచుండెడిది. ఆ విషయమే ఇచట ఉదహరించబడినది. ఈ కర్మ లెట్టివో, సోమరస మెట్టిదో నేడు ఎవరును చెప్పజాలకున్నారు.

21. తేతం భుక్త్వా స్వర్గలోకం విశాలం
క్షీణే పుణ్యే మర్త్యలోకం విశంతి॥
ఏవం త్రయీధర్మ మనుప్రపన్నా
గతాగతం కామకామా లభంతే॥

అట్లు స్వర్గలోకమును పొందినవారు విశాలమగు స్వర్గలోక సుఖములను అనుభవించి, పుణ్యములు క్షీణించిన పిమ్మట మరల మర్త్యలోకమున జన్మించుచున్నారు. మూడు వేదముల ననుసరించి కర్మలు చేయువారును, ఫలాపేక్షను కలిగియుండువారును జనన మరణ వ్యాపారములో చిక్కుపడుచుందురు.

22. అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే।
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్॥

ఎవరు అనన్యభావముతో నన్ను ధ్యానించుచూ భజించుచుందురో అట్టి నిరంతర పరమేశ్వర యోగనిష్ఠులగు వారి యోగక్షేమములను నేనే వహించుచున్నాను.

వ్యాఖ్య: యోగిని గుర్తించుటకు ఉత్తమమైన మూడు లక్షణములు చెప్పబడియున్నవి. సమత్వము, కార్యకుశలత, అనన్యభక్తి - ఈ మూడును పరస్పరము సమ్మిళితమై యుండవలెను. భక్తిలేనిదే సమత్వము కలుగదు. సమత్వములేనిదే భక్తి కుదురదు. కార్యకుశలతలేనిదే భక్తి, సమత్వములు కలుగుట సందేహాస్పదము. యోగమనగా లభించని వస్తువును పొందుట, క్షేమ మనగా లభించినదానిని సురక్షితముగా కాపాడుకొనుట.

23. యేఽప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయాన్వితాః।
తేఽపి మామేవ కౌంతేయ యజంత్యవిధిపూర్వకమ్॥

అర్జునా! ఎవరైతే ఇతర దేవతలను శ్రద్ధతో పూజించుచున్నారో వారున్నూ విధిపూర్వకముగా కాక పోయినప్పటికీ నన్నే భజించుచున్నవారగుచున్నారు.

వ్యాఖ్య: విధిపూర్వకము కాకపోవుట అనగా అజ్ఞాన వశమున నన్ను నిరంజనునిగను, నిరాకారునిగను తెలిసికొనక పూజించుట యని అర్థము.

24. అహం హి సర్వయజ్ఞానాం భోక్తా చ ప్రభురేవ చ।
న తు మా మభిజానంతి తత్త్వేనాత శ్చ్యవంతి తే॥

సకల యజ్ఞములకును భోక్తను, ప్రభువును నేనే. కాని యజ్ఞము చేయువారు నా నిజస్వరూపమును తెలిసికొనజాలక జనన-మరణముల పాలగుచుందురు.

25. యాంతి దేవవ్రతా దేవా౯ పితౄన్యాంతి పితృవ్రతాః।
భూతాని యాంతి భూతేజ్యా యాంతి మద్యాజినోఽపి మామ్॥

దేవతలను పూజించెడివారు దేవలోకములను, పితృదేవతలను పూజించువారు పితృలోకమును, భూతప్రేతాది కములను పూజించువారు ఆయా లోకములను పొందుచున్నారు. నన్ను భజించువారు నన్నే పొందుచున్నారు.

26. పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యా ప్రయచ్ఛతి।
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః॥

భక్తిపూర్వకముగా శ్రద్ధతో సమర్పించు పత్రము నైనను, పువ్వులనైనను, పండునైనను, జలమునైనను నేను ప్రీతితో స్వీకరింతును.

వ్యాఖ్య : ఈశ్వర ప్రీతికొఱకు సేవాభావముతో అర్పింపబడిన వస్తువులను ఆయా ప్రాణులందుండు అంతర్యామి యగు భగవంతుడే స్వీకరించుచున్నాడు.

27. యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్।
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్॥

అర్జునా! కావున నీవేమిచేసినను, ఏమి భుజించినను, ఏది హోమము చేసినను, దానము చేసినను, ఏ తపము చేసినను-వాటి నన్నింటిని నాకర్పించి చేయుము.

28. శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః।
సన్న్యాసయోగ యుక్తాత్మా విముక్తో మాముపైష్యసి॥

ఇందుచే శుభాశుభములను కలిగించు కర్మబంధముల నుండి నీవు ముక్తిపొందగలవు. మరియు ఫలత్యాగముచే లభించు సమత్వమునుపొంది జన్మమరణములనుండి విముక్తుడవై నన్ను పొందగలవు.

29. సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః।
యే భజంతి తు మాం భక్త్యా మయితేతేషు చాప్యహమ్॥

నేను సమస్త ప్రాణులయందు సమభావమునే కలిగి యుందును. నాకేప్రాణియు ప్రియమైనదిగాని, అప్రియ

మైనదిగాని కాదు. భక్తిభావముతో నన్ను భజించువారు నాయందే యుందురు. నేను వారియందు ఉందును.

30. అపి చేత్ సుదురాచారో భజతే మామనన్యభాక్।
సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః॥

మహాపాపియైనను అనన్యభావముతో నన్ను భజించినచో వాడు సాధుసజ్జనుడే యగును. ఏలనన-అతని కిపుడు సత్సంకల్పము కలిగియున్నది కదా!

వ్యాఖ్య: అనన్యభక్తి దుశ్చింతలకు అవకాశమివ్వదు.

31. క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి।
కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి॥

అట్టివాడు శీఘ్రముగా ధర్మాత్ముడై నిరంతర శాంతిని పొందును. అర్జునా! నా భక్తు డెన్నటికిని నశింపడని నీవు నిశ్చయముగా తెలిసికొనుము.

32. మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః।
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాంతి పరాంగతిమ్॥

పార్థా! పాపజన్ములు, స్త్రీలు, వైశ్యులు, శూద్రులు అయినను శరణుజొచ్చినచో పరమగతిని పొందగలరు.

33. కిం పునర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయస్తథా।
అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మామ్॥

ఇక నా భక్తులైన పాపాత్ములే మోక్షమును పొందుటకు అర్హులైనప్పుడు పుణ్యాత్ములు, భక్తులునూ అయిన బ్రాహ్మణ, రాజర్షులను గురించి ఏమి చెప్పవలెను? కనుక ఈ అనిత్యమునూ, సుఖరహితమునూ అయిన యీ లోకములో జన్మించిన నీవు నన్నే భజింపుము.

34. మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు।
మామేవైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః॥

నా యందు మనసు నిలుపుము. నా భక్తుడవగుము. నా నిమిత్తమే యజ్ఞము చేయుము. నాకు నమస్కరింపుము. ఈ రీతిగా ఆత్మను సంధానము చేసి నా యెడ తత్పరుడవై నన్నే పొందుదువు.

ఈ విధముగా ఉపనిషత్ ప్రతిపాదకము, బ్రహ్మ విద్యా విషయిక యోగశాస్త్రమును, శ్రీ కృష్ణార్జున సంవాదమును అగు భగవద్గీతలోని
రాజవిద్యారాజగుహ్యయోగమనెడి
తొమ్మిదవ అధ్యాయము
సమాప్తము.

ఓం తత్సత్

# పదవ అధ్యాయము

## విభూతి యోగము

ఏడు ఎనిమిది తొమ్మిదవ అధ్యాయములలో భక్తి మొదలగువానిని బోధించిన పిమ్మట భగవానుడు భక్తుల కొఱకు తన అనంత విభూతులను దిఙ్మాత్రముగా దర్శింప చేయుచున్నాడు.

శ్రీ భగవానువాచ —

1 భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః ।
యత్తేఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా ॥

శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు

అర్జునా! నీవు ఆసక్తితో నేను చెప్పిన దానిని శ్రద్ధతో ఆలకించుచుంటివి. కనుక నీ హితముకోరి పరమోపదేశము చేయుచున్నాను, మరల వినుము.

2 న మే విదుః సురగణాః ప్రభవం న మహర్షయః ।
అహ మాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః ॥

దేవతలును, మహర్షులును నా పుట్టుకనుగురించి యెరుగరు. ఎందుకనగా — నేనే దేవతలకును, మహర్షులకును సమస్తవిధముల మూలకారణభూతుడను.

3 యో మా మజ మనాదిం చ వేత్తి లోకమహేశ్వరమ్ ।
అసంమూఢః స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే ॥

సర్వలోక నియామకుడనగు నన్ను పుట్టుక లేనివానిని గను, అనాదిసిద్ధుడుగను మర్త్యలోకమున నుండు జ్ఞాని తెలిసికొనునేని వాడు సకలపాపములనుండి ముక్తుడగును.

4 బుద్ధిర్జ్ఞాన మసంమ్మోహః క్షమా సత్యం దమః శమః ।
సుఖం దుఃఖం భవోఽభావో భయం చాభయమేవ చ ॥

5 అహింసా సమతా తుష్టి స్తపో దానం యశోఽయశః ।
భవంతి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః ॥

బుద్ధి, జ్ఞానము అపమత్తత, క్షమ, సత్యము, ఇంద్రియ నిగ్రహము, శాంతి, సుఖము, దుఃఖము, జననము, మరణము, భయము, నిర్భయము, అహింస, సమత్వము, సంతుష్టి, తపస్సు, దానము, కీర్తి, అపకీర్తి మున్నగు నానావిధ భావములన్నియు భూతజాలములకు నావల్లనే కలుగుచున్నవి.

6 మహర్షయః సప్తపూర్వే చత్వారో మనవ స్తథా ।
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః ॥

సప్తరుషులు, వారికంటె పూర్వము సనకాదులు నలుగురు, పదునాల్గురు మనువులు నా సంకల్పమువలననే ఉత్పన్నమైరి. వారివల్లనే యీ లోకములు ఉద్భవించినవి.

7 ఏతాం విభూతిం యోగం చ మమ యో వేత్తి తత్త్వతః ॥
సోఽవికంపేన యోగేన యుజ్యతే నాత్ర సంశయః ॥

నా యీ విభూతిని (మహిమ), శక్తిని యదార్థముగ యెరిగినవాడు నిశ్చలమైన సతమ్వమును పొందును. ఇందు సందేహము లేదు.

8 అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే ।
ఇతి మత్వా భజంతే మాం బుధా భావసమన్వితాః॥

నేను సకల భూతోత్పత్తికి కారణమైయున్నాను. నా వలననే అవి అన్నియు ప్రవర్తిల్లుచున్నవి. ఇది తెలిసిన బుద్ధిమంతులు నన్ను భక్తిభావముతో సేవించుచున్నారు.

9 మచ్చిత్తా మద్గతప్రాణా బోధయంతః పరస్పరమ్ ।
కథయంతశ్చ మాం నిత్యం తుష్యంతి చ రమంతి చ ॥

నాయందే మనసు నిలుపువారు, నాకొఱకు ప్రాణార్పణము చేయువారు పరస్పరము ప్రబోధించుకొనుచు నిత్యమూ నన్నే కీర్తించుచు ఆత్మానందముతో జీవితము గడపుచుందురు.

10 తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।
దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే ॥

ఈ విధముగా నా యందు తన్మయులైయుండువారికి, భక్తిపూర్వకముగా నన్ను సేవించువారికి నేను జ్ఞానము కలుగచేయుచున్నాను. దానిచే వారు నన్ను పొందుదురు.

11 తేషామే వానుకంపార్థ మహమజ్ఞానజం తమః ।
నాశయామ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా ॥

వారియందు దయతలచి వారిహృదయములోనున్నట్టి నేను జ్ఞానమనెడి ప్రకాశవంతమగు దీపముతో వారి అజ్ఞానాంధకారమును నశింప చేయుచున్నాను.

అర్జున ఉవాచ :—

12 పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్ ।
పురుషం శాశ్వతం దివ్యమాదిదేవమజం విభుమ్ ॥
13 ఆహుస్త్వామృషయః సర్వే దేవర్షి ర్నారద స్తథా ।
అసితో దేవలో వ్యాసం స్వయం చైవ బ్రవీషి మే ॥

అర్జునుడు ప్రశ్నించుచున్నాడు—

ఓ పరమాత్మా! నీవు పరబ్రహ్మవు, పరంధాముడవు, పరమ పవిత్రుడవు. ఋషులందరు, దేవర్షియగు నారదుడు, అసితుడు, దేవలుడు, వ్యాసుడు మొదలగువారందరును నిన్ను నాశరహితునిగను, దివ్యపురుషునిగను, ఆదిదేవునిగను పుట్టుకలేనివాడవని ఈశ్వరుడవని భావించుచున్నారు. నీవుకూడా అదే చెప్పుచున్నావు.

14 సర్వమేతదృతం మన్యే యన్మాం వదసి కేశవ ।
న హి తే భగవన్ వ్యక్తిం విదుర్దేవా న దానవాః ॥

కేశవా! నీవు చెప్పునది నిజమని నేను అంగీకరించుచున్నాను. ఓ దేవా! నీ స్వరూపమును దేవతలుగాని దానవులుగాని తెలియజాలకున్నారు.

15 స్వయమేవాత్మనాత్మానం వేత్థ త్వం పురుషోత్తమ ।
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే ॥

ఓ పురుషోత్తమా! ఓ జగత్పితా! ఓ జీవేశ్వరా! ఓ దేవదేవా! ఓ జగన్నాథా! నిన్నుగురించి నీవే ఎరుగుదువు. ఇతరులు తెలిసికొనలేరు.

16 వక్తుమర్హస్యశేషేణ దివ్యా హ్యాత్మ విభూతయః ।
యాభిర్విభూతి భిర్లోకానిమాం స్త్వం వ్యాప్య తిష్ఠసి ॥

ఈ లోకములో నీవు ఏయే విభూతులద్వారా వ్యాపించి యున్నావో అట్టి దివ్యవిభూతులను గురించి నాకు విశదపరచుము.

17 కథం విద్యామహం యోగింత్వాం సదా పరిచింతయన్ ।
కేషు కేషు చ భావేషు చింత్యోఽసి భగవన్మయా ॥

ఓ యోగేశ్వరా! నిన్ను సతతము ధ్యానము చేయుచూ ఎట్లు తెలిసికొనగలను? ఓ పరమాత్మా! ఏయే భావములతో నిన్ను ధ్యానింపవలెను?

18 విస్తరేణాత్మనో యోగం విభూతిం చ జనార్దన।
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాస్తి మేఽమృతమ్ ॥

ఓ జనర్దనా ! నీశక్తి మరియు నీ విభూతులను గురించి సవిస్తారముగా మరియొకసారి తెలియజేయుము. నీ అమృతమయమగు వాణిని ఎంత విన్ననూ తనివి తీరుటలేదు.

శ్రీభగవానువాచ :—

19 హంత తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః।
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యంతో విస్తరస్య మే ॥

శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు.

ఓ కురుశ్రేష్ఠా ! నేను ముఖ్యమైన నా దివ్యవిభూతులను గురించి చెప్పెదను, ఆలకింపుము. నా విభూతులు అనంతములుగా నున్నవి. వాటిని విపులముగా చెప్పుటకు శక్యము కాదు.

20 అహమాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః।
అహమాదిశ్చ మధ్యం చ భూతానామంత ఏవ చ ॥

అర్జునా ! సకల భూతములయొక్క హృదయములయందున్న ఆత్మను నేనే. భూతములయొక్క ఉత్పత్తి స్థితి లయములకు కారకుడను నేనే.

21 ఆదిత్యానామహం విష్ణుర్జ్యోతిషాం రవిరంశుమాన్ ।
మరీచిర్మరుతామస్మి నక్షత్రాణామహం శశీ ॥

ఆదిత్యులలో విష్ణువును, జ్యోతులలో తేజోవంతుడైన సూర్యుడను, వాయువులలో మరీచి, నక్షత్రములలో చంద్రుడను నేనే.

22 వేదానాం సామవేదోఽస్మి దేవానామస్మి వాసవః।
ఇంద్రియాణాం మనశ్చాస్మి భూతానామస్మి చేతనా ॥

వేదములలో సామవేదమును, దేవతలలో ఇంద్రుడు, ఇంద్రియములలో మనస్సు, ప్రాణులలోని చైతన్యమును నేనే.

23 రుద్రాణాం శంకరశ్చాస్మి విత్తేశో యక్షరక్షసామ్।
వసూనాం పావకశ్చాస్మి మేరుః శిఖరిణామహమ్ ॥

రుద్రులలో శంకరుడను, యక్షరాక్షసులలో కుబేరుడను, వసువులలో అగ్ని, పర్వతములలో మేరుపర్వతమును నేనే.

24 పురోధసాం చ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్॥
సేనానీనామహం స్కందః సరసామస్మి సాగరః॥

ఓ పార్థా! పురోహితులలో ముఖ్యుడైన బృహస్పతిగా నన్నెరుగుము. సేనాపతులలో కుమారస్వామిని నేను. సరోవరములలో సముద్రుడను నేను.

25 మహర్షీణాం భృగురహం గిరామస్మ్యేకమక్షరమ్।
యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి స్థావరాణాం హిమాలయః॥

మహర్షులలో భృగుమహర్షిని నేను. శబ్దములలో ఏకాక్షరియగు 'ఓం' కారమును నేనే. యజ్ఞములలో జప యజ్ఞమును నేను. స్థావరములలో హిమాలయమును నేనే.

26 అశ్వత్థః సర్వవృక్షాణాం దేవర్షీణాం చ నారదః।
గంధర్వాణాం చిత్రరథః సిద్ధానాం కపిలో మునిః॥

వృక్షములలో అశ్వత్థ వృక్షమును నేను. దేవర్షులలో నారదుడను, గంధర్వులలో చిత్రరథుడను, సిద్ధులలో కపిల మునిని నేనే.

27 ఉచ్చైఃశ్రవస మశ్వానాం విద్ధి మామమృతోద్భవమ్।
ఐరావతం గజేంద్రాణాం నరాణాం చ నరాధిపమ్॥

సముద్రమథన సమయమందు అమృతముతో పాటు పుట్టిన ఉచ్చైశ్శ్రవమను అశ్వమును, ఐరావతమను ఏనుగును నేనే. మనుష్యులలో రాజును నేనే.

28 ఆయుధానామహం వజ్రం ధేనూనామస్మి కామధుక్।
ప్రజనశ్చాస్మి కందర్పః సర్పాణామస్మి వాసుకిః

ఆయుధములలో వజ్రాయుధమును, గోవులలో కామధేనువు నేనే. ప్రజోత్పత్తికి కారణుడగు కామదేవుడను నేనే. సర్పములలో వాసుకిని నేను.

29 అనంతశ్చాస్మి నాగానాం వరుణో యాదసామహమ్।
పితౄణామర్యమా చాస్మి యమః సంయమతామహమ్॥

నాగులలో శేషనాగుడను నేనే. జలదేవతలలో వరుణుడను, పితృదేవతలలో అర్యముడను, దండించువారిలో యముడను నేనే.

30 ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతామహమ్।
మృగాణాం చ మృగేంద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్॥

దైత్యులలో ప్రహ్లాదుడను నేను. గణితశాస్త్రజ్ఞులలో కాలమును నేనే. మృగములలో సింహమును, పక్షులలో గరుత్మంతుడను నేనే.

31 పవనః పవతామస్మి రామః శస్త్రభృతామహమ్।
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసామస్మి జాహ్నవీ॥

పవిత్ర మొనర్చువానిలో పవనుడను నేను. శస్త్రధారులలో పరశురాముడను నేనే. మత్స్యములలో మొసలిని నేను. నదులలో గంగను నేనే.

32 సర్గాణా మాదిరంతశ్చ మధ్యం చైవాహ మర్జున।
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతామహమ్॥

ఓ అర్జునా! సకల సృష్టికి ఆది మధ్య అంతములు నేనే. విద్యలలో ఆధ్యాత్మిక విద్యను నేను. తర్కశాస్త్రజ్ఞులయొక్క తర్కవాదమును నేను.

33 అక్షరాణామకారోఽస్మి ద్వంద్వః సామాసికస్య చ।
అహమేవాక్షయః కాలో ధాతాహం విశ్వతోముఖః॥

అక్షరములలో 'అ' కారమును నేను. సమాసములలో ద్వంద్వ సమాసమును నేను. అనంతమగు కాలస్వరూపుడను నేనే. సర్వవ్యాపియగు స్రష్టను నేనే.

34 మృత్యుః సర్వహరశ్చాహముద్భవశ్చ భవిష్యతామ్।
కీర్తిః శ్రీర్వాక్ చ నారీణాం స్మృతిర్మేధా ధృతిః క్షమా॥

అందరిని హరించు మృత్యువును నేనే. భవిష్యత్ లో ఉత్పన్నమగువాటి ఉత్పత్తికారకుడను నేను. స్త్రీలింగ శబ్దములలో - కీర్తి, లక్ష్మి, వాణి, స్మృతి, మేధా, ధృతి, క్షమలను నేనే.

35 బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛందసామహమ్।
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః॥

సామములలో బృహత్ సామమును, ఛందస్సులలో గాయత్రీ ఛందమును, మాసములలో మార్గశిరమాసమును, రుతువులలో వసంతరుతువును నేనే.

36 ద్యూతం ఛలయతామస్మి తేజస్తేజస్వినామహమ్।
జయోఽస్మి వ్యవసాయోఽస్మి సత్త్వం సత్త్వవతామహమ్॥

మోసకాండ్ర యొక్క జూదమును, ప్రతాపవంతుల యొక్క ప్రభావమును, జయమును, నిశ్చయమును నేనే సాత్వికుల యందలి సత్వమును నేనే.

వ్యాఖ్య :— మోసగాండ్ర యొక్క 'జూదము' నేను అన్నమాట విని భయపడవలసిన పనిలేదు. ఇచట మంచిచెడ్డలనిర్ణయము చేయబడుటలేదు. ఏమిజరిగినను ఈశ్వరాజ్ఞలేనిదే జరుగదని చెప్పుటయే దీని ఉద్దేశము. అంతయు ఈశ్వరుని అధీనమందే కలదని తెలిసికొనిన కపటి, మోసకాడు కూడా తన అహంకారమును విడచి కపటమును మోసమును త్యజించెదరుగాక!

37 వృష్ణీనాం వాసుదేవోఽస్మి పాండవానాం ధనంజయః।
మునీనామప్యహం వ్యాసః కవీనాముశనా కవిః॥

యాదవులలో వాసుదేవుడను నేను, పాండవులలో అర్జునుడను నేనే, మునులలో వ్యాసుడను, కవులలో శుక్రాచార్యుడను నేనే.

38 దండో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతామ్।
మౌనం చైవాస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతామహమ్॥

శాసకుల చేతి దండము నేను. జయమును కాంక్షించువారి నీతిని నేను. రహస్య విషయములలోని మౌనమును నేను. జ్ఞాని యొక్క జ్ఞానమును నేనే.

39 యచ్చాపి సర్వభూతానాం బీజం తదహమర్జున।
న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాచరమ్॥

ఓ అర్జునా! సమస్త జీవరాశియొక్క ఉత్పత్తి కారణము నేను. ఈ చరాచరరూపమైన భూత సమూహము నందు నేను లేకుండా యేదియును లేదు.

40 నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప।
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతేర్విస్తరో మయా॥

ఓ పరంతపా! నా దివ్య విభూతులకు అంతము లేదు. అపారమైన నావిభూతులను కొన్నిటిని మాత్రమే దృష్టాంతముగా చెప్పియున్నాను.

41 యద్యద్విభూతిమత్సత్త్వం శ్రీమదూర్జితమేవవా।
తత్తదేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్॥

సృష్టిలోని విభూతియుక్తమగు లక్ష్మీకరమగు ప్రభావయుక్తమగు నట్టిది నా తేజస్సుయొక్క అంశము వలననే కలిగినదని నీవు తెలిసికొనుము.

42 అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవార్జున।
విష్టభ్యాహమిదం కృత్స్నమేకాంశేన స్థితో జగత్॥

ఓ అర్జునా! నా విభూతులను గురించి విస్తారముగ తెలిసికొనిన నీకేమి ప్రయోజనము చేకూరును? నాలోని ఒక

అంశము చేతనే నేను ఈ సమస్త జగత్తును ధరించి అందు వ్యాపించి యున్నానని తెలిసికొనుటయే చాలును.

ఈ విధముగా ఉపనిషదర్థ ప్రతిపాదకము,
బ్రహ్మవిద్యావిషయిక యోగశాస్త్రమును
శ్రీకృష్ణార్జున సంవాదమును అగు
భగవద్గీతలోని విభూతి
యోగమను పదియవ
అధ్యాయము
సమాప్తము.

ఓం తత్సత్

# పదకొండవ అధ్యాయము

## విశ్వరూప సందర్శన యోగము

ఈ అధ్యాయములో శ్రీకృష్ణపరమాత్మ తన విరాట్ స్వరూపమును అర్జునునకు ప్రదర్శించుచున్నాడు. భక్తులకు ఈ అధ్యాయము అత్యంతప్రియమైనది. ఇందు తర్కమునకు తావులేదు. ఇది రసాత్మకమైన కావ్యము. ఈ అధ్యాయమును ఎంత చదివిననూ తనివితీరదు.

అర్జున ఉవాచ:—

1 మదనుగ్రహాయ పరమం గుహ్యమధ్యాత్మ సంజితమ్।
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ॥

అర్జునుడు ప్రశ్నించుచున్నాడు.

ఓ కృష్ణా! నీవు నా యందు దయతలచి ఆధ్యాత్మిక పరమగు పరమ రహస్యమును చెప్పినావు. నీవు నాకు తెలిపిన విషయముల వలన నా మోహము నశించినది.

2 భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా,
త్వత్తః కమలపత్రాక్ష మహాత్మ్యమపి చావ్యయమ్॥

ప్రాణికోటియొక్క ఉత్పత్తి, నాశములను గురించి నీ వలన నేను సవిస్తారముగా వింటిని. ఓ కమలనయనా! అటు

లనే నాశరహితమైన నీ మహాత్త్వమును కూడ తెలిసి కొంటిని.

3 ఏవమేతద్యథాత్థ త్వమాత్మానం పరమేశ్వర।
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ॥

ఓ పరమాత్మా! నిన్ను గూర్చి ఏ విధముగా ఎరుక పరచితివో అదియంతయూ యథార్థమే. పురుషోత్తమా! దివ్యమగు నీ ఈశ్వర స్వరూపమును దర్శించవలెనను కోరిక కలుగుచున్నది.

4 మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమితి ప్రభో।
యోగేశ్వర తతో మే త్వం దర్శయాత్మానమవ్యయమ్

యోగేశ్వరుడవగు ఓ ప్రభూ! నీ దివ్యరూపమును దర్శించుట నాకు శక్యమేనని నీవు తలచుచో అట్టి నిత్యమైన ఆత్మస్వరూపమును చూపుము.

శ్రీ భగవానువాచ:—

5 పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః।
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ॥

శ్రీకృష్ణభగవానుడు చెప్పుచున్నాడు

పార్థా! వందలు వేలకొలదిగానున్న నా రూపములను చూడుము. అవి పలు రకములుగా దివ్యములైన రంగులు, ఆకారములు కలిగియున్నవి.

6 పశ్యాదిత్యాన్వసూన్ రుద్రానశ్వినౌ మరుత స్తథా।
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత॥

అర్జునా! ఆదిత్యులను, వసువులను, రుద్రులను, అశ్వినీ దేవతలను, మరుత్తులను చూడుము. మును పెన్నడును చూడనట్టి అనేక అద్భుతములను గాంచుము.

7 ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్।
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి॥

ఓ పార్థా! ఈ నా శరీరములో సమస్త చరాచర జగత్తును ఒక చోటనే యిచట చూడుము. ఇంకనూ నీవు చూడగోరిన వాటినన్నిటిని చూడుము.

8 నతు మాం శక్యసే ద్రష్టుమనేనైవ స్వచక్షుషా।
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగమైశ్వరమ్॥

ఈ నీ చర్మచక్షువులతో నీవు నన్ను చూడలేవు. కావున నేను నీకు దివ్యదృష్టిని ప్రసాదించుచున్నాను. నీవు నా ఈ ఈశ్వర సంబంధమగు యోగమును దర్శింపుము.

సంజయ ఉవాచ:—

9 ఏవముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః,
దర్శయామాస పార్థాయ పరమం రూపమైశ్వరమ్॥

ఓ ధృతరాష్ట్రమహారాజా ! ఈ విధముగా చెప్పిన యోగేశ్వరుడగు శ్రీ కృష్ణపరమాత్మ అర్జునునకు తన పరమేశ్వర స్వరూపమును ప్రదర్శించినాడు.

10 అనేక వక్త్రనయన మనేకాద్భుత దర్శనమ్,
అనేక దివ్యాభరణం దివ్యానేకోద్యతాయుధమ్॥

ఆ విరాట్ రూపము అనేక ముఖములు కన్నులు కలిగి, పైకెత్తబడి తయారుగా నున్న అనేక దివ్యాయుధములతో. దివ్యాభరణములతో కూడి అత్యద్భుతముగానుండెను.

11 దివ్యమాల్యాంబరధరం దివ్యగంధానులేపనమ్।
సర్వాశ్చర్యమయం దేవ మనంతం విశ్వతోముఖమ్॥

ఆ రూపము అనేకములైన దివ్యమగు హారములు, వస్త్రములు ధరించియుండెను. దివ్యములైన సుగంధ ద్రవ్య లేపనములచే శోభిల్లుచుండెను. ఈ విధముగా అనేకాశ్చర్యములతో నిండి, అనంతమై సర్వవ్యాపకమైన సర్వేశ్వరుని అర్జునుడు దర్శించెను.

12 దివి సూర్యసహస్రస్య భవేద్యుగపదుత్థితా।
యది భాః సదృశీ సా స్యాద్భాసస్తస్య మహాత్మనః॥

ఆకాశమందు వేయిమంది సూర్యులు ఒక్కసారిగా ఉదయించినపుడు కలుగునంతటి ప్రకాశము ఆ మహాపురుషుని తేజస్సుతో సరిసమానమగునేమో !

13 తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా।
అపశ్యద్దేవదేవస్య శరీరే పాండవస్తదా॥

ఆ దేవాదిదేవుని శరీరమునందు అనేక రూపములుగా విభజింపబడియున్న జగత్తునంతటిని అర్జునుడు ఏకరూపములో చూచెను.

14 తతః స విస్మయావిష్టో హృష్టరోమా ధనంజయః।
ప్రణమ్య శిరసా దేవం కృతాంజలి రభాషత॥

అపుడు అర్జునుడు ఆశ్చర్యచకితుడై పులకాంకితుడై వినమ్రుడై చేతులు జోడించి యిట్లనెను.

అర్జున ఉవాచ:—

15 పశ్యామి దేవాంస్తవ దేవ దేహే
సర్వాంస్తథా భూతవిశేషసంఘాన్।
బ్రహ్మాణమీశం కమలాసనస్థ-
మృషీంశ్చ సర్వానురగాంశ్చ దివ్యాన్॥

అర్జునుడు చెప్పుచున్నాడు.

ఓ దేవా! నీ దేహమందు నేను సమస్త దేవతలను, పలువిధములైన ప్రాణి సమూహములను, కమలాసనమందు విరాజమానుడైన బ్రహ్మను, సప్తఋషులను, దివ్యసర్పములను చూచుచున్నాను.

16 అనేక బాహూదర వక్త్రనేత్రం
పశ్యామి త్వాం సర్వతోఽనంతరూపమ్।
నాంతం మధ్యం న పునస్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప॥

అనేక హస్తములతోను, ఉదరములతోను, ముఖములతో, నేత్రములతోను అనంతరూపుడవగు నిన్ను చూచుచున్నాను. నీ రూపమునకు మొదలుగాని, మధ్యగాని, తుదిగాని నాకు కనుపించకున్నది. ఓ విశ్వేశ్వరా! నీ విశ్వరూపమును నేను దర్శించుచున్నాను.

17 కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతోదీప్తిమంతమ్।
పశ్యామి త్వాం దుర్నిరీక్ష్యం సమంతాత్
దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్॥

కిరీటము, గద, చక్రాద్యాయుధములు ధరించి ఎల్లెడల జాజ్వల్యమానమగు తేజోరాశియై ప్రజ్వలించుచున్న అగ్నివలెను, చండభానుని పగిది తేరిచూడ దుస్సహమై యొప్పు అనంతమైన నీ దివ్యరూపమును సకల ప్రదేశములందు చూచుచున్నాను.

18 త్వమక్షరం పరమం వేదితవ్యం
త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్।
త్వ మవ్యయః శాశ్వత ధర్మగోప్తా
సనాతనస్త్వం పురుషో మతో మే॥

తెలిసికొనదగినట్టి పరమ అక్షరరూపునిగను ఈ జగత్తు నకు మూలాధారునిగను, సనాతన ధర్మమును సంరక్షించు నిత్యుడవుగను, పురాణ పురుషునిగను నేను తెలిసికొను చున్నాను.

19 అనాదిమధ్యాంత మనంతవీర్య
మనంతబాహుం శశిసూర్యనేత్రమ్।
పశ్యామి త్వాం దీప్తహుతాశవక్త్రం
స్వతేజసా విశ్వమిదం తపంతమ్॥

ఆది మధ్య అంతములు లేనివానిగను, అనంతశక్తి సంపన్నునిగను, అనంతబాహువులుగలవానిగను, సూర్య చంద్రులే నేత్రములుగాగలవానిగను, ప్రజ్వరిల్లిన అగ్ని వలె ముఖముగలవానిగను, తన తేజస్సుతో జగమును తపింప చేయువానిగను నేను నిన్ను చూచుచున్నాను.

20 ద్యావా పృథివ్యో రిదమంతరం హి
వ్యాప్తంత్వ యైకేన దిశశ్చ సర్వాః।
దృష్ట్వాద్భుతం రూపముగ్రం తవేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్॥

భూమ్యాకాశముల మధ్యను, ఎల్ల దిశలయందును, నీ వొక్కడవే వ్యాపించియున్నావు. అద్భుతమైన నీ ఈ ఉగ్ర రూపమునుగాంచి మూల్లోకములు గజగజలాడుచున్నవి.

21 అమీ హి త్వాం సురసంఘా విశంతి
కేచిద్భీతాః ప్రాంజలయో గృణంతి।
స్వస్తీత్యుక్త్వా మహర్షి సిద్ధసంఘాః
స్తువంతి త్వాం స్తుతిభిః పుష్కలాభిః॥

ఈ దేవతా సంఘములు నీయందు ప్రవేశించు చున్నవి. భయభీతులై ఎందరో చేతులు జోడించి నిన్ను ప్రస్తుతించుచున్నారు. మహర్షులు, సిద్ధసంఘములు లోక కళ్యాణమగుగాకయని స్తుతించుచూ అనేక విధములుగా నీ కీర్తిగానము చేయుచున్నారు.

21 రుద్రాదిత్యా వసవో యే చ సాధ్యా
విశ్వేఽశ్వినౌ మరుతశ్చోష్మపాశ్చ।
గంధర్వ యక్షాసుర సిద్ధసంఘాః
వీక్షంతే త్వాం విస్మితాశ్చైవ సర్వే॥

రుద్రులు, ఆదిత్యులు, వసువులు, సాధ్యులు, విశ్వ దేవతలు, అశ్వినీదేవతలు, మరుత్తులు, పితృదేవతలు, గంధ ర్వులు, యక్షులు, అసురులు, సిద్ధులు మొదలగు వారందరు ఆశ్చర్యమును పొందినవారై నిన్ను చూచుచున్నారు.

23 రూపం మహత్తే బహువక్త్రనేత్రం
మహాబాహో బహుబాహూరుపాదమ్।
బహూదరం బహుదంష్ట్రాకరాళం
దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథాహమ్॥

హే కృష్ణా! అనేక ముఖములు, కన్నులు, చేతులు, కాళ్ళు, తొడలు, ఉదరములు, కోరలుకలిగి భయంకరముగా కన్పట్టుచున్న నీ విరాట్ రూపమునుచూచి లోకములన్నియు భయపడి వున్నవి. నేనుకూడా అటులనే భయకంపితుడ నైతిని.

24 నభఃస్పృశం దీప్త మనేకవర్ణం
వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్।
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాంతరాత్మా
ధృతిం న విందామి శమం చ విష్ణో॥

ఆకాశమును అంటుచున్న, మిలమిల లాడుతున్న, అనేక వర్ణములు కలిగినట్టి, తెరచియున్న నోళ్ళు కలిగిన, విశాలమై తేజోవంతములైన నేత్రములు కలిగియున్న నిన్ను చూచి నా హృదయము వ్యాకులపడుచున్నది. నేను ధైర్యమును, శాంతిని పొందలేకున్నాను.

25. దంష్ట్రాకరాళాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానలసన్నిభాని।
దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ జగన్నివాస॥

ఓ దేవదేవా! జగన్నివాస! ప్రళయాగ్నివలె భయంకరమైన కోరలు కలిగియున్న నీ ముఖమును చూచి

నాకు దిక్కులు తెలియకున్నవి. శాంతి లభించుట లేదు. నీవు ప్రసన్నుడ వగుము.

26 అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావనిపాలసంఘైః।
భీష్మో ద్రోణః సూతపుత్ర స్తథాసౌ
సహాస్మదీయైరపి యోధముఖ్యైః॥

27 వక్త్రాణి తే త్వరమాణా విశంతి
దంష్ట్రాకరాళాని భయానకాని।
కేచిద్విలగ్నా దశనాంతరేషు
సందృశ్యంతే చూర్ణితై రుత్తమాంగైః॥

సమస్త రాజసమూహములతో పాటు ధృతరాష్ట్రుని కుమారులందరును, భీష్మద్రోణులు, సూతపుత్రుడు కర్ణుడు, ప్రముఖులైన మనయోధు లందరునూ వికరాళమగు కోరలు కలిగిన నీ భయంకరమైన నోటియందు వేగముగా ప్రవేశించుచున్నారు. ఎందరో తలలు పగిలి చూర్ణమై నీ దంతములమధ్య చిక్కుకొని యుండుటను చూచుచున్నాను.

28 యథా నదీనాం బహవోఽమ్బువేగాః
సముద్రమేవాభిముఖా ద్రవంతి।
తథా తవామీ నరలోకవీరా
విశంతి వక్త్రాణ్యభివిజ్వలంతి॥

నదీ ప్రవాహము సముద్రాభిముఖముగా ప్రవహించు తీరున ఈ వీరులందరూ నీకభిముఖులై ప్రజ్వలించుచున్న నీ నోటిలో ప్రవేశించుచున్నారు.

29 యథా ప్రదీప్తం జ్వలనం పతంగా
విశంతి నాశాయ సమృద్ధవేగాః।
తథైవ నాశాయ విశంతి లోకాః
స్తవాపి వక్త్రాణి సమృద్ధవేగాః॥

మిడతలు అతివేగముతో మండుచున్న నిప్పులో తమ వినాశనము కొరకే ఎగిరి పడునట్లు ప్రాణి సమూహము లన్నియు అతివేగముగా తమ నాశముకొరకు నీ నోటియందు ప్రవేశించుచున్నవి.

30 లేలిహ్యసే గ్రసమానః సమంతాత్-
లోకాన్సమగ్రాన్ వదనైర్జ్వలద్భిః।
తేజోభిరాపూర్య జగత్సమగ్రం
భాసస్తవోగ్రాః ప్రతపంతి విష్ణో॥

ఓ విష్ణుదేవా! అన్నివైపులనుండి అందరినీ మింగివేసి నీవు ప్రజ్వలించుచున్న నాలుకలతో ఆస్వాదించుచున్నావు. సర్వవ్యాపకుడవగు ఓ ప్రభూ! తీక్షణమగు నీ ప్రభాజాలము లోకమంతటిని తేజోమయ మొనర్చుచున్నది, దహింపజేయుచున్నది.

31 ఆఖ్యాహి మే కో భవానుగ్రరూపో
నమోఽస్తు తే దేవవర ప్రసీద।
విజ్ఞాతుమిచ్ఛామి భవంతమాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్॥

ఉగ్రరూపుడవైన నీ వెవరివో నాకు తెలియపరచుము. దేవదేవా! నీవు ప్రసన్నుడవగుము. ఆదిపురుషుడవగు నిన్ను నేను తెలిసికొనగోరుచున్నాను. నీ ప్రవృత్తి నాకు తెలియకున్నది.

శ్రీ భగవానువాచ —

32 కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో
లోకాన్సమాహర్తుమిహ ప్రవృత్తః।
ఋతేఽపి త్వాం న భవిష్యంతి సర్వే
యేఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః॥

లోకక్షయము కొరకు విజృంభించియున్న కాలస్వరూపుడను నేను. లోకములను నశింపచేయుటకొరకే యిచ్చటికి వచ్చియున్నాను. ఇక్కడ చేరిన సేనలలోని ప్రతి యోధునితో నీవు యుద్ధము చేయకపోయినప్పటికినీ వారిలో ఎవరునూ జీవించియుండలేరు.

33 తస్మాత్త్వముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుంక్ష్వ రాజ్యం సమృద్ధమ్।
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్॥

కనుక అర్జునా! నీవు యుద్ధ సన్నద్ధుడవు కమ్ము, కీర్తిని పొందుము. శత్రువులను జయించి ధనధాన్య సంపదలతో నిండిన రాజ్యమును అనుభవించుము. వీరినందరిని నేను ఇంతకుపూర్వమే చంపియుంటిని. ఓ సవ్యసాచీ! నీవు కేవలము నిమిత్తమాత్రుడవగుము.

34 ద్రోణంచ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథాన్యానపి యోధవీరాన్।
మయా హతాంస్త్వం జహి మా వ్యథిష్ఠాః
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్॥

భీష్ముడు, ద్రోణుడు, కర్ణుడు, జయద్రథుడు మొదలగు యోధులందరూ నాచే హతులైరి. నీవు భయపడకుము. యుద్ధము చేయుము, వారిని హతమార్చుము, ఈ యుద్ధములో నీవు జయము పొందవలసియున్నది.

**సంజయ ఉవాచ—**

35 ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాంజలి ర్వేపమానః కిరీటీ।
నమస్కృత్వా భూయ ఏవాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య॥

సంజయుడు చెప్పుచున్నాడు:—

శ్రీకృష్ణుని మాటలు విని అర్జునుడు చేతులు జోడించి వణుకుచూ మాటిమాటికి నమస్కరించుచు భయముచే ప్రణామ మొనర్చి గద్గద స్వరముతో యిట్లు పలికెను.

అర్జున ఉవాచ:—

36 స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగత్ ప్రహృష్యత్యనురజ్యతే చ।
రక్షాంసి భీతాని దిశో ద్రవంతి
సర్వే నమస్యంతి చ సిద్ధసంఘాః॥

అర్జునుడు చెప్పుచున్నాడు :—

ఓ హృషీకేశా! నిన్ను కీర్తించిన జగత్తునకు ఆనందము కలుగుచున్నది. నీ ఎడల అనురాగము అంకురించుచున్నది. రాక్షసులు భయకంపితులై యిటునటు పారిపోవుచున్నారు. సిద్ధ సమూహములు నీకు నమస్కరించుటయు తగియున్నది.

37 కస్మాచ్చ తే న నమేరన్మహాత్మన్
గరీయసే బ్రహ్మణోఽప్యాదికర్త్రే।
అనంత దేవేశ జగన్నివాస
త్వమక్షరం సదసత్తత్పరం యత్॥

ఓ మహాత్మా! అనంతా! దేవేశా! జగన్నివాసా! బ్రహ్మకంటెను అధికుడవును ఆదికర్తవును అగు నీకు వారందరు ఏల నమస్కరింప కుందురు? నీవు నాశము లేని వాడవు; సత్యాసత్యములకు అతీతుడవు. వీటి మూలమగు పరమాత్మయు నీవే!

38 త్వమాది దేవః పురుషః పురాణ
స్త్వమస్యవిశ్వస్య పరం నిధానమ్।
వేత్తాసి వేద్యం చ పరం చ ధామ
త్వయా తతం విశ్వమనంతరూప॥

నీవు ఆది దేవుడవు, పురాణ పురుషుడవు. ఈ విశ్వమునకు నీవు ఆశ్రయస్థానము, సర్వజ్ఞుడవు, ఎరుగదగిన వాడవు, పరంధాముడవు. అనంతరూపా! నీవు ఈ జగత్తు నంతటను నిండియున్నావు.

39 వాయుర్యమోఽగ్నిర్వరుణః శశాంకః
ప్రజాపతిస్త్వం ప్రపితామహశ్చ।
నమో నమస్తేఽస్తు సహస్రకృత్వః
పునశ్చ భూయోఽపి నమో నమస్తే॥

వాయువు, యముడు, అగ్ని, వరుణుడు, చంద్రుడు, ప్రజాపతి, ప్రపితామహుడవు నీవే। నీకు వేనవేల నమస్కారములు, మరల మరల నమస్కారములు చేయుచున్నాను.

40 నమః పురస్తాదథ పృష్ఠతస్తే
నమోఽస్తు తే సర్వత ఏవ సర్వ।
అనంత వీర్యామితవిక్రమస్త్వం
సర్వం సమాప్నోషి తతోఽసి సర్వః॥

సర్వాత్ముడవగు శ్రీకృష్ణా! నీకు ముందునుండియు, వెనుక నుండియు, అన్ని దిశలనుండియు నమస్కరింపు

చున్నాను. నీ బలము అనంతము, నీ శక్తి అపారము. జగత్తంతయు నీవు నిండియున్నావు. అందువలన నీవు సర్వేశ్వరుడవు.

41 సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ హే యాదవ హే సఖేతి।
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదాత్ప్రణయేన వాపి॥

42 యచ్చావహాసార్థమసత్కృతోఽసి
విహారశయ్యాసన భోజనేషు।
ఏకోఽథవాప్యచ్యుత తత్సమక్షం
తత్క్షామయే త్వామహమప్రమేయమ్॥

మిత్రుడవని తలచి నీ మహిమ తెలియగక ఓ కృష్ణా, ఓ సఖా, ఓ యాదవా, యని సంబోధించియున్నాను. పొరపాటువలనగాని, స్నేహము వలనగాని నావలన జరిగిన తప్పిదములను, వినోదార్థము ఆడుచూ పాడుచు నీ సాంగత్యములో తినుచూ, త్రాగుచు, అవివేకినై నిన్ను అనకూడని మాటలని యుందును. నా తప్పిదములను క్షమింప నిన్ను ప్రార్థించుచున్నాను.

43 పితాసి లోకస్య చరాచరస్య
త్వమస్య పూజ్యశ్చ గురుర్గరీయాన్।
న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్యప్రతిమప్రభావ॥

స్థావర జంగమ జగత్తునకు నీవే తండ్రివి. నీవే పూజ్యుడవైన శ్రేష్ఠగురుడవు. నీకు ఎవరునూ సాటిరారు. అట్టియెడ నిన్ను మించిన వారెట్లుండగలరు? ముల్లోకములలో నీ సామర్థ్యమునకు సాటిలేదు.

44 తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వామహమీశమీడ్యమ్।
పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియాయార్హసి దేవ సోఢుమ్॥

అందుచే పూజనీయుడవై సర్వేశ్వరుడవై యున్న నిన్ను ప్రసన్నుడవు కమ్మని సాష్టాంగ నమస్కారములుచేసి ప్రార్థించుచున్నాను. ఓ దేవా! తండ్రి తనయుని, మిత్రుడు మిత్రుని సహించినటుల నాకు ఆత్మీయుడవైనందున నా క్షేమము కోరి నన్ను అనుగ్రహింపుము.

45 అదృష్టపూర్వం హృషితోఽస్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే।
తదేవ మే దర్శయ దేవ రూపం
ప్రసీద దేవేశ జగన్నివాస॥

ఇంతకు ముందెన్నడును చూడనటువంటి నీ ఈ రూపమును చూచి నేను సంతోషము పొంది నేను గగుర్పాటు చెందితిని. భయముచే నా మనసు వ్యాకులమైనది. అందుచే ఓ దేవా! నీ మొదటి రూపమును చూపింపుము. దేవేశా! జగన్నివాసా! నీవు ప్రసన్నుడవుకమ్ము.

46 కిరీటినం గదినం చక్రహస్త
మిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ।
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో భవ విశ్వమూర్తే॥

శ్రీకృష్ణా! కిరీటము, గద, చక్రము ధరించిన నీ పూర్వ రూపమును దర్శింప కోరుచున్నాను. ఓ సహస్ర బాహూ! విశ్వమూర్తీ! మరల నీ చతుర్భుజ రూపమును ధరింపుము.

శ్రీ భగవానువాచ:—

47 మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శితమాత్మయోగాత్ ।
తేజోమయం విశ్వమనంతమాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్॥

శ్రీకృష్ణ భగవానుడు నుడువుచున్నాడు :—

అర్జునా! నీ యందు ప్రసన్నుడనై నా ఆత్మయోగ బలముచే తేజోవంతమై విశ్వవ్యాప్తమై అనంతమైన పరమ ఆదిరూపమును నీకు చూపించినాను. దీనిని నీవు తప్ప ఇంతకు ముందు ఎవరునూ చూడలేదు.

48 న వేదయజ్ఞాధ్యయనైర్న దానై
ర్న చ క్రియాభిర్న తపోభిరుగ్రైః.

ఏవంరూపః శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర॥

ఓ కురుప్రవీరా! వేదాధ్యయనమువలనగాని యజ్ఞము వలనగాని అనేక శాస్త్ర పాండిత్యముచేగాని, దానములచే క్రతువుచేగాని, ఘోర తపస్సు చేసియూ నీవుగాక ఇతరు లెవరునూ నా యీ రూపమును చూడలేక పోయిరి.

49 మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోరమీదృఙ్మమేదమ్।
వ్యపేతభీః ప్రీతమనాః పునస్త్వం
తదేవ మే రూపమిదం ప్రపశ్య॥

నా ఈ భీకర రూపమును జూచి నీవు భయపడకుము మోహము చెందకుము. భయమువీడి ప్రశాంత చిత్తుడవు కమ్ము. నా పరిచితమైన పూర్వరూపమును మరలచూడుము.

సంజయ ఉవాచ:—

50 ఇత్యర్జునం వాసుదేవస్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః॥
ఆశ్వాసయామాస చ భీతమేనం
భూత్వా పునః సౌమ్యవపుర్మహాత్మా॥

సంజయుడు చెప్పుచున్నాడు :—

ఈ విధముగా వాసుదేవుడు అర్జునునితో చెప్పి తన పూర్వ పరిచిత సౌమ్య సుందర రూపమును మరల చూపించెను. ఆ మహాత్ముడు శాంతమూర్తియై భయభ్రాంతుడైన అర్జునుని ఓదార్చెను.

అర్జున ఉవాచ:—

51 దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన ।
ఇదానీమస్మి సంవృత్తః సచేతాః ప్రకృతిం గతః ॥

అర్జునుడు చెప్పుచున్నాడు :—

ఓ జనార్దనా! నీ సౌమ్య మానవ రూపమునుజూచి ఇపుడు నేను శాంత చిత్తుడనై స్థిమిత పడితిని.

శ్రీభగవానువాచ:—

52 సుదుర్దర్శమిదం రూపం దృష్టవానసి యన్మమ ।
దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శనకాంక్షిణః ॥

శ్రీకృష్ణ పరమాత్మ చెప్పుచున్నాడు:—

నీవు ఇపుడు చూచినట్టి నా రూపమును దర్శించుట కడు దుర్లభము. దేవతలు సైతము నా ఈ రూపమును జూచుటకు తపించుచుందురు.

53 నాహం వేదైర్న తపసా న దానేన న చేజ్యయా ।
శక్య ఏవంవిధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా ॥

నీవు దర్శించిన రూపము వేదాధ్యయనము చేసిగాని, తపసు చేసిగాని, దానములవలనగాని, యజ్ఞములు చేసిగాని దర్శించుటకు శక్యముకానిది.

54 భక్త్యా త్వనన్యయా శక్య అహమేవంవిధోఽర్జున।
జ్ఞాతుం ద్రష్టుఞ్చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప॥

ఓ అర్జునా! పరంతపా! నన్ను గురించిన ఇట్టి జ్ఞానము ఇట్టి నా రూప దర్శనము యదార్థముగా నన్ను పొందుట నా యందు లీనమగుటయే యగుచున్నది. ఇది కేవలము అనన్య భక్తివలన మాత్రమే సంభవమగును.

55 మత్కర్మకృన్మత్పరమో మద్భక్తః సంగవర్జితః।
నిర్వైరః సర్వభూతేషు యః సమామేతి పాండవ॥

ఓ అర్జునా! ఎవడు కర్మలన్నిటినీ నాకొరకై చేయునో నా యందు ఆసక్తుడై నా భక్తుడై సంగరహితుడై ప్రాణి కోటియందు ద్వేషరహితుడై యుండునో వాడే నన్ను పొందుచున్నాడు.

ఈ విధముగా ఉపనిషదర్థ ప్రతిపాదకమును
బ్రహ్మ విద్యా విషయిక యోగశాస్త్రమును
శ్రీకృష్ణార్జున సంవాదమును అగు
భగవద్గీతలోని విశ్వరూప సందర్శనయోగమను
పదకొండవ అధ్యాయము సమాప్తము.

# పన్నెండవ అధ్యాయము

## భక్తియోగము

పరమాత్ముని దర్శనము అనన్య భక్తివలననే కలుగు నని శ్రీకృష్ణ భగవానుడు నుడివియున్నాడు. కనుక ఇపుడు భక్తి స్వరూప మెట్టిదో తెలియవలసి యున్నది. ఈ అధ్యాయమున అది సమకూడినది. కావున ఈ అధ్యాయము అందరూ కంఠస్థము చేయదగియున్నది. ఇది అన్నిటికన్న చిన్న అధ్యాయము. ఇందు తెల్పిన భక్తుని లక్షణములు నిరంతరము మననము చేయదగియున్నవి.

**అర్జున ఉవాచ :—**

1 ఏవం సతతయుక్తా యే భక్తాస్త్వాం పర్యుపాసతే ।
యే చాప్యక్షరమవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః ॥

అర్జునుడు ప్రశ్నించుచున్నాడు:—

నిరంతరమూ నిశ్చే ధ్యానించుచూ నిన్ను ఉపాసించు భక్తులందును, నాశరహితమగు నీ అవ్యక్త స్వరూపమును ధ్యానించువారి యందునూ శ్రేష్ఠుడైన యోగి ఎవరు?

**శ్రీ భగవానువాచ :—**

2 మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే ।
శ్రద్ధయా పరయోపేతాస్తే మే యుక్తతమా మతాః ॥

23)

శ్రీకృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు:—

నిత్యము నన్నే ధ్యానించుచూ నాయందు మనసు లగ్నముచేసి శ్రద్ధతో నన్ను ఉపాసించువానిని శ్రేష్ఠుడని నేను భావించుచున్నాను.

3 యే త్వక్షరమనిర్దేశ్యమవ్యక్తం పర్యుపాస్యతే ।
సర్వత్రగమచింత్యం చ కూటస్థమచలం ధ్రువమ్ ॥
4 సంనియమ్యేంద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః ।
తే ప్రాప్నువంతి మామేవ సర్వభూతహితే రతాః ॥

ఇంద్రియములను నిగ్రహించి అందరిని సమదృష్టితో చూచుచూ దృఢమును, స్థిరమును, గంభీరమును, అచింత్యమును, సర్వవ్యాపియగు అవ్యక్త, వర్ణనాతీతుడగు నాశరహిత స్వరూపమును ఉపాసించువారు సర్వభూతహిత రతుడైన నన్నే పొందుదురు.

5 క్లేశోఽధికతరస్తేషామవ్యక్తాసక్తచేతసామ్ ।
అవ్యక్తా హి గతిర్దుఃఖం దేహవద్భిరవాప్యతే ॥

అవ్యక్త పరమాత్మయందు చిత్తము లగ్నము చేయుటకష్టము. నిర్గుణోపాసన దేహధారులకు కష్టసాధ్యము.

వ్యాఖ్య : దేహధారి నిర్గుణ స్వరూపమును కేవలము తన భావనా బలముచే కల్పన చేయుగలడు. కాని అట్టి నిర్గుణ స్వరూపమును వర్ణించుటకు తగిన శబ్దజాలమే

లేదు. అందువలన ఆ నిర్గుణ పరమాత్మను "నేతి, నేతి" అనగా 'న ఇతి' 'ఇది కాదు, ఇది కాదు' అని మాత్రమే అనుకొని తృప్తిపడవలసి వచ్చినది. కనుక విగ్రహారాధనను వ్యతిరేకించువారు కూడ సూక్ష్మముగా ఆలోచించి చూచినచో విగ్రహారాధకులే యగుచున్నారు. గ్రంథమును పూజించుట; చర్చి, మసీదు, మందిరములలో పూజా ప్రార్థనలు చేయుట లేక ఒకే దిశకు అభిముఖులై ఆరాధించుట మొదలగునవన్నియు సగుణాకార పూజా లక్షణములే యగుచున్నవి. అయినప్పటికినీ సగుణ స్వరూపమునకు అతీతమై ఊహించనలవి కాని నిరాకార నిర్గుణ స్వరూపము ఒకటి ఉన్నదని గమనించినచో మనము తరించెదము. భక్తుడు పరమాత్మ యందు తాదాత్మ్యము చెంది లీనుడై పోవలయును. తుదకు అద్వితీయుడు నిరాకార నిర్గుణ స్వరూపుడగు భగవంతుడు మాత్రమే మిగులును. ఇదియే భక్తియొక్క పరాకాష్ఠస్థితి. ఇట్టి స్థితిని సగుణోపాసన ద్వారా సులభముగా పొందవచ్చును. కనుకనే నిర్గుణోపాసనా మార్గము కష్ట సాధ్యమని చెప్పబడినది.

6 యే తు సర్వాణి కర్మాణి మయి సంన్యస్య మత్పరాః।
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయంత ఉపాసతే॥
7 తేషామహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్।
భవామి న చిరాత్పార్థ మయ్యావేశితచేతసామ్॥

ఓ పార్థా! నా యందు ఆసక్తి కలవారై సమస్త కర్మలను నాకే అర్పించి ఏకనిష్ఠతో నన్ను ధ్యానించుచూ నన్నే ఉపాసించుచు నాయందే చిత్తము లగ్నము చేసినట్టి వారిని మృత్యువనెడి సంసారసాగరము నుండి నేను ఉద్ధరించుచున్నాను.

8 మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ।
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః॥

మనసును నాయందే లగ్నముచేసి బుద్ధిని నాయందే ఉంచుము. అటు పిమ్మట నిస్సందేహముగా నీవు నన్నే పొందెదవు.

9 అథ చిత్తం సమాధాతుం న శక్నోషి మయి స్థిరమ్।
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనంజయ॥

ఇంకనూ నీవు చిత్తమును నాయందు నిలుకడగా నిలుపజాలని యెడల అభ్యాసయోగముచేత నన్ను పొందుటకు ప్రయత్నించుము.

10 అభ్యాసేఽప్యసమర్థోఽసి మత్కర్మపరమో భవ।
మదర్థమపి కర్మాణి కుర్వన్సిద్ధిమవాప్స్యసి।

ఇట్టి అభ్యాసము కూడా నీకు సాధ్యము కాదేని నీవు చేయు కర్మలన్నియు నాకు అర్పించుము. నా కొరకై కర్మలాచరించుచూ కూడా నీవు మోక్షమును పొందెదవు.

11 అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగమాశ్రితః।
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్॥

నా నిమిత్తము కర్మాచరణ చేయుశక్తి కూడా లేనిచో ప్రయత్నించి సర్వ కర్మలయొక్క ఫలితమును త్యజించుము.

12 శ్రేయో హి జ్ఞానమభ్యాసాత్ జ్ఞానాద్ధ్యానం విశిష్యతే।
ధ్యానాత్కర్మఫల త్యాగస్త్యాగాచ్ఛాంతిరనంతరమ్॥

అభ్యాస మార్గముకంటె జ్ఞానమార్గము శ్రేయస్కరమైనది. జ్ఞానమార్గము కంటెను ధ్యానమార్గము ప్రయోజన కరమైనది. ధ్యానమార్గముకంటె కర్మఫల త్యాగము సులభము. ఏలనన ఈ త్యాగానంతరము వెను వెంటనే శాంతి లభించును.

వ్యాఖ్య : అభ్యాసమనగా చిత్తవృత్తులను నిరోధించుసాధన. జ్ఞానమనగా — శ్రవణము, మననము మొదలైనవి. ధ్యానమనగా ఉపాసన. వీటి ఫలితముగా కర్మఫల త్యాగము సిద్ధించనిచో అట్టి అభ్యాసము అభ్యాసమే కాదు. ఆజ్ఞానము జ్ఞానమే కాదు. ధ్యానము ధ్యానమే కాదు.

13 అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవ చ।
నిర్మమో నిరహంకారః సమదుఃఖసుఖః క్షమీ॥

14 సంతుష్టః సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః।
మయ్యర్పితమనో బుద్ధిర్యో మద్భక్తః స మే ప్రియః॥

సర్వభూతముల యందును ద్వేషము లేకుండా, అందరికీ మిత్రుడై, దయాళుడై, మమతా రహితుడై, అహంకారము లేనివాడై, సుఖ దుఃఖములయందు సమానుడై, క్షమా శీలుడై, సదా సంతుష్టుడై, యోగ యుక్తుడై, ఇంద్రియ నిగ్రహము కలవాడై, దృఢనిశ్చయము కలవాడై తన మనోబుద్ధులను నాయందు అర్పించినట్టి భక్తుడు నాకు ఇష్టుడు.

15 యస్మాన్నోద్విజతే లోకో లోకాన్నోద్విజతే చ యః।
హర్షామర్షభయోద్వేగైర్ముక్తో యః స చ మే ప్రియః॥

లోకమునకు తనవలననూ, లోకమువలన తనకునూ బాధలేనివాడు, సంతోషము, క్రోధము, భయము ఉద్వేగము లేనివాడునూ నాకు ఇష్టుడు.

16 అనపేక్షః శుచిర్దక్ష ఉదాసీనో గతవ్యథః।
సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తః స మే ప్రియః॥

కోరిక లేనివాడును, పవిత్రుడును, కార్యకుశలుడును, నిర్లిప్తుడును, విచారము లేనివాడును, సంకల్పమును త్యజించినట్టి వాడునూ నా భక్తుడు వాడు నాకు ఇష్టుడు.

17 యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి।
శుభాశుభ పరిత్యాగీ భక్తిమాన్ యః స మే ప్రియః॥

హర్ష-ద్వేషములు లేనివాడును, విచారము లేని వాడును, ఆశలు పెంచుకొనని వాడును, శుభా శుభ ఫలితములను త్యజించునట్టి భక్తి పరాయణుడును నాకు ఇష్టుడు.

18 సమః శత్రౌ చ మిత్రే చ తథా మానావమానయోః।
శీతోష్ణసుఖదుఃఖేషు సమః సంగవివర్జితః॥

19 తుల్యనిందాస్తుతిర్మౌనీ సంతుష్టో యేనకేనచిత్।
అనికేతః స్థిరమతిర్భక్తిమాన్మే ప్రియో నరః॥

శత్రు మిత్రులయందు, మానావమానములయందు, శీతోష్ణములయందు, సుఖ-దుఃఖములందు సమత్వము కలిగి ఆసక్తిని విడచి,నిందాస్తోత్రములను సమానముగా భావించి, మౌనము ధరించి, లభించిన దానితో సంతృప్తి చెంది, తన కొక నివాస స్థానము లేనట్టి స్థిరచిత్తుడైన మానభక్తుడు నాకు ప్రియమైనవాడు.

20 యే తు ధర్మ్యామృతమిదం యథోక్తం పర్యుపాసతే।
శ్రద్దధానా మత్పరమా భక్తాస్తేఽతీవ మే ప్రియాః॥

ఈ పవిత్రమైన అమృత మయమగు జ్ఞానమును నాయందు పరాయణులై శ్రద్ధతో అనుష్ఠించువారు నాకు అత్యంత ప్రీతి పాత్రులగు భక్తులు.

ఈ విధముగా ఉపనిషదర్థ ప్రతిపాదకము బ్రహ్మ
విద్యా విషయిక యోగశాస్త్రమును శ్రీకృష్ణా
ర్జున సంవాదమును అగు భగవద్గీత
లోని భక్తియోగమను
పన్నెండవ అధ్యాయము
సమాప్తము

ఓం తత్సత్

# పదమూడవ అధ్యాయము

## క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగయోగము

ఈ అధ్యాయములో దేహము, దేహధారి (ఆత్మ) యొక్క భేదము తెలుపబడినది.

శ్రీ భగవానువాచ :

1 ఇదం శరీరం కౌంతేయ క్షేత్రమిత్యభిధీయతే ।
ఏతద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః ॥

శ్రీకృష్ణ పరమాత్మ చెప్పుచున్నాడు:—

ఓ అర్జునా! ఈ శరీరమే క్షేత్రము అనబడుచున్నది. దీనిని యెరిగిన వానిని తత్త్వజ్ఞానులు క్షేత్రజ్ఞుడందురు.

2 క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత ।
క్షేత్రక్షేత్రజ్ఞయోర్ జ్ఞానం యత్తత్ జ్ఞానం మతం మమ ॥

ఓ భారతా! క్షేత్రము (శరీరము) లన్నిటియందు ఉన్నట్టి నన్ను క్షేత్రజ్ఞునిగా తెలిసికొనుము. ఈ క్షేత్ర, క్షేత్రజ్ఞుల భేదమును తెలిసికొనుటయే నిజమైన జ్ఞానమని నా అభిమతము.

3 తత్ క్షేత్రం యచ్చ యాదృక్ చ యద్వికారి యతశ్చ యత్ ।
స చ యో యత్ప్రభావశ్చ తత్సమాసేన మే శృణు ॥

అర్జునా! క్షేత్రమనగా ఏమి? అది ఎటువంటిది? ఎట్టి వికారములు కలిగియుండును? ఎక్కడినుండి వచ్చినది? క్షేత్రజ్ఞుడెవరు? అతని ప్రభావము ఎట్టిది? ఈ విషయము లను క్లుప్తముగా చెప్పెదను, శ్రద్ధగా వినుము.

4 ఋషిభిర్బహుధా గీతం ఛందోభిర్వివిధైః పృథక్।
బ్రహ్మసూత్రపదైశ్చైవ హేతుమద్భిర్వినిశ్చితైః॥

ఋషులు ఈ విషయములను వివిధ ఛందస్సులలో అనేక విధముల ఉదాహరణ సహితముగా నిర్దుష్టమైన బ్రహ్మ సూత్రములలో గానము చేసిరి.

5 మహాభూతాన్యహంకారో బుద్ధిరవ్యక్తమేవ చ।
ఇంద్రియాణి దశైకం చ పంచ చేంద్రియగోచరాః॥

6 ఇచ్ఛా ద్వేషః సుఖం దుఃఖం సంఘాతశ్చేతనా ధృతిః।
ఏతత్ క్షేత్రం సమాసేన సవికారముదాహృతమ్॥

పంచ మహాభూతములు, అహంకారము, బుద్ధి, ప్రకృతి, పది ఇంద్రియములు, మనస్సు, అయిదు ఇంద్రియ విషయములు, ఇచ్ఛ, ద్వేషము, సుఖము, దుఃఖము, సంఘాతము, చేతనాశక్తి, ధృతి అనునవి సంక్షేపముగా వికారములతో కూడిన శరీరమే క్షేత్రమని చెప్పబడినది.

వ్యాఖ్య : మహా భూతములు అయిదు - పృథివి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము. అహంకారమనగా శరీర సంబంధమగు 'నేను' అను భావము. అవ్యక్త

మనగా అదృశ్యముగా నుండెడి మాయ. పది ఇంద్రియములలో అయిదు జ్ఞానేంద్రియములు - ముక్కు, చెవి, కన్ను, నాలుక, చర్మము. అయిదు కర్మేంద్రియములు-కాలు, చేయి, నోరు, మర్మేంద్రియములు రెండు. జ్ఞానేంద్రియములకు సంబంధించిన అయిదు విషయములు-శబ్ద,స్పర్శ, రూప, రస, గంధములు, అనగా-వినుట, తాకుట, చూచుట, రుచి చూచుట, వాసన చూచుట. సంఘాతమనగా-శరీరతత్త్వములు పరస్పరము సహకరించుకొను శక్తి. ధృతి అనగా-మనము సాధారణముగా అనుకొను ధైర్య గుణము కాదు. ఈ శరీరమందలి పరమాణువులు ఒక దానినొకటి అంటిపెట్టుకొని ఉండు శక్తిని ధృతి యందురు. ఈ గుణము అహంభావము వలననే కలుగుచున్నది. ఈ 'అహము' అవ్యక్తమైన మాయలో ఉన్నది. ఇట్టి అహమును మోహరహితుడగు మనుష్యుడు తెలిసికొని దానిని త్యజించుచున్నాడు. అందుచే అట్టివాడు మృత్యు సమయమందును లేక ఇతర విఘాతములు సంభవించినప్పుడును దుఃఖమును పొందుటలేదు. జ్ఞానియును అజ్ఞానియును చివరకు అందరునూ వికారములతో కూడిన ఈ శరీరమును త్యజించవలసినదే.

7 అమానిత్వమదమ్భిత్వమహింసా క్షాంతిరార్జవమ్।
ఆచార్యోపాసనం శౌచం స్థైర్యమాత్మవినిగ్రహః॥
8 ఇంద్రియార్థేషు వైరాగ్యమనహంకార ఏవ చ।
జన్మమృత్యుజరావ్యాధి దుఃఖదోషానుదర్శనమ్॥
9 అసక్తిరనభిష్వంగః పుత్రదారగృహాదిషు।
నిత్యం చ సమచిత్తత్వమిష్టానిష్టోపపత్తిషు॥
10 మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ।
వివిక్త దేశ సేవిత్వమరతిర్జనసంసది॥
11 అధ్యాత్మజ్ఞాననిత్యత్వం తత్త్వజ్ఞానార్థదర్శనమ్।
ఏతత్ జ్ఞానమితి ప్రోక్తమజ్ఞానం యదతోఽన్యథా॥

దంభాభిమానములు లేకుండుట, అహింస, ఓర్పు, సరళ స్వభావము, గురుసేవ, శుచి, స్థిరత, ఆత్మనిగ్రహము ఇంద్రియ విషయములందు వైరాగ్యము, అహంకారము లేకుండుట, జన్మ మరణ జరావ్యాధి దుఃఖములు, ఇతర దోషముల విషయమున నిరంతర జాగరూకతకలిగియుండుట, పుత్ర కళత్ర గృహ విషయములందు మోహ మమకారములు లేకుండుట, ఇష్టానిష్టములయందు సమభావము కలిగియుండుట, నాయందు అచంచలమైన విశ్వాసముతో ధ్యానముతో కూడిన ఏకాగ్రభక్తి, ఏకాంతవాసము, జనసమూహములందు పాల్గొనుటయం దాసక్తి లేకుండుట, ఆధాత్మిక జ్ఞానముయొక్క నిత్యతను ఎరిగియుండుట, ఆత్మసాక్షాత్కారము-ఇవన్నియు జ్ఞాన మనబడును. ఇందుకు భిన్నమైనట్టిది అజ్ఞానము.

12 జ్ఞేయం యత్తత్ప్రవక్ష్యామి యత్ జ్ఞాత్వాఽమృతమశ్నుతే।
అనాదిమత్పరం బ్రహ్మం న సత్తన్నాసదుచ్యతే ॥

దేనిని తెలుసుకొనుటవలన మోక్షము కలుగునో, ఆదిలేని పరబ్రహ్మమేదో, ఏది సత్ అనిగాని అసత్ అని గాని చెప్పబడదో ఆ జ్ఞేయమును తెలిసికొనదగిన విషయమును గురించి చెప్పెదను.

వ్యాఖ్య : పరబ్రహ్మను సత్ అనిగాని అసత్ అనిగాని చెప్ప జాలము. దానిని శబ్దజాలముతో తెలియ పరచుట గాని విమర్శించుటగాని సాధ్యము కాదు. అది గుణాతీతమైనది.

13 సర్వతః పాణిపాదం తత్సర్వతోఽక్షిశిరోముఖమ్।
సర్వతఃశ్రుతిమల్లోకే సర్వమావృత్య తిష్ఠతి॥

ఎటుచూచినా కాళ్ళు, చేతులు, కన్నులు, తలలు, ముఖములు, చెవులూ కలిగి లోకమందు సర్వప్రదేశములందునూ అది వ్యాపించియున్నది.

14 సర్వేంద్రియగుణాభాసం సర్వేంద్రియ వివర్జితమ్।
అసక్తం సర్వభృచ్చైవ నిర్గుణం గుణభోక్తృ చ॥

ఇంద్రియ గుణములన్నియు అందు కనుపించినప్పటికినీ అది ఇంద్రియ రహితమైన బ్రహ్మస్వరూపము, నిర్లిప్తమై ఉండును. అయినను అదే అన్నిటికీ ఆధార భూతమై

యున్నది. గుణాతీతమైయుండియు గుణములను అనుభవించు భోక్త అదియే.

15 బహిరంతశ్చ భూతానామచరం చరమేవ చ।
సూక్ష్మత్వాత్తదవిజ్ఞేయం దూరస్థం చాంతికే చ తత్॥

అది భూతములలోపల వెలుపల కూడా ఉండును. అది స్థిరముగా నుండును. చలనముకూడా కలిగియుండును. సూక్ష్మముగా నుండుటగాన తెలిసికొనుటకు వీలుపడదు. అది సమీపమున ఉండును, దూరముగానూ ఉండును.

వ్యాఖ్య : దానిని తెలిసికొన్న వానికి అది లోపలనే ఉండును. స్థిరత్వము, అస్థిరత, శాంతి-అశాంతి మన అనుభవములోనివే. ఈ భావములన్నియు దానినుండే ఉత్పన్నమగుచున్నవి కనుక అది స్థిరమైనది. చలనము కలిగినది కూడ అయియున్నది.

16 అవిభక్తం చ భూతేషు విభక్తమివ చ స్థితమ్।
భూతభర్తృ చ తజ్జ్ఞేయం గ్రసిష్ణు ప్రభవిష్ణు చ॥

అది అఖండమైనది. అయినను వివిధ రూపములలో విభక్తమైయున్నటుల కనుపించును. అది తెలుసుకొనదగిన వస్తువు. (బ్రహ్మ) ప్రాణులను సృష్టించి, పోషించి, నశింపచేయుచున్నది.

17 జ్యోతిషామపి తజ్జ్యోతి స్తమసః పరముచ్యతే।
జ్ఞానం జ్ఞేయం జ్ఞానగమ్యం హృది సర్వస్య విష్ఠితమ్॥

అది జ్యోతులకు పరంజ్యోతి. అంధకారమునకు అది అతీతమైనదని చెప్పబడుచున్నది. జ్ఞానము అదియే. జ్ఞానగమ్యమున్నూ అదియే. జ్ఞానమువలన లభించునదియుకూడ అదియే. అది అందరి హృదయములలో నుండునది.

18 ఇతి క్షేత్రం తథా జ్ఞానం జ్ఞేయం చోక్తం సమాసతః।
మద్భక్త ఏతద్విజ్ఞాయ మద్భావాయోపపద్యతే॥

ఇట్లు - క్షేత్రము, జ్ఞానము, జ్ఞేయములను గూర్చి నీకు సంగ్రహముగా చెప్పితిని. దీని నెరిగిన నా భక్తుడు నా భావమును పొందుటకు అర్హుడగుచున్నాడు.

19 ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి।
వికారాంశ్చ గుణాంశ్చైవ విద్ధి ప్రకృతిసమ్భవాన్॥

ప్రకృతి - పురుషుడు - వీటి ఆదియనునవి లేనివిగా తెలిసికొనుము. వికారగుణములు ప్రకృతి నుండియే ఉత్పన్నమగుచున్నవని తెలిసికొనుము.

20 కార్యకారణకర్తృత్వే హేతుః ప్రకృతిరుచ్యతే।
పురుషఃసుఖదుఃఖానాం భోక్తృత్వే హేతురుచ్యతే॥

కార్య కారణముల హేతువు ప్రకృతియనియు, సుఖదుఃఖానుభవములకు హేతువు పురుషుడనియు చెప్పబడుచున్నది.

21 పురుషః ప్రకృతిస్థో హి భుంక్తే ప్రకృతిజాన్గుణాన్।
కారణం గుణసంగోఽస్య సదసద్యోనిజన్మసు॥

ప్రకృతిలో నుండు పురుషుడు ప్రకృతి జన్యములైన గుణముల ననుభవించును. ఈ గుణ సంపర్కమే సుకృత దుష్కృతములైన యోనులందు (గర్భమునందు) వాని పుట్టుకకు కారణమగుచున్నది.

వ్యాఖ్య : ప్రకృతిని మనము లౌకిక భాషలో 'మాయ' యని వ్యవహరించుచున్నాము. పురుషుడు జీవుడు మాయ అనగా మూల స్వభావమునకు వశుడైన జీవుడు సత్వ రజస్తమోగుణ కార్యముల ఫలమును అనుభవించుచున్నాడు. ఇందువలన తను చేసిన కర్మను అనుసరించి పునర్జన్మ పొందుచున్నాడు

22 ఉపద్రష్టానుమంతా చ భర్తా భోక్తా మహేశ్వరః।
పరమాత్మేతి చాప్యుక్తో దేహేఽస్మిన్పురుషః పరః॥

ఈ దేహమందున్న పరమ పురుషుని సర్వసాక్షి యని, అనుజ్ఞ ఇచ్చువాడని, భర్త, భోక్త, మహేశ్వరుడు, పరమాత్ముడని పిలువబడుచున్నాడు.

23 య ఏవం వేత్తి పురుషం ప్రకృతిం చ గుణైః సహ।
సర్వథా వర్తమానోఽపి న స భూయోఽభిజాయతే॥

ఈ విధముగా ఎవడు గుణయుత మగు ప్రకృతిని, పురుషుని తెలిసికొనునో వాడు సకల కర్మలను చేయుచుండియు పునర్జన్మను పొందడు అనగా మోక్షమును పొందును.

వ్యాఖ్య : 2,9,12 మరియు ఇతర అధ్యాయముల ఆధారముతో ఈ శ్లోకము స్వేచ్ఛాచారమును ప్రోత్సహించుట లేదని తెలిసికొనగలము. ఇది భక్తియొక్క మహిమను చాటుచున్నది. ఏ కర్మ అయినా జీవునకు బంధహేతువే యగును. కాని సర్వ కర్మలను ఆ పరమాత్మునికి అర్పించినచో బంధవిముక్తి కలుగుచున్నది. ఈ విధముగా ఎవనిలో "నేనే కర్త" అను అహంభావము నశించునో, ఎవడు సర్వకాలములందునూ అంతర్యామియగు పరమాత్మను గుర్తించుచుండునో అట్టివాడు పాపకార్యములను ఆచరింపజాలడు. అహంభావమే పాపమునకు మూలము. 'నేనే' యను అహంకారము లేనపుడు పాపమే కలుగదు. ఈ శ్లోకము పాపకర్మలను చేయకుండుటకు మాత్రమే ఉపాయము చూపుచున్నది.

24 ధ్యానేనాత్మని పశ్యంతి కేచిదాత్మానమాత్మనా।
అన్యే సాంఖ్యేన యోగేన కర్మయోగేన చాపరే॥

కొందరు ధ్యానముచే ఆత్మద్వారా ఆత్మను తమ యందే దర్శించెదరు. కొందరు జ్ఞాన మార్గముచే, మరి కొందరు కర్మయోగముచే ఆత్మను దర్శించెదరు.

25 అన్యే త్వేవమజానంతః శ్రుత్వాన్యేభ్య ఉపాసతే।
తేఽపి చాతితరంత్యేవ మృత్యుం శ్రుతిపరాయణాః॥
25)

ఈ మర్గములేవీ తెలియని మరికొందరు ఇతరుల ద్వారా పరమాత్మను గురించి విని, ఆ వినినదానియందు శ్రద్ధకలిగి అందే ఆసక్తులై ఉపాసించుచున్నారు. వారు కూడా మోక్షమును పొందుదురు.

26 యావత్సంజాయతే కించిత్సత్త్వం స్థావరజంగమమ్।
క్షేత్రక్షేత్రజ్ఞసంయోగాత్తద్విద్ధి భరతర్షభ ॥

అర్జునా! ఈ చరాచర సృష్టి అంతయూ క్షేత్ర క్షేత్రజ్ఞుల - అనగా-ప్రకృతి-పురుషుల సంయోగమువలన ఉత్పన్నమగుచున్నదని ఎరుగుము.

27 సమం సర్వేషు భూతేషు తిష్ఠంతం పరమేశ్వరం।
వినశ్యత్స్వవినశ్యంతం యః పశ్యతి స పశ్యతి॥

సమస్త నశ్వర ప్రాణులయందు అవినాశియగు పరమేశ్వరుడు సమభావముతో వెలుగొందియున్నాడని తెలిసినవాడే నిజముగా పరమాత్మను ఎరిగినవాడు.

28 సమం పశ్యన్ హి సర్వత్ర సమవస్థితమీశ్వరమ్।
న హినస్త్యాత్మనాత్మానం తతో యాతి పరాం గతిమ్॥

ఈశ్వరుడు సర్వత్ర సమభావముతో మెలగియుండుటను దర్శించువాడు ఆత్మఘాతము చేసుకొనక పరమపదమును పొందుచున్నాడు.

వ్యాఖ్య : సమభావముతో వెలుగొందియున్న ఈశ్వరుని

చూచువాడు పరమాత్మలో లీనమేయగును, ఇతర మేమియును చూడడు. అందువలన వాడు వికార గ్రస్తుడు గాక మోక్షమును పొందును. తనకు తాను శత్రువు కాజాలడు. అనగా ఆత్మను విస్మరించలేడు.

29 ప్రకృత్యైవ చ కర్మాణి క్రియమాణాని సర్వశః।
యః పశ్యతి తథాత్మానమకర్తారం స పశ్యతి॥

ప్రకృతియే సర్వకర్మలను చేయుచున్నదని ఎరిగిన వాడు ఆత్మను అకర్తగా అనగా - తాను ఏమీ చేయుట లేదని గమనించును. వాడే ఈశ్వరుని నిజముగా దర్శించిన వాడగును.

**వ్యాఖ్య :** అది ఎట్లనగా నిద్రించు మనుష్యునియొక్క ఆత్మ నిద్రకు కర్తకాదు. ప్రకృతియే నిద్రయను కర్మను చేయుచున్నది. నిర్వికారుడగు మనుష్యుని కన్నులు చెడును చూడలేవు. ప్రకృతి స్వేచ్ఛాచారిణి కాదు. పురుషుడు అహంభావముతో యజమానిగా ప్రకృతి సాంగత్యము చెందినపుడు విషయ వికారములు కలుగుచున్నవి.

30 యదా భూత పృథగ్భావ మేకస్థమనుపశ్యతి।
తత ఏవ చ విస్తారం బ్రహ్మ సమ్పద్యతే తదా॥

జీవులకు ప్రత్యేకముగా అస్తిత్వము (ఉనికి) కలిగి వున్నప్పటికినీ సర్వజగత్తును ఆ పరమాత్మనుండియే ఉద్భ

వించినదని ఎవడు తెలిసికొనునో వాడు బ్రహ్మ పదమును పొందును.

వ్యాఖ్య : బ్రహ్మపదమును పొందుటయనగా స్వానుభవముతో సర్వమును బ్రహ్మయందే చూచుట. అప్పుడు జీవుడు పరబ్రహ్మకంటే వేరుగా వుండజాలడు.

31 అనాదిత్వాన్నిర్గుణ త్వాత్పరమాత్మాయమవ్యయః।
శరీరస్థోఽపి కౌంతేయ న కరోతి న లిప్యతే॥

ఓ అర్జునా! నాశరహితుడగు పరమాత్మ అనాది, నిర్గుణుడు అయినందువలన శరీరమునందువుండియూ కూడా ఏమీ చేయడు. నిర్లిప్తుడై వుండును.

32 యథా సర్వగతం సౌక్ష్మ్యదాకాశం నోపలిప్యతే।
సర్వత్రావస్థితో దేహే తథాత్మా నోపలిప్య తే।

సర్వత్రా వ్యాపించియున్న ఆకాశము తన సూక్ష్మ స్వభావమువలన దేనిని కూడా అంటుకొని యుండదు. అటులనే శరీర మందంతటనూ వ్యాపించియున్న ఆత్మ ఎటువంటి మాలిన్యమునూ పొందక నిర్లిప్తమై యుండును.

33 యథా ప్రకాశయత్యేకః కృత్స్నం లోకమిమం రవిః।
క్షేత్రం క్షేత్రీ తథా కృత్స్నం ప్రకాశయతి భారత॥

ఒకే సూర్యుడు జగత్తునందంతటను ప్రకాశించునట్లు అర్జునా! క్షేత్రజ్ఞుడు క్షేత్రములన్నిటినీ ప్రకాశింపజేయు చున్నాడు.

34 క్షేత్రక్షేత్రజ్ఞ యో రేవమంతరం జ్ఞానచక్షుషా।
భూతప్రకృతిమోక్షం చ యే విదుర్యాంతి తే పరమ్॥

ఎవడు జ్ఞాన నేత్రములద్వారా క్షేత్ర క్షేత్రజ్ఞుల భేదమును మరియు ప్రకృతి బంధనముల నుండి జీవులు ముక్తి పొందు విధమును తెలిసికొనునో వాడు పరబ్రహ్మ మును పొందును.

ఈ విధముగా ఉపనిషదర్థ ప్రతిపాదకము బ్రహ్మ
విద్యా విషయిక యోగశాస్త్రమును శ్రీకృష్ణా
ర్జున సంవాదమును అగు భగవద్గీత
లోని క్షేత్ర క్షేత్రజ్ఞ విభాగ యోగమను
పదమూడవ అధ్యాయము
సమాప్తము

ఓం తత్సత్

# పదునాల్గవ అధ్యాయము
## గుణత్రయ విభాగయోగము

క్రిందటి అధ్యాయములో గుణములతో కూడిన ప్రకృతిని పరిచయము చేసిన పిదప ఈ అధ్యాయములో త్రిగుణములను గురించి చెప్పుట తగియున్నది. త్రిగుణములను గురించి చెప్పుచూ భగవానుడు గుణాతీతుని లక్షణములను వర్ణించుచున్నాడు. రెండవ అధ్యాయములో చెప్పబడిన స్థితప్రజ్ఞుని లక్షణములే గుణాతీతుని లక్షణములుగా చెప్పబడినవి.

శ్రీ భగవానువాచ :—

1 పరం భూయః ప్రవక్ష్యామి జ్ఞానానాం జ్ఞానముత్తమమ్।
యజ్జ్ఞాత్వాయునయః సర్వే పరాం సిద్ధిమితో గతాః।

శ్రీకృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు:—

జ్ఞానములన్నిటిలోనూ ఏ ఉత్తమమైన జ్ఞానమును అనుభవపూర్వకముగా తెలిసికొని మునీశ్వరులు శరీరమును త్యజించిన పిదప పరమగతిని పొందిరో అట్టి జ్ఞానమును మరల నీకు చెప్పుచున్నాను.

2 ఇదం జ్ఞానముపాశ్రిత్య మమ సాధర్మ్యమాగతాః।
సర్గేఽపి నోపజాయంతే ప్రళయే న వ్యథంతి చ॥

ఈ జ్ఞానమును ఆశ్రయించి నా సాధర్మ్యమును పొందినవారికి సృష్టి సమయమందు జన్మించవలసినఅవసరము గాని ప్రళయకాలమందు దుఃఖమును చెందవలసిన అవసరముగాని కలుగదు.

3 మమ యోనిర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్।
సంభవః సర్వభూతానాం తతో భవతి భారత॥

ఓ అర్జునా!మహద్ బ్రహ్మ అనగా-ప్రకృతినాయోని. అందు నేను గర్భమును ధరింపజేయుచున్నాను. దానివలన జీవరాశి ఉత్పన్నమగుచున్నది.

4 సర్వయోనిషు కౌంతేయ మూర్తయః సంభవంతి యాః।
తాసాం బ్రహ్మ మహద్యోని రహం బీజప్రదః పితా॥

సర్వయోనులందు ఏ యే ప్రాణులు ఉత్పత్తియగుచున్నవో వాటి ఉత్పత్తి స్థానము నా ప్రకృతి. అందు బీజారోపణ చేయు పురుషుడు అనగా- తండ్రిని నేనే.

5 సత్త్వం రజస్తమ ఇతి గుణాః ప్రకృతిసంభవాః।
నిబధ్నంతి మహాబాహో దేహే దేహినమవ్యయమ్॥

ఓ అర్జునా! ప్రకృతి సంభవములైన సత్వరజస్తమో గుణములు నిత్యమైన ఆత్మను దేహమునందు బంధించుచున్నవి.

6 తత్ర సత్త్వం నిర్మలత్వాత్ప్రకాశకమనామయమ్।
సుఖసంగేన బధ్నాతి జ్ఞానసంగేన చానఘ॥

వీనిలో సత్వగుణము నిర్మలమైనదగుటచే ప్రకాశవంతమైనది; నిరుపద్రవమైనది. అది ఆత్మను సుఖాభిలాష చేతను జ్ఞానాభిలాష చేతను బంధించుచున్నది.

7 రజో రాగాత్మకం విద్ధి తృష్ణాసంగసముద్భవమ్।
తన్నిబధ్నాతి కౌంతేయ కర్మసంగేన దేహినమ్॥

అర్జునా! రజోగుణము రాగాత్మకమైనదగుటచే అది తృష్ణకును ఆసక్తికిని మూలమగుచున్నది. అది ఆత్మను కర్మపాశములచే బంధించుచున్నది.

8 తమస్త్వజ్ఞానజం విద్ధి మోహనం సర్వదేహినామ్।
ప్రమాదాలస్యనిద్రాభి స్తన్నిబధ్నాతి భారత॥

అర్జునా! తమోగుణము అజ్ఞాన మూలమైనది. అది దేహధారులందరినీ మోహములో పడద్రోయుచున్నది. అది అజాగరూకత, సోమరితనము, నిద్రయనెడి పాశములచే దేహిని బంధించుచున్నది.

9 సత్త్వం సుఖే సంజయతి రజః కర్మణి భారత।
జ్ఞానమావృత్య తు తమః ప్రమాదే సంజ యత్యుత।

అర్జునా! సత్వగుణము ఆత్మను శాంతి సుఖములను కలుగజేయుచున్నది. అటులనే రజోగుణము కర్మసాంగత్య

మును, తమోగుణము జ్ఞానమును మరుగుపరచి ప్రమాదము లకును దారి తీయుచున్నది.

10 రజస్తమశ్చాభిభూయ సత్త్వం భవతి భారత।
రజః సత్త్వం తమశ్చైవ తమః సత్త్వం రజస్తథా॥

అర్జునా! రజోగుణము తమోగుణములు అణగి యున్నపుడు సత్వగుణము ప్రబలమగును. అట్లనే సత్వతమోగుణములు, సత్వరజోగుణములు మందగించి నపుడు తమోగుణమును ప్రబలును.

11 సర్వద్వారేషు దేహేఽస్మిన్ప్రకాశ ఉపజాయతే।
జ్ఞానం యదా తదా విద్యాద్వివృద్ధం సత్త్వమిత్యుత॥

సర్వ ఇంద్రియముల ద్వారా ఈ దేహములో ప్రకాశము జ్ఞానము ఉద్భవించినపుడు సత్వగుణము వృద్ధి చెందినదని గ్రహింపవలెను.

12 లోభః ప్రవృత్తిరారంభః కర్మణామశమః స్పృహా।
రజస్యేతాని జాయంతే వివృద్ధే భరతర్షభ॥

ఓ భారతా! రజోగుణము వృద్ధి చెందినపుడు లోభము, వ్యాపకము, కర్మారంభము, అశాంతి, కోరికలు కలుగు చున్నవి.

13 అప్రకాశోఽప్రవృత్తిశ్చ ప్రమాదో మోహ ఏవ చ।
తమస్యేతాని జాయంతే వివృద్ధే కురునందన॥

ఓ కురునందనా! తమోగుణము వృద్ధిచెందినపుడు అజ్ఞానము, మందబుద్ధి, ప్రమాదము, మోహము కలుగుచున్నవి.

14 యదా సత్త్వే ప్రవృద్ధే తు ప్రళయం యాతి దేహభృత్।
తదోత్తమవిదాం లోకానమలాన్ప్రతిపద్యతే॥

సత్వగుణము వృద్ధిసందినపుడు జీవుడు శరీరమును విడచిన ఎడల ఉత్తము జ్ఞానులు పొందెడి పుణ్యలోకములను పొందును.

15 రజసి ప్రళయం గత్వా కర్మసంగిషు జాయతే।
తథా ప్రలీనస్తమసి మూఢయోనిషు జాయతే॥

రజోగుణముతో మరణించినవాడు కర్మానురక్తుల లోకములో జన్మించుచున్నాడు. తమోగుణముచే మరణించినవాడు మూఢ ప్రాణులయందు జన్మించుచున్నాడు.

వ్యాఖ్య : కర్మానురక్తిగల లోకమనగా మనుష్యలోకమనియు, మూఢ ప్రాణులనగా పశు పక్ష్యాదుల లోకమనియు అర్థము.

16 కర్మణః సుకృతస్యాహుః సాత్త్వికం నిర్మలం ఫలమ్।
రజసస్తు ఫలం దుఃఖమజ్ఞానం తమసః ఫలమ్॥

సత్కర్మ ఫలితము సాత్త్వికమై నిర్మలమై యుండును. రాజసీ కర్మ ఫలితము దుఃఖమును, తామస కర్మ ఫలము అజ్ఞానమును కలుగజేయు చుండును.

వ్యాఖ్య : సాధారణముగా మనము భావించెడి సుఖదుఃఖ ములను గురించి ఇచట ప్రస్తావించలేదని గ్రహించ వలెను. సుఖమనగా ఆత్మానందము, ఆత్మ జ్ఞానము. ఇందుకు భిన్నమైన దంతయూ దుఃఖమే. 17 వ శ్లోకములో ఇది ఇంకనూ స్పష్టపరచ బడినది.

17 సత్త్వాత్సంజాయతే జ్ఞానం రజసో లోభ ఏవ చ।
ప్రమాదమోహౌ తమసో భవతోఽజ్ఞానమేవ చ॥

సత్వగుణమువలన జ్ఞానము కలుగుచున్నది. రజో గుణమువలన లోభము, తమోగుణముచే ప్రమాదము, మోహము అజ్ఞానములు ఉత్పన్న మగుచున్నవి.

18 ఊర్ధ్వం గచ్ఛంతి సత్త్వస్థా మధ్యే తిష్ఠంతి రాజసాః।
జఘన్యగుణవృత్తిస్థా అధో గచ్ఛంతి తామసాః॥

సత్వగుణము కలవారు ఉత్తమ స్థితిని, రాజసగుణము కలవారు మధ్యమ స్థితిని, తామసగుణము కలవారు అధో గతిని పొందుదురు

19 నాన్యం గుణేభ్యః కర్తారం యదా ద్రష్టానుపశ్యతి।
గుణేభ్యశ్చ పరం వేత్తి మద్భావం సోఽధిగచ్ఛతి॥

ప్రకృతి గుణములచేతనే కర్మలాచరింపబడుచున్న వనియు వాటికి వేరొక కర్త లేడనియు గ్రహించిన జ్ఞాని గుణాతీతుడనగు నన్ను తెలిసికొని నా భావమును పొందు చున్నాడు.

వ్యాఖ్య : ప్రకృతి గుణములనే కర్తగా భావించిన వానికి అహంకారము ఉండదు. అందువలన అతడు చేయు కర్మలన్నియు స్వాభావికములై దేహయాత్రకు ప్రయోజనకరములగుచున్నవి. పరమార్థము కొరకే జీవయాత్ర నలుపువాని కర్మలన్నియు సర్వదా త్యాగ వైరాగ్యములు కూడియుండవలెను. అట్టి జ్ఞాని గుణాతీతుడైన నిర్గుణబ్రహ్మను కల్పించుకొని వానినే ధ్యానించును.

20 గుణానేతానతీత్య త్రీన్ దేహీ దేహసముద్భవాన్।
జన్మమృత్యుజరాదుఃఖైర్విముక్తోఽమృతమశ్నుతే॥

దేహసాంగత్యమువలన కలిగిన ఈ మూడు గుణములను అతిక్రమించిన దేహధారి జన్మ మృత్యు జరా దుఃఖముల నుండి విముక్తుడై మోక్షమును పొందును.

అర్జున ఉవాచ :—

21 కైర్లింగైస్త్రీన్ గుణానేతానతీతో భవతి ప్రభో।
కిమాచారః కథం చైతాంస్త్రీన్ గుణానతివర్తతే॥

అర్జునుడు ప్రశ్నించుచున్నాడు :—

ప్రభూ! ఈ గుణాతీతుడు ఎట్టి లక్షణములు కలిగి యుండును? వాని ప్రవర్తన ఎట్లుండును? గుణాతీతుడగుటకు మార్గమేది?

శ్రీ భగవానువాచ :—

22 ప్రకాశం చ ప్రవృత్తిం చ మోహమేవ చ పాండవ।
న ద్వేష్టి సంప్రవృత్తాని న నివృత్తాని కాంక్షతి॥

22 ఉదాసినవదాసీనో గుణైర్యో న విచాల్యతే।
గుణా వర్తంత ఇత్యేవ యోఽవతిష్ఠతి నేంగతే॥

23 సమదుఃఖసుఖః స్వస్థః సమలోష్టాశ్మకాంచనః।
తుల్యప్రియాప్రియో ధీరస్తుల్యనిందాత్మసంస్తుతిః॥

25 మానావమానయోస్తుల్యస్తుల్యో మిత్రారిపక్షయోః।
సర్వారంభపరిత్యాగీ గుణాతీతః స ఉచ్యతే॥

శ్రీకృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు:—

అర్జునా! ప్రకాశము, ప్రవృత్తి మోహము ప్రాప్తించినపుడు దుఃఖము పొందనివాడును, ఇవి లభించనపుడు అవి కావలయునని కోరనివాడును, తటస్థునివలే స్థిరముగా వుండువాడును, గుణములచే చలింపబడని వాడును, త్రిగుణములే తమ తమ కార్యములు చేయుచున్నవని భావించి స్థిరముగా వుండువాడును, చలించనివాడు, సుఖ దుఃఖములందు సమభావము కలవాడును, ఆత్మనిష్ఠ కలవాడును,

మట్టి బెడ్డను రాతిని బంగారమును సమముగా భావించు వాడును, ప్రియమైనది లేక అప్రియమైన వస్తువు లభించి నపుడు సంతోషముగాని విచారమునుగాని పొందక సమ భావముతో వుండువాడును, దూషణ భూషణములను సమముగా గ్రహించువాడును, మాన అవమానములను సమముగా ఎంచువాడును, శత్రు-మిత్రులను సమముగా చూచువాడును, సకల కామ్య కర్మారంభములను త్యజించిన వాడును గుణాతీతు డనబడుచున్నాడు.

వ్యాఖ్య : 22 నుండి 25 వ శ్లోకము వరకూ అన్నిటినీ చేర్చి ఒకే సారిగా ఆలోచించి సమన్వయము చేసికొన తగినవి-ప్రకాశము, ప్రవృత్తి, మోహము అనునవి క్రిందటి శ్లోకములో చెప్పబడిన విధముగా క్రమ మున సత్వ రజస్తమోగుణములయొక్క పరిణామ ములు లేక ప్రతీకలే యగుచున్నవి. గుణాతీతుడైన వానిమీద ఈ పరిణామముల ప్రభావము ఉండదని దీని తాత్పర్యము. రాయి ప్రకాశమును కోరదు. ప్రవృత్తినిగాని జడత్వమునుగాని ద్వేషించదు. దానికి కోరకుండానే శాంతి లభించును. ఎవరైనా చలనము కలిగించినచో వారిని ద్వేషించదు. మరల దానిని ఒకచోట నిలిపియుంచినచో తన ప్రవృత్తి అనగా గతి ఆగిపోయి మోహము, జడత్వము పొందితినని దుఃఖించదు. అంతియేగాక ఈ మూడు స్థితుల యందు అది ఒకే విధముగా ఉండును. రాతికిని

గుణాతీతునకుగల భేదమేమనగా గుణాతీతుడు చైతన్యము కలవాడు. అతడు బుద్ధిపూర్వకముగా గుణముల పరిణామములను, స్పర్శను త్యజించి జడమగు రాయివలె అయినాడు. రాయి గుణములకు అనగా ప్రకృతి కార్యములకు సాక్షి మాత్రమే అగుచున్నది కర్త కాదు. అటులనే జ్ఞాని సాక్షిగనే ఉండును. కాని కర్తగా ఉండడు. ఇట్టి జ్ఞానిని గురించి 23 వ శ్లోకములో చెప్పబడిన రీతిగా 'గుణములు తమ పనిని చేయుచున్నవి' అని భావించి చలించడు. స్థిర బుద్ధి కలిగి అనాసక్తుడై అచంచలుడై ఉండును అని ఊహించుకొనగలము. ఈ స్థితిని గుణములలో తన్మయులైన మనము కేవలము కల్పనచేసిమాత్రమే తెలిసికొనగలముగాని దాని అనుభూతిని పొందలేము. అయితే ఆ విధమగు కల్పనను దృష్టియందు ఉంచుకొని 'నేను' అను అహంకారమును మనము దిన దినమూ తగ్గించుకొని పోవుచో చివరకు గుణాతీతుని స్థితికి దగ్గరగా చేరుకొని అట్టి గుణాతీతుని స్థితిని దిఙ్మాత్రముగా దర్శింపగలము. గుణాతీతుడు తనస్థితిని అనుభవించునేగాని వర్ణించి చెప్పజాలడు. వర్ణించి చెప్పగలిగిన వాడు గుణాతీతుడు గాడు. ఎందు కనగా అట్లువర్ణించి చెప్పుటలో అహంభావము ఇమిడి ఉండును. శాంతి, ప్రకాశము, జడత్వము, మోహము

వీటిని సహజముగా అందరును అనుభవించగలరు. గీతయందు ప్రతిచోటునందునూ సత్వగుణము గుణాతీత స్థితికి అత్యంత సమీప స్థితియని స్పష్టము చేయబడినది. అందువలన మానవుడు సత్వగుణమును వికసింప చేసుకొనుటకే ప్రయత్నించవలెను. గుణాతీత స్థితి తప్పక లభించునని విశ్వాసము కలిగివుండవలెను.

26 మాం చ యోఽవ్యభిచారేణ భక్తియోగేన సేవతే।
స గుణాన్సమతీత్యైతాన్ బ్రహ్మభూయాయ కల్పతే॥

ఏకనిష్ఠుడై భక్తియోగముద్వారా నన్ను సేవించువాడు ఈ గుణములకు అతీతుడై బ్రహ్మత్వమును పొందుటకు అర్హుడగుచున్నాడు.

27 బ్రహ్మణో హి ప్రతిష్ఠాహమమృతస్యావ్యయస్య చ।
శాశ్వతస్య చ ధర్మస్య సుఖస్యైకాంతికస్య చ॥

బ్రహ్మత్వమును నేనే శాశ్వతమైన మోక్షస్థితియు నేనే, అటులనే సనాతనధర్మ స్థితిమరియు సర్వోత్కృష్టమైన పరమానంద స్థితియు కూడా నేనే.

ఈ విధముగా ఉపనిషదర్థ ప్రతిపాదకము, బ్రహ్మ
విద్యావిషయిక యోగశాస్త్రమును, శ్రీకృష్ణా
ర్జున సంవాదమును అగు భగవద్గీత
లోని గుణత్రయ విభాగయోగమను
పదునాల్గవ అధ్యాయము
సమాప్తము

# పదిహేనవ అధ్యాయము

## పురుషోత్తమ యోగము

ఈ అధ్యాయములో భగవానుడు క్షరాక్షరములకు అతీతమైన తన ఉత్తమ స్వరూపమును ఎరుకపరచు చున్నాడు.

శ్రీ భగవానువాచ:—

1 ఊర్ధ్వమూలమధఃశాఖ మశ్వత్థం ప్రాహురవ్యయమ్।
ఛందాంసి యస్య పర్ణాని యస్తం వేద స వేదవిత్॥

శ్రీకృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు:—

జ్ఞానులు నాశరహితమగు అశ్వత్థ వృక్షమును వర్ణించుచూ దాని మూలము ఆకాశములోను, శాఖలు క్రిందికిని, వేదములను ఆకులు కలదిగను వివరించి చెప్పి యున్నారు. దీనిని ఎరిగినవారు వేదములు తెలిసిన జ్ఞానులు.

వ్యాఖ్య: 'శ్వ' అనగా రేపటి రోజు అని అర్థము. అందు చేత 'అశ్వత్థ' మనగా రేపటివరకు ఉండనటువంటి క్షణ భంగురమగు ప్రపంచమని అర్థము. ప్రపంచము ప్రతి క్షణము పరివర్తనము చెందుచునే యుండును గనుక అది అశ్వత్థము. కాని పరివర్తన స్థితిలోకూడా అది ఎల్లప్పుడూ ఉండునదియే కావున దాని మూలము ఊర్ధ్వముగా ఉన్నది. అనగా ఈశ్వరుడే దాని మూలము. అందువలన అది నశించనిది. దాని

యందు వేదములు అనగా-ధర్మము యొక్క పరిశుద్ధ జ్ఞానమనెడి ఆకులు లేనిచో అది శోభిల్లదు. ఇట్టి ప్రపంచ సృష్టియొక్క యథార్థ జ్ఞానము కలవాడే ధర్మము ఎరిగినవాడగును. వాడే జ్ఞాని.

2 అధశ్చోర్ధ్వం ప్రసృతా స్తస్య శాఖాః
గుణప్రవృద్ధా విషయప్రవాలాః।
అధశ్చ మూలాన్యనుసంతతాని
కర్మానుబంధీని మనుష్యలోకే॥

గుణముల స్పర్శద్వారా వ్యాపించిన విషయసుఖములనెడి చివ్వళ్లతో ఈ అశ్వత్థ వృక్షపు శాఖలు క్రిందికి పైకి కూడా వ్యాపించియున్నవి. కర్మబంధనములు గావించు దాని వ్రేళ్ళు మనుష్యలోకములో క్రిందికి వ్యాపించినవి.

వ్యాఖ్య : అజ్ఞాని దృష్టిలోని సంసార వృక్ష వర్ణన ఇది. దానిపైన ఈశ్వరుని యందు ఉండెడి మూలమును అజ్ఞాని చూడడు. విషయసుఖముల రమణీయతను జూచి ముగ్ధుడై మోహితుడై త్రిగుణముల ద్వారా ఈ వృక్షమును పోషించును. మరియు మనుష్యలోకములో కర్మపాశములయందు చిక్కుపడి ఉండును.

3 న రూపమస్యేహ తథోపలభ్యతే
నాంతో న చాదిర్న చ సమ్ప్రతిష్ఠా।

అశ్వత్థమేనం సువిరూఢమూల-
మసంగ శస్త్రేణ దృఢేన ఛిత్త్వా॥
4 తతః పదం తత్పరిమార్గితవ్యం
యస్మింగతా న నివర్తంతి భూయః
తమేవ చాద్యం పురుషం ప్రపద్యే
యతః ప్రవృత్తిః ప్రసృతా పురాణీ॥

ఈ వృక్షము యొక్క యథార్థ స్వరూపము కనుపించదు. దానికి ఆది అంతము( మొదలు-మూలము) లేదు. చాలలోతుగా వేళ్లూనిన ఈ అశ్వత్థ వృక్షమును అనాసక్తి అనెడి బలమైన శస్త్రముతో నరికి సనాతనమైన ప్రవృత్తిని—మాయను వ్యాపింప చేసినట్టి ఆదిపురుషుని శరణు వేడుచున్నాను. అని మానవుడు ప్రార్థించవలెను. జనన మరణములనెడి చక్రములో పడకుండునట్లు చేసెడి పరమ పదమును మానవుడు అన్వేషించ వలెను.

వ్యాఖ్య : అనాసక్తియనగా సహాయనిరాకరణము, వైరాగ్యము. మానవుడు విషయములతో సహకరించక వాటి ప్రలోభనములకు దూరముగా ఉండనంత కాలము వానియందే తగులొక్కొని ఉండును. విషయ సుఖములను అనుభవించుచూ వాటిని అంటుకోనకుండా ఉండుట అసంభవమని ఈ శ్లోకముయొక్క తాత్పర్యము.

5 నిర్మానమోహా జితసంగదోషా
అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః।
ద్వంద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞై-
ర్గచ్ఛంత్యమూఢాః పదమవ్యయం తత్।

అభిమానవ్యామోహములను త్యజించి ఆసక్తివలన సంభవించెడి దోషములను పోగొట్టుకొని ఆత్మయందే నిత్యమూనిమగ్నుడై విషయములు శాంతించినటువంటివాడు, సుఖ దుఃఖములనెడి ద్వంద్వములనుండి విముక్తుడైన జ్ఞాని నాశరహితమగు పరమ పదమును పొందును.

6 న తద్భాసయతే సూర్యో న శశాంకో న పావకః।
యద్గత్వా న నివర్తంతే తద్ధామ పరమం మమ॥

అక్కడ సూర్యచంద్రాగ్నుల ప్రకాశమునకు అవసరమే ఉండదు. అక్కడికి చేరినవాడు తిరిగి జన్మించవలసిన పనిలేదు. అదియే నా పరమధామము.

7 మమైవాంశో జీవలోకే జీవభూతః సనాతనః।
మనఃషష్ఠానీంద్రియాణి ప్రకృతిస్థాని కర్షతి॥

నా సనాతన అంశమే జీవలోకములో జీవుడై ప్రకృతియందున్న పంచేంద్రియములను మనస్సును కూడ ఆకర్షించుకొనుచుండును.

8 శరీరం యదవాప్నోతి యచ్చాప్యుత్క్రామతీశ్వరః।
గృహీత్వైతాని సంయాతి వాయుర్గంధా నివాశయాత్॥

వాయువు తన పరిసరములందలి గంధమును (వాసనలను) కొనిపోవునట్లుగా ఈశ్వరాంశరూపుడైన జీవుడు (జీవరూపుడైన నా అంశము) శరీరము ధరించినపుడును త్యజించినపుడును మనస్సుతోపాటు పంచేంద్రియములను తీసికొని పోవును.

9 శ్రోత్రం చక్షుః స్పర్శనం చ రసనం ఘ్రాణమేవ చ:
అధిష్ఠాయ మనశ్చాయం విషయానుపసేవతే॥

ఆ జీవుడు చెవులు, కన్నులు, చర్మము, నాలుక, ముక్కు, మనస్సులను ఆధారముగా చేసికొని విషయ సుఖములను అనుభవించుచున్నాడు.

వ్యాఖ్య : ఇక్కడ విషయ సుఖములనగా అపవిత్రమైన భోగ విలాసములని కాదు. ఇంద్రియములకు సహజ సిద్ధమైన క్రియలు మాత్రమే. ఉదాహరణకు కంటికి చూచుట, చెవికి వినుట, జిహ్వకు రుచి చూచుట సహజములు. ఈ క్రియలు వికారముతో కూడి అహంభావయుతమైనపుడు కలుషితమై అపవిత్రములగుచున్నవి. నిర్వికారముగా నున్నంతవరకు ఈ క్రియలు దోషభూయిష్ఠములు కావు. దోష రహితములే యగును. శిశువు కంటితో చూచినపుడుగాని చేతితో తాకినపుడుగాని వికారమును పొందదు.

10 ఉత్క్రామంతం స్థితం వాపి భుంజానం వా గుణాన్వితమ్।
విమూఢా నానుపశ్యంతి పశ్యంతి జ్ఞానచక్షుషః॥

శరీరమును త్యజించునట్టి లేక అందు నివసించెడి లేక గుణముల నాశ్రయించి విషయ భోగములను అనుభవించెడి ఈ అంశరూపుడైన ఈశ్వరుని మూర్ఖులు చూడరు. కాని దివ్యచక్షులు కల జ్ఞానులు దర్శింతురు.

11 యతంతో యోగినశ్చైనం పశ్యంత్యాత్మన్యవస్థితమ్।
యతంతోఽప్యకృతాత్మానో నైనం పశ్యంత్యచేతసః॥

యోగులు సాధనచే తమయందే ఉన్నట్టి ఈశ్వరుని చూచెదరు. ఆత్మశుద్ధి పొందని మూఢుడు ప్రయత్నించి కూడా దీనిని గుర్తించలేడు.

వ్యాఖ్య : ఈ శ్లోకములోనూ తొమ్మిదవ అధ్యాయము లోను పాపాత్మునకు భగవంతుడిచ్చిన అభయమునకు వ్యతిరేకత ఏమియు లేదు. పాపాత్ముడనగా భక్తిహీనుడు, స్వేచ్ఛాచారి, దుర్మార్గుడు కూడా వినయపూర్వకముగా శ్రద్ధతో ఈశ్వరుని భజించిన ఆత్మశుద్ధి కలవాడగును. ఈశ్వరుని తెలిసికొనును. యమ నియమాదులను పాటించక కేవలము బుద్ధి బలముతో ఈశ్వరుని తెలిసికొనగోరువారు నిర్వికారుడైన పరబ్రహ్మను చూడలేరు.

12 యదాదిత్యగతం తేజో జగద్భాసయతేఽఖిలమ్।
యచ్చన్ద్రమసి యచ్చాగ్నౌ తత్తేజో విద్ధి మామకమ్॥

జగత్తును ప్రకాశింపచేయు సూర్యునిలోగల తేజస్సు, చంద్రునిలోను అగ్నిలోనుగల తేజస్సు నావేనని తెలిసికొనుము.

13 గామావిశ్య చ భూతాని ధారయామ్యహమోజసా।
పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః॥

నేను భూమియందు ప్రవేశించి నా శక్తితో ప్రాణులను నిలుపుచున్నాను. రసాదులను ఉత్పన్నము చేయు చంద్రుడనై సకల వనస్పతులను పోషించుచున్నాను.

14 అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహమాశ్రితః।
ప్రాణాపానసమాయుక్తః పచామ్యన్నం చతుర్విధమ్॥

ప్రాణుల శరీరము నాశ్రయించి జఠరాగ్నినై ప్రాణ అపాన వాయువుల ద్వారా నేను నాలుగు రకముల అన్నమును (ఆహార పదార్థములను) జీర్ణము చేయుచున్నాను.

15 సర్వస్య చాహం హృది సన్నివిష్టో
మత్తః స్మృతిర్జ్ఞానమపోహనం చ।
వేదైశ్చ సర్వైరహమేవ వేద్యో
వేదాంతకృ ద్వేదవిదేవ చాహమ్॥

అందరిహృదయములలో విరాజిల్లుచున్న నావలన స్మృతి, జ్ఞానము కలుగక పోవుటయు జరుగుచున్నది. సమస్త వేదములద్వారా తెలిసికొనదగిన వానిని నేనే. వేదములు తెలిసిన వాడిని నేనే. వేదాంతమును వ్యక్తపరచుచున్న వాడను నేనే యని గుర్తించుము.

16 ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ।
క్షరః సర్వాణి భూతాని- కూటస్థోఽక్షర ఉచ్యతే॥

ఈ లోకములో క్షరుడు అనగా నశించునట్టి, అక్షరుడు అనగా-నాశరహితమైనట్టి పురుషులు ఇరువురు కలరు. భూతజాలమంతయు క్షరమైనది. కాని అందులో నివసించు అంతర్యామిని అక్షరుడని చెప్పుదురు.

17 ఉత్తమః పురుష స్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః।
యో లోకత్రయమావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః॥

వీరిరువురుగాక సర్వోత్తమ పురుషుడు మరి ఒకడు కలడు. అతడు పరమాత్మయని పిలువబడుచున్నాడు. అతడే నాశరహితుడగు ఈశ్వరుడు. ముల్లోకములందు ప్రవేశించి వాటిని పోషించుచున్నాడు.

18 యస్మాత్క్షరమతీతోఽహ మక్షరాదపి చోత్తమః।
అతోఽస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః॥

నేను క్షరునికంటె అతీతుడను. అక్షరునికంటె

ఉత్తముడను అందువలన వేదములలోను లోకములలోను పురుషోత్తముడను పేరుతో ప్రసిద్ధినందియున్నాను.

19 యో మామేవమసమ్మూఢో జానాతి పురుషోత్తమమ్।
స సర్వవిద్భజతి మాం సర్వభావేన భారత॥

అర్జునా! మోహరహితుడై పురుషోత్తముని ఈ విధముగా ఎరిగిన వాడు సర్వమూ తెలిసినట్టి వాడగును. అట్టివాడు నన్ను పూర్ణభావముతో భజించును.

20 ఇతి గుహ్యతమం శాస్త్రమిదముక్తం మయానఘ।
ఏతద్బుద్ధ్వా బుద్ధిమాన్స్యాత్కృతకృత్యశ్చ భారత॥

పాపరహితుడవైన అర్జునా! అతినిగూఢమైన శాస్త్రమును నేను నీకు బోధించితిని. దీనిని తెలిసికొని మానవుడు బుద్ధిమంతుడగుగాక! జీవితమును కృతార్థ పరచుకొనుగాక!

ఈ విధముగా ఉపనిషదర్థ ప్రతిపాదకము, బ్రహ్మ
విద్యా విషయిక యోగశాస్త్రమును, శ్రీకృష్ణా
ర్జున సంవాదమును అగు భగవద్గీత
లోని పురుషోత్తమ యోగమను
పదిహేనవ అధ్యాయము
సమాప్తము.

ఓం తత్సత్

# పదహారవ అధ్యాయము
## దైవాసుర సంపద్విభాగయోగము

ఈ అధ్యాయములో దైవ సంపదలు, ఆసురీ సంపదలను గురించి వివరించబడినది.

శ్రీకృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు:—

శ్రీ భగవానువాచ :—

1 అభయం సత్త్వసంశుద్ధిర్జ్ఞానయోగవ్యవస్థితిః।
దానం దమశ్చ యజ్ఞశ్చ స్వాధ్యాయస్తప ఆర్జవమ్॥

2 అహింసా సత్యమక్రోధస్త్యాగః శాన్తిరపైశునమ్।
దయాభూతేష్వలోలుప్త్వం మార్దవం హ్రీరచాపలమ్॥

3 తేజః క్షమా ధృతిః శౌచ మద్రోహో నాతిమానితా।
భవన్తి సమ్పదం దైవీమభిజాతస్య భారత॥

అర్జునా! నిర్భయము, అంతఃకరణ శుద్ధి, జ్ఞానము యోగమునందు నిష్ఠ, దానము, దమము, యజ్ఞము, స్వాధ్యాయము, తపస్సు సౌమ్య స్వభావము, అహింస, సత్యము, క్రోధము లేకుండుట, త్యాగము, శాంతి, అపైశునము, అలోలుపత, మృదుత్వము, మర్యాద, అచంచలత్వము, తేజస్సు, ఓర్పు, ధైర్యము, శౌచము, అద్రోహము అనగా-ద్రోహచింత లేకుండుట, స్వాతిశయము లేకుండుట- ఈ గుణములన్నియు దైవీ సంపదతో జన్మించిన వాని యందు ఉండు లక్షణములు.

వ్యాఖ్య : 'దమ' మనగా ఇంద్రియనిగ్రహము, 'అపైశునము' అనగా చాడీలు చెప్పకుండుట, 'అలోలుపత' యనగా పేరాశ లేకుండుట, విషయలంపటత్వము లేకుండుట, 'తేజస్సనగా హీన ప్రవృత్తిని ప్రతిఘటించు శక్తి, 'అద్రోహ' మనగా-ఎవరికినీ కీడు తలచకుండుట-కీడు చేయకుండుట.

4 దమ్భో దర్పోఽభిమానశ్చ క్రోధః పారుష్యమేవ చ।
అజ్ఞానం చాభిజాతస్య పార్థ సమ్పదమాసురీమ్॥

అర్జునా! దంభము దర్పము, స్వాతిశయము, క్రోధము పారుష్యము, అజ్ఞానము - ఈ గుణములన్నియు ఆసురీ సంపదతో పుట్టినవాని యందు ఉండును.

వ్యాఖ్య : 'దంభము' అనగా తనయందు లేని దానిని ప్రదర్శించుట, మోసము, కపటాచరణము. దర్ప మనగా గొప్పలు చెప్పుకొనుట. పారుష్యమనగా కర్కశత్వము కాఠిన్యము.

5 దైవీ సమ్పద్విమోక్షాయ నిబన్ధాయాసురీ మతా।
మా శుచః సమ్పదం దైవీమభిజాతోఽసి పాణ్డవ॥

దైవీ సంపద మోక్షము నిచ్చునదిగను, ఆసురీ సంపద బంధనములలో పడద్రోయునదిగను చెప్పబడినది.

అర్జునా! నీవు చింతింపవలదు. దైవీ సంపదతో నీవు జన్మించినావు.

6 ద్వౌ భూతసర్గౌ లోకేఽస్మిన్ దైవ ఆసుర ఏవ చ।
దైవో విస్తరశః ప్రోక్త ఆసురం పార్థ మే శృణు॥

ఈ లోకములో దైవీ, ఆసురీ అను రెండు విధముల సృష్టి కలదు. పార్థా! దైవీ సృష్టిని గురించి వివరముగా చెప్పియుంటిని. ఇపుడు ఆసురీ సృష్టిని గురించి వినుము.

7 ప్రవృత్తిం చ నివృత్తిం చ జనా న విదురాసురాః।
న శౌచం నాపి చాచారో న సత్యం తేషు విద్యతే॥

ప్రవృత్తియననేమియో? నివృత్తియననేమియో? ఆసురీ సంపదయందు జన్మించినవారు ఎరుగరు. అటులనే వారికి 'శౌచము', సత్ప్రవర్తన, సత్యములనగా ఏమియో కూడా తెలియదు.

8 అసత్యమప్రతిష్ఠం తే జగదాహురనీశ్వరమ్।
అపరస్పరసమ్భూతం కిమన్యత్కామహైతుకమ్॥

ఆసురీ ప్రవృత్తియందు జన్మించినవారు జగత్తు మిథ్యయని, నిరాధారమైనదని, ఈశ్వరుడు లేడని చెప్పుదురు. కేవలము స్త్రీ-పురుష సంబంధమువలననే ఇది కలి

గినదని చెప్పుదురు. ఇందు విషయభోగములు గాక వేరొక కారణము ఏమి కలదని ప్రశ్నింతురు.

9 ఏతాం దృష్టిమవష్టభ్య నష్టాత్మానోఽల్పబుద్ధయః।
ప్రభవన్త్యుగ్రకర్మాణః క్షయాయ జగతోఽహితాః॥

భయంకర కృత్యములు చేయువారు, మందబుద్ధులు, దుష్టులు ఈ అభిప్రాయముతోనే జగత్తునకు శత్రువులై దాని వినాశమునకు పాల్పడుదురు.

10 కామమాశ్రిత్య దుష్పూరం దమ్భ మానమదాన్వితాః।
మోహాద్గృహీత్వాసద్గ్రాహాన్ప్రవర్తన్తేఽశుచివ్రతాః॥

తృప్తిచెందని కోరికలతో నిండి దంభముతో, గర్వముతో మదాంధులై అశుభము (కీడు)నే కోరుచూ మోహముతో దుష్టమైన కోరికలు కలిగి సంచరింతురు.

11 చిన్తామపరిమేయాం చ ప్రళయాన్తాముపాశ్రితాః।
కామోపభోగపరమా ఏతావదితి నిశ్చితాః॥

12 ఆశాపాశశతైర్బద్ధాః కామక్రోధపరాయణాః।
ఈహన్తే కామభోగార్థమన్యాయేనార్థసఞ్చయాన్॥

ప్రళయము పర్యంతము అంతులేని చింతను పొందుతూ కామములను భోగించుచూ, భోగమే సర్వస్వమని నిశ్చయించుకొన్నవారు అసంఖ్యాకములగు ఆశాపాశములలో

చిక్కుకొని కామక్రోధములకు గురియై విషయ భోగముల కొరకు అన్యాయముగా ధన సంపాదన చేయగోరుదురు.

13 ఇదమద్య మయా లబ్ధ మిదం ప్రాప్స్యే మనోరథమ్।
ఇదమ స్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్॥

14 అసౌ మయా హతః శత్రుర్హనిష్యే చాపరానపి।
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ॥

15 ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః॥

16 అనేక చిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః।
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ॥

అజ్ఞానముతో మూఢులైనవారు "నేడు దీనిని సంపాదించితిని. ఈ కోరికల నిప్పుడు నెరవేర్చుకొందును, ఇంత ధనము నావద్ద కలదు, రేపు మరల ఇంత ధనము నాదగును, ఈ శత్రువును సంహరించితిని, మరొకరినికూడా హతమార్చెదను, నేను సర్వశక్తి సంపన్నుడను, మహా భోగిని, సిద్ధుడను, బలవంతుడను, సుఖవంతుడను, శ్రీమంతుడను, సద్వంశ సంజాతుడను, నాతో సరియగు వాడెవడున్నాడు? నేను యజ్ఞము చేయుదును, దానము చేయుదును, ఆనందము పొందుదు" నని తలచి అనేక భ్రమలలోపడి,

చిక్కుకొని కామక్రోధములకు గురియై విషయ భోగముల కొరకు అన్యాయముగా ధన సంపాదన చేయగోరుదురు.

13 ఇదమద్య మయా లబ్ధ మిదం ప్రాప్స్యే మనోరథమ్।
ఇదమ స్తీదమపి మే భవిష్యతి పునర్ధనమ్॥

14 అసౌ మయా హతః శత్రుర్హనిష్యే చాపరానపి।
ఈశ్వరోఽహమహం భోగీ సిద్ధోఽహం బలవాన్సుఖీ॥

15 ఆఢ్యోఽభిజనవానస్మి కోఽన్యోఽస్తి సదృశో మయా।
యక్ష్యే దాస్యామి మోదిష్య ఇత్యజ్ఞానవిమోహితాః॥

16 అనేక చిత్తవిభ్రాన్తా మోహజాలసమావృతాః।
ప్రసక్తాః కామభోగేషు పతన్తి నరకేఽశుచౌ॥

అజ్ఞానముతో మూఢులైనవారు "నేడు దీనిని సంపాదించితిని. ఈ కోరికల నిప్పుడు నెరవేర్చుకొందును, ఇంత ధనము నావద్ద కలదు, రేపు మరల ఇంత ధనము నాదగును, ఈ శత్రువును సంహరించితిని, మరొకరినికూడా హతమార్చెదను, నేను సర్వశక్తి సంపన్నుడను, మహా భోగిని, సిద్ధుడను, బలవంతుడను, సుఖవంతుడను, శ్రీమంతుడను, సద్వంశ సంజాతుడను, నాతో సరియగు వాడెవడున్నాడు? నేను యజ్ఞము చేయుదును, దానము చేయుదును, ఆనందము పొందుదు" నని తలచి అనేక భ్రమలలోపడి,

నరాధములను ఎల్లప్పుడూ నేను ఈ సృష్టిలోని ఆసురీ గర్భములందు మాత్రమే పడవేయుచున్నాను.

20 ఆసురీం యోనిమాపన్నా మూఢా జన్మని జన్మని।
మామప్రాప్యైవ కౌన్తేయ తతో యాన్త్యధమాం గతిమ్॥

అర్జునా! ఆసురీ యోనులందు జన్మ మెత్తిన ఈ మూఢ జనులు జన్మజన్మలయందు నన్నెరుగక అంతకు మించిన అధోగతిని పొందుచున్నారు.

21 త్రివిధం నరకస్యేదం ద్వారం నాశనమాత్మనః।
కామః క్రోధస్తథా లోభస్తస్మాదేతత్త్రయం త్యజేత్॥

ఆత్మ వినాశనమునకు దారి తీయు నరకమునకు కామము, క్రోధము, లోభము అను మూడు ద్వారములు కలవు. కనుక మానవుడు ఈ మూడింటిని త్యజించవలెను, దరి చేరకూడదు.

22 ఏతైర్విముక్తః కౌంతేయ తమోద్వారైస్త్రిభిర్నరః।
ఆచరత్యాత్మనః శ్రేయస్తతో యాతి పరాం గతిమ్॥

అర్జునా! ఈ మూడు నరక ద్వారములకు దూరముగానుండు మానవుడు ఆత్మ కళ్యాణ ప్రదమగు ఆచరణ చేయుచూ దానివలన పరమ పదమును పొందు చున్నాడు.

23 యః శాస్త్రవిధిముత్సృజ్య వర్తతే కామకారతః।
న స సిద్ధిమవాప్నోతి న సుఖం న పరాం గతిమ్॥

శాస్త్ర విధిని విడచి ఇచ్ఛానుసారముగా భోగ

ములయందు మగ్నుడైనవాడు సిద్ధినిగాని సుఖమును గాని పరమ పదమునుగాని పొందజాలడు.

వ్యాఖ్య : శాస్త్రవిధి యనగా ధర్మము పేరుతో గ్రంథములలో చెప్పబడిన అనేక క్రియలే కావు. అనుభవ జ్ఞానముతో సత్పురుషులు చూపించిన ఆత్మనిగ్రహము గల సన్మార్గమే సరియగు శాస్త్రవిధి కాగలదు.

24 తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ।
జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మ కర్తుమిహార్హసి॥

కనుక అర్జునా! కార్యాకార్యములను నిర్ణయించవలసివచ్చినపుడు శాస్త్రమును ప్రమాణముగా భావించవలెను. శాస్త్రవిధి అనగా ఏదో తెలిసికొని నీవు కర్మాచరణ చేయుదగును.

వ్యాఖ్య : 23 వ శ్లోకము వ్యాఖ్యలో చెప్పబడిన అర్థమే శాస్త్రమునకు కూడవర్తించును. అందరూ తమ తమ ఇష్టానుసారముగా నియమ మేర్పరుచుకొని స్వేచ్ఛగా వ్యవహరించ కూడదు. ధర్మమునందు అనుభవజ్ఞులైన పెద్దల వాక్యములనే ప్రమాణముగా స్వీకరింపవలెనను భావమే ఈ శ్లోకమునందుకలదు.

ఈ విధముగా ఉపనిషదర్థ ప్రతిపాదకము, బ్రహ్మ విద్యావిషయిక యోగశాస్త్రమును, శ్రీకృష్ణార్జున సంవాదమును అగు భగవద్గీత లోని దైవాసుర సంపద్విభాగయోగమను పదహారవ అధ్యాయము సమాప్తము.

# పదిహేడవ అధ్యాయము
## శ్రద్ధాత్రయ విభాగ యోగము

శాస్త్రము అనగా శిష్టాచారమును ప్రమాణముగా అంగీకరించవలెను అని చెప్పిన వాక్యమును వినిన అర్జునునకు సందేహము కల్గినది. శిష్టాచారమును ప్రమాణముగా ఎంచక శ్రద్ధాపూర్వకముగా ఆచరణచేయువాని స్థితి ఏమగునని ప్రశ్నించెను. దీనికి ఈ అధ్యాయములో తగిన సమాధానము చెప్పబడినది. అయితే శిష్టాచారమనెడి దీపస్తంభమును గురించిగాక దానినివదలినవాడు శ్రద్ధాపూర్వకముగా ఆచరణ చేయుటలో సంభవించు ప్రమాదములను గురించి భగవానుడు సంప్రీతుడై వివరించినాడు. అందుచే శ్రద్ధను, ఆశ్రద్ధ నాధారముగా చేసికొని జరుపు యజ్ఞము, తపస్సు, దానాది కార్యములను వాటి గుణానుసారముగా మూడు విభాగములుచేసి చెప్పినాడు. మరియు ఇందు (ఓం తత్ సత్) యొక్క మహిమను ప్రస్తుతించియున్నాడు.

అర్జున ఉవాచ :—

1 యే శాస్త్రవిధిముత్సృజ్య యజన్తే శ్రద్ధయాన్వితాః।
తేషాం నిష్ఠా తు కా కృష్ణ సత్త్వమాహో రజస్తమః।

అర్జునుడు ప్రశ్నించుచున్నాడు :—

శ్రీకృష్ణా! శాస్త్రవిధి అనగా శిష్టాచారములను పాటించక కేవలము శ్రద్ధతో పూజించువాడు ఎట్టిగతిని

పొందును? సాత్వికగతి లేక రాజసీగతియా? అదియునూ గాక తామసీగతిని పొందుచున్నాడా?

శ్రీ భగవానువాచ:—

2 త్రివిధా భవతి శ్రద్ధా దేహినాం సా స్వభావజా।
సాత్త్వికీ రాజసీ చైవ తామసీ చేతి తాం శృణు॥

శ్రీకృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు:—

మానవునిలో స్వాభావికముగనే సాత్విక, రాజస, తామస మను మూడువిధముల శ్రద్ధయుండును. దానిని వినుము.

3 సత్త్వానురూపా సర్వస్య శ్రద్ధా భవతి భారత।
శ్రద్ధామయోఽయం పురుషో యో యచ్ఛ్రద్ధః స ఏవ సః॥

ఓ భారతా! సకలప్రాణులలోను వారివారి స్వభావము ననుసరించి శ్రద్ధయుండును. ప్రతిమానవుని యందును ఏదో ఒక విధముగు శ్రద్ధ ఉండితీరును. ఎవరియందు ఎట్టిశ్రద్ధ యుండునో వారు అటులనే యుందురు.

4 యజంతే సాత్త్వికా దేవాన్యక్షరక్షాంసి రాజసాః।
ప్రేతాన్భూతగణాంశ్చాన్యే యజంతే తామసా జనాః॥

సాత్వికులు దేవతలను భజింతురు. రాజసులు యక్ష-

రాక్షసులను కొలుతురు. తామసులు భూత ప్రేతాదులను పూజింతురు.

5 అశాస్త్రవిహితం ఘోరం తప్యన్తే యే తపో జనాః।
దమ్భాహఙ్కారసంయుక్తాః కామరాగ బలాన్వితాః॥

6 కర్శయన్తః శరీరస్థం భూతగ్రామ మచేతసః।
మాం చైవాన్తః శరీరస్థం తాన్విద్ధ్యాసురనిశ్చయాన్॥

దంభాహంకారములు కలవారు కామరాగ ప్రేరితులై శాస్త్ర సమ్మతము కాని ఘోర తపస్సు చేయుదురు. అట్టి మూఢులు శరీరమందున్న పంచ మహా భూతములను, అంతరంగమందున్న నన్నును బాధించుచున్నారు. ఇట్టివారిని ఆసురీ స్వభావము కలవారుగా గుర్తింపుము,

7 ఆహార స్త్వపి సర్వస్య త్రివిధో భవతి ప్రియః।
యజ్ఞ స్తప స్తథా దానం తేషాం భేదమిమం శృణు॥

మానవులకు ఆహారముకూడా మూడువిధములుగా రుచించును. అదేవిధముగా యజ్ఞము, తపస్సు, దానము కూడా మూడు విధములుగానే యుండును. ఆ భేదములను వివరించెదను, వినుము.

8 ఆయుః సత్త్వ బలారోగ్య సుఖప్రీతివివర్ధనాః।
రస్యాః స్నిగ్ధాః స్థిరా హృద్యా ఆహారాః సాత్త్వికప్రియాః॥

ఆయుర్దాయము, సౌమ్యత, బలము, ఆరోగ్యము,

సుఖము కలిగించునవియు రుచికరములై, రసయుక్తమై, పుష్టికరమై మనస్సునకు ఆహ్లాద కరములైన ఆహారమును సాత్వికులు ఇష్టపడుదురు.

9 కట్వమ్లలవణాత్యుష్ణతీక్ష్ణరూక్షవిదాహినః।
ఆహారా రాజసస్యేష్టా దుఃఖశోకామయప్రదాః॥

తీక్షణమై, పుల్లని, కారముగల, అమిత వేడియైన, ఉద్రేకమును కలిగించు, నిస్సారమైన, దాహముకల్గించు ఆహారములను రాక్షసులు మెచ్చుకొనుచూ భుజింతురు. వీనిని సేవించినందువలన దుఃఖము, శోకము, రోగములు కలుగును.

10 యాతయామం గతరసం పూతి పర్యుషితం చ యత్।
ఉచ్ఛిష్టమపిచామేధ్యం భోజనం తామసప్రియమ్॥

చాలా కాలముక్రింద వండినటువంటి రసహీనమైన, దుర్గంధపూరితమైన, పాచిపోయిన, ఎంగిలియైన, అపరిశుభ్రముగానున్న భోజనపదార్థము తామసులకు ఇష్టమగుచున్నది.

11 అఫలాకాంక్షిభిర్యజ్ఞో విధిదృష్టో య ఇజ్యతే।
యష్టవ్యమేవేతి మనః సమాధాయ స సాత్త్వికః॥

ఫలాపేక్ష లేకుండా శాస్త్రయుక్తంగా కర్తవ్యమని

భావించి, మనస్సును లగ్నముచేసి చేయబడు యజ్ఞముసాత్త్వికమన బడును.

12 అభిసన్ధాయ తు ఫలం దమ్భార్థమపి చైవ యత్।
ఇజ్యతే భరతశ్రేష్ఠ తం యజ్ఞం విద్ధి రాజసమ్॥

ఓ అర్జునా! ఫలాపేక్షతోను, దంభముగాను చేయబడు యజ్ఞము రాజసీయజ్ఞమని తెలుసుకొనుము.

13 విధిహీనమసృష్టాన్నం మన్త్రహీన మదక్షిణమ్।
శ్రద్ధావిరహితం యజ్ఞం తామసం పరిచక్షతే॥

శాస్త్రోక్తముకానిది, అన్నోత్పత్తి, మంత్రము, త్యాగము, శ్రద్ధయూలేకుండా చేయబడు యజ్ఞమును జ్ఞానులు తామసీయజ్ఞమని యందురు.

14 దేవద్విజగురు ప్రాజ్ఞపూజనం శౌచమార్జవమ్।
బ్రహ్మచర్య మహింసా చ శారీరం తప ఉచ్యతే॥

దేవ బ్రాహ్మణ గురు జ్ఞానిజనులను పూజించుట, పవిత్రత, సరళత, బ్రహ్మచర్యము, అహింస - ఇవి శారీరక తపస్సు అనబడును.

15 అనుద్వేగకరం వాక్యం సత్యం ప్రియహితం చ యత్।
స్వాధ్యాయాభ్యసనం చైవ వాఙ్మయం తప ఉచ్యతే॥

బాధకలిగించనిది, సత్యము ప్రియము హితకరమగు

వాక్కు మరియు ధర్మ శాస్త్ర గ్రంథముల అధ్యయనము-ఇవి వాచికమైన తపస్సు అనబడును.

16 మనః ప్రసాదః సౌమ్యత్వం మౌనమాత్మవినిగ్రహః।
భావసంశుద్ధిరిత్యేతత్తపో మానసముచ్యతే॥

మనస్సు ప్రసన్నముగా నుండుట, సౌమ్యత, మౌనము, ఆత్మనిగ్రహము, అంతఃకరణ శుద్ధి-ఇవి మానసిక తపస్సు అనబడును.

17 శ్రద్ధయా పరయా తప్తం తపస్తత్త్రివిధం నరైః।
అఫలాకాంక్షిభిర్యుక్తైః సాత్త్వికం పరిచక్షతే॥

సమబుద్ధి కలిగి ఫలాపేక్ష విడనాడి అత్యంతశ్రద్ధా పూర్వకముగా పై శ్లోకములలో చెప్పబడిన మూడు రకములైన శారీరక, వాచిక, మానసికములగు తపస్సు లాచరింపబడుచున్నవి. వాటిని జ్ఞానులు సాత్త్విక తపస్సని చెప్పుదురు.

18 సత్కారమానపూజార్థం తపో దమ్భేన చైవ యత్।
క్రియతే తదిహ ప్రోక్తం రాజసం చలమధ్రువమ్॥

తనను ఇతరులు సన్మానించవలెనని గౌరవించవలెనని పూజించవలెనని తలచి ఆడంబరముగా ఆచరింప బడు

తపస్సు అస్థిరమై అనిశ్చితమైన రాజసీ తపస్సని చెప్పబడు చున్నది.

19 మూఢగ్రాహేణాత్మనో యత్పీడయా క్రియతే తపః।
పరస్యోత్సాదనార్థం వా తత్తామస ముదాహృతమ్॥

బాధను సహించి మొండిపట్టుదలతో ఇతరుల వినాశము కొరకు చేయబడు తపస్సును తామసీ తపస్సని చెప్పెదరు.

20 దాతవ్యమితి యద్దానం దీయ తేఽనుపకారిణే।
దేశే కాలే చ పాత్రే చ తద్దానం సాత్త్వికం స్మృతమ్॥

ప్రతిఫలము కోరక దేశ కాల పాత్రలను గమనించి చేయబడు దానము సాత్వికదాన మనబడును.

21 యత్తు ప్రత్యుపకారార్థం ఫలముద్దిశ్య వా పునః।
దీయతే చ పరిక్లిష్టం తద్దానం రాజసం స్మృతమ్॥

ప్రత్యుపకారమును పొందుటకుగాని ఫలితము కోరి గాని అతికష్టముతో చేయబడు దానము రాజసీదానమన బడుచున్నది.

22 అదేశకాలే యద్దాన మపాత్రేభ్యశ్చ దీయతే।
అసత్కృతమవజ్ఞాతం తత్తామసముదాహృతమ్॥

దేశ కాల పాత్రలను విచారించక అగౌరవముగాను

తిరస్కార భావముతోను చేయబడుదానము తామసీ దాన మనబడుచున్నది.

23 ఓం తత్సదితి నిర్దేశో బ్రహ్మణస్త్రివిధః స్మృతః।
బ్రాహ్మణా స్తేన వేదాశ్చ యజ్ఞాశ్చ విహితాః పురా॥

'ఓం తత్ సత్' అని పరబ్రహ్మము మూడు విధములుగా ప్రస్తుతింపబడినది. దాని నుండి పూర్వము బ్రాహ్మణ, వేద, యజ్ఞములు సృష్టింపబడినవి.

24 తస్మాదోమిత్యుదాహృత్య యజ్ఞదానతపః క్రియాః।
ప్రవర్తన్తే విధానోక్తాః సతతం బ్రహ్మవాదినామ్॥

అందువలన బ్రహ్మవాదులు 'ఓం' అని ఉచ్చరించుచూ యజ్ఞదాన తపస్సులను విధి పూర్వకముగా ఎల్లకాలము నిర్వహించుచుందురు.

25 తదిత్యనభిసన్ధాయ ఫలం యజ్ఞ తపః క్రియాః।
దానక్రియాశ్చ వివిధాః క్రియన్తే మోక్షకాఙ్క్షిభిః॥

మోక్షమును కోరువారు 'తత్' అని ఉచ్చరించుచూ ఫలాపేక్ష విడచి యజ్ఞము, తపస్సు, దానమనెడి వివిధ కర్మలను ఆచరింతురు.

26 సద్భావే సాధుభావే చ సదిత్యేతత్ప్రయుజ్యతే।
ప్రశస్తే కర్మణి తథా సచ్ఛబ్దః పార్థ యుజ్యతే॥

సత్యము, శుభము అను అర్థములో 'సత్' శబ్దము

ప్రయోగింపబడుచున్నది. పార్థా! ఉత్తమ కార్యములందు కూడ 'సత్' శబ్దము ఉపయోగింపబడుచున్నది.

27 యజ్ఞే తపసి దానే చ స్థితిః సదితి చోచ్యతే।
కర్మచైవ తదర్థీయం సదిత్యేవాభిధీయతే॥

యజ్ఞము, తపస్సు, దానములందు దృఢమైన నిష్ఠను కూడా 'సత్' అందురు. కర్మాచరణయు 'సత్' అనబడును. అట్టి సంకల్పము కూడా సత్ అని చెప్పబడుచున్నది.

వ్యాఖ్య : ప్రతికర్మను ఈశ్వరార్పణ చేయవలెను. ఎందుకనగా- 'ఓం' శబ్దమే 'సత్' లేక సత్యము. దానికి అంకితమైనదే అనగా అర్పించబడినదే సార్థకమగును. ఇదియే పైమూడుశ్లోకముల భావార్థము.

28 అశ్రద్ధయా హుతం దత్తం తపస్తప్తం కృతం చ యత్।
అసదిత్యుచ్యతే పార్థ న చ తత్ప్రేత్య నో ఇహ॥

ఓపార్థా! శ్రద్ధలేకుండా చేయబడు యజ్ఞము, దానము, తపస్సు లేక ఏ ఇతర కార్యమైనా 'అసత్' అనబడును. ఈ 'అసత్' వలన ఈలోకమందును పరలోకమందునూ లోక కళ్యాణమేదియు జరుగదు, ప్రయోజనము లేదని తాత్పర్యము.

ఈ విధముగా ఉపనిషదర్థ ప్రతిపాదకమును, బ్రహ్మ
విద్యావిషయిక యోగశాస్త్రమును, శ్రీ కృష్ణార్జున
సంవాదమును అగు భగవద్గీతలోని
శ్రద్ధాత్రయ విభాగయోగమను
పదిహేడవ అధ్యాయము
సమాప్తము.

# పద్ధెనిమిదవ అధ్యాయము

## సన్యాస యోగము

ఈఅధ్యాయమును శ్రీమత్ భగవద్గీతకు ఉపసంహార ముగా భావించవచ్చును. "సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ" అనగా అన్ని ధర్మములను పరిత్యజించి నన్నే శరణుపొందుము అనునదియే ఈ అధ్యాయము యొక్కగాని భగవద్గీత యొక్కగాని ప్రేరక మంత్రమని చెప్పవచ్చును. ఇదే నిజమైన సన్యాసము. కాని అన్ని ధర్మములను త్యజించుట అనగా-అన్ని కర్మలను విడచి పెట్టుట మాత్రము కాదు. పరోపకారకర్మలయందు కూడా సర్వోత్కృష్టమైన దానిని ఈశ్వరార్పణగావించి ఫలాపేక్షను త్యజించుటయే సర్వధర్మత్యాగము లేక సన్యాసము

**అర్జున ఉవాచ:—**

1 సంన్యాసస్య మహాబాహో తత్త్వమిచ్ఛామి వేదితుమ్।
త్యాగస్య చ హృషీకేశ పృథక్కేశినిషూదన॥

అర్జునుడు ప్రశ్నించుచున్నాడు:—

హే కృష్ణా! సన్యాసము యొక్కయు, త్యాగము

యొక్కయు రహస్యములను విడివిడిగా ఎరుగ గోరు చున్నాను.

శ్రీ భగవానువాచ :—

2 కామ్యానాం కర్మణాం న్యాసం సంన్యాసం కవయో విదుః।
సర్వకర్మఫలత్యాగం ప్రాహుస్త్యాగం విచక్షణాః॥

శ్రీకృష్ణ భగవానుడు చెప్పుచున్నాడు:—

జ్ఞానులు కామ్య (కోరికల నుండి ఉత్పన్నమైన) కర్మలను త్యాగము చేయుటయే సన్యాసమని అందురు. సమస్త కర్మల ఫలత్యాగమును పండితులు త్యాగమని అందురు.

3 త్యాజ్యం దోషవదిత్యేకే కర్మ ప్రాహుర్మనీషిణః।
యజ్ఞ దానతపఃకర్మ న త్యాజ్యమితి చాపరే॥

కొందరు విజ్ఞులు కర్మలన్నియు దోషభూయిష్ఠము లగుటచే కర్మలనే త్యజించవలెనని యందురు. మరికొందరు యజ్ఞము, దానము, తపస్సనెడి కర్మలు త్యజింప తగినవి కావని అందురు.

4 నిశ్చయం శృణు మే తత్ర త్యాగే భరతసత్తమ।
త్యాగో హి పురుషవ్యాఘ్ర త్రివిధః సమ్ప్రకీర్తితః॥

ఓ భరతసత్తమా! ఈ త్యాగమును గురించి నా

నిశ్చితాభిప్రాయమును వినుము. అర్జునా! త్యాగము మూడు విధములుగా వర్ణింపబడినది.

5 యజ్ఞ దానతపఃకర్మ న త్యాజ్యం కార్యమేవ తత్।
యజ్ఞో దానం తపశ్చైవ పావనాని మనీషిణామ్॥

యజ్ఞము, దానము, తపస్సనెడి కర్మలు త్యజింప తగినవి కావు, చేయతగినవే. యజ్ఞము, దానము, తపస్సు వివేకవంతుని పవిత్రుని చేయుచున్నవి.

6 ఏతాన్యపి తు కర్మాణి సఙ్గం త్యక్త్వా ఫలాని చ।
కర్తవ్యానీతి మే పార్థ నిశ్చితం మతముత్తమమ్॥

పార్థా! కోరికలను, ఫలాపేక్షను విడచి ఈ కర్మలను చేయవలెనని నా ఉత్తమ నిశ్చితాభిప్రాయము.

7 నియతస్య తు సంన్యాసః కర్మణో నోపపద్యతే।
మోహాత్తస్య పరిత్యాగస్తామసః పరికీర్తితః॥

విధ్యుక్తమైన కర్మను త్యజించకూడదు. ఒకవేళ మోహావశమున దానిని త్యజించినచో ఆ త్యాగము తామస త్యాగము అనిపించుకొనును.

8 దుఃఖమిత్యేవ యత్కర్మ కాయక్లేశభయాత్త్యజేత్।
స కృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్॥

దుఃఖకరమని తలచి శారీరక శ్రమయగునను

భయముతో త్యజింపబడునది రాజసత్యాగమగును. దీనివలన త్యాగఫలము సమకూడదు.

9 కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున।
సఙ్గం త్యక్త్వా ఫలం చైవ స త్యాగః సాత్త్వికో మతః॥

అర్జునా! విధిగా భావించి నిర్ణీత కర్మలను చేయవలెను. కాని మమకారమును ఫలాపేక్షను త్యజించి చేయునట్టి త్యాగము సాత్త్విక త్యాగమని చెప్పబడినది.

10 న ద్వేష్ట్యకుశలం కర్మ కుశలే నానుషజ్జతే।
త్యాగీ సత్త్వసమావిష్టో మేధావీ ఛిన్నసంశయః॥

సంశయ రహితుడు, పరిశుద్ధ భావముకలవాడు, త్యాగి మరియు జ్ఞాని అయినవాడు అసౌకర్యమైన కర్మయని ఒక కర్మను ద్వేషించడు. సుకరమైనదని మరియొక కర్మయందు ఆసక్తిచూపడు.

11 న హి దేహభృతా శక్యం త్యక్తుం కర్మాణ్యశేషతః।
యస్తు కర్మఫలత్యాగీ స త్యాగీత్యభిధీయతే॥

కర్మను పూర్తిగా త్యజించుట శరీరధారికి సాధ్యము

కాదు. అయిననూ కర్మఫలమును త్యజించువాడు త్యాగి యనబడును.

12 అనిష్టమిష్టం మిశ్రం చ త్రివిధం కర్మణః ఫలమ్।
భవత్యత్యాగినాం ప్రేత్య న తు సంన్యాసినాం క్వచిత్॥

త్యాగము చేయని వాని కర్మఫలము కాలాంతరమున (చనిపోయిన తర్వాత) మూడు విధములుగా ఉండును. అశుభము, శుభము, శుభాశుభములు. కాని త్యాగికి (సన్యాసికి) ఇవేవియు ఎన్నడును కలుగవు.

13 పఞ్చైతాని మహాబాహో కారణాని నిబోధ మే।
సాఙ్ఖ్యే కృతాన్తే ప్రోక్తాని సిద్ధయే సర్వకర్మణామ్॥

అర్జునా! కర్మసిద్ధికి సాంఖ్యశాస్త్రములో అయిదు కారణములు చెప్పబడినవి. వాటిని నా వలన వినుము.

14 అధిష్ఠానం తథా కర్తా కరణం చ పృథగ్విధమ్।
వివిధాశ్చ పృథక్చేష్టా దైవం చైవాత్ర పఞ్చమమ్॥

క్షేత్రము, కర్త, వివిధ సాధనములు, పలు విధములగు క్రియలు, దైవము-అనునవి అయిదునూ కారణములు.

15 శరీరవాఙ్మనోభిర్యత్కర్మ ప్రారభతే నరః
న్యాయ్యం వా విపరీతం వా పంచైతే తస్య హేతవః॥

మనోవాక్కాయములతో మానవుడు చేయు కర్మలు

న్యాయ సమ్మతమైనను, అన్యాయమైనను ఈ అయిదును కారణములగుచున్నవి.

16 తత్రైవం సతి కర్తారమాత్మానం కేవలం తు యః।
పశ్యత్యకృతబుద్ధిత్వాన్న స పశ్యతి దుర్మతిః॥

ఇట్లు జరుగుచున్నప్పటికినీ సంస్కారము లేని వాడు, అహంకారముతో తననేకర్తగా భావించుకొనుచున్న అవివేకి ఏమియు తెలిసికొన జాలకున్నాడు.

17 యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే।
హత్వాపి స ఇమాల్లోకాన్న హన్తి న నిబధ్యతే॥

అహంకారము లేనివాడు ఈ జగత్తును సంహరించుచూ కూడా సంహరింపనివాడే యగును. అట్టివాడు ఏ బంధనములలో చిక్కుకొనడు.

వ్యాఖ్య : ఈ శ్లోకమును స్థూలముగా చదివి మానవుడు భ్రమకులోనై అపార్థము చేసికొనవచ్చును. భగవద్గీతలోని చాల శ్లోకములు కల్పిత ఆదర్శములను ఆధారము చేసికొనియున్నవి. వాటికి వాస్తవమైన రూపము ఈ జగత్తులో కనపడదు. రేఖాగణితము (జామెట్రీ)లో కాల్పనిక ఆదర్శములను, రూపములను ఎట్లు ఉపయోగించుకొనుచున్నామో అటులనే ధర్మశాస్త్ర విషయములో కూడా కాల్పనిక ఆదర్శములు అవసరమగుచున్నవి. కనుక ఈ శ్లోకమును ఈ క్రింది విధముగా అన్వయించుకొనవలెను. ఎవని

అహంకారము పూర్తిగా నశించిపోయినదో, ఎవని బుద్ధియందు లేశ మాత్రము కూడా మాలిన్యము లేకుండునో అట్టివాడు ఈ జగత్తును సంహరించిననూ క్షేమమే అని చెప్పవచ్చును. కాని ఎవనియందు అహంకారము ఉండదో వాని శరీరము కూడా లేనట్లేయగును. పరిశుద్ధమైన బుద్ధికలవాడే త్రికాలజ్ఞుడు. అట్టి పురుషుడు ఒక భగవంతుడు మాత్రమే. అతడు కర్మచేయుచునూ కర్మ చేయనివాడే అగుచున్నాడు. జగత్ సంహారము చేయుచున్ననూ అహింసావ్రతుడే. అందుచేత మనుష్య మాత్రుని ధర్మము అహింసయే. అదే శిష్టాచారము. అదే ధర్మ శాస్త్రము.

18 జ్ఞానం జ్ఞేయం పరిజ్ఞాతా త్రివిధా కర్మచోదనా।
కరణం కర్మ కర్తేతి త్రివిధః కర్మసంగ్రహః॥

కర్మ ప్రేరణకు మూడు తత్త్వములు అవసరమైయున్నవి. అవి-జ్ఞానము, జ్ఞేయము, పరిజ్ఞాత, మరియు కర్మ అంగములు త్రివిధములు-అవి-ఇంద్రియములు, క్రియ, కర్తయని తెలిసికొనుము.

వ్యాఖ్య : ఇందు ఆలోచనలు ఆచరణలతో సమన్వయ పరచబడినవి. మొదట మనుష్యుడు కర్తవ్య కర్మ (జ్ఞేయము)ను, తదుపరి దాని విధిని (జ్ఞానము) తెలిసికొని పరిజ్ఞాతయగుచున్నాడు.

ఈ కర్మ ప్రేరణ విధుల తర్వాత ఆతడే ఇంద్రియ

ముల (కరణ సాధనముల) ద్వారా క్రియకు కర్తయగు చున్నాడు. ఇది కర్మ సంగ్రహము.

19 జ్ఞానం కర్మ చ కర్తా చ త్రిధైవ గుణభేదతః।
ప్రోచ్యతే గుణసంఖ్యానే యథావచ్ఛృణు తాన్యపి॥

జ్ఞానము, కర్మ, కర్త - గుణభేదముల ననుసరించి మూడు విధములు. గుణములను ఎంచునపుడు వానిని వర్ణించిన విధమును తెలిసికొనుము.

20 సర్వభూతేషు యేనైకం భావమవ్యయమీక్షతే।
అవిభక్తం విభక్తేషు తత్ జ్ఞానం విద్ధి సాత్త్వికమ్॥

సర్వ భూతములయందు ఒకే నాశరహితమగు భావమును భిన్నత్వములో ఏకత్వమును దర్శించు జ్ఞానమును సాత్త్విక జ్ఞానముగా తెలిసికొనుము.

21 పృథక్త్వేన తు యత్ జ్ఞానం నానాభావాన్పృథగ్విధాన్।
వేత్తి సర్వేషు భూతేషు తత్ జ్ఞానం విద్ధి రాజసమ్॥

వేర్వేరుగా అగుపడుచున్న సర్వభూతములయందు విభక్త భావముతో చూచునట్టి జ్ఞానమును రాజసీ జ్ఞానమని ఎరుగుము.

22 యత్తు కృత్స్నవదేకస్మిన్ కార్యే సక్తమహైతుకమ్।
అతత్త్వార్థవదల్పం చ తత్తామసముదాహృతమ్॥

ఒక కార్యమునందు కారణము లేకుండా సర్వము

గోచరించునట్లుగా చేయునదియును, రహస్య రహితమైనది యును, తుచ్ఛమైనట్టిదియును తామస జ్ఞానమని చెప్పబడు చున్నది.

23 నియతం సఙ్గరహితమరాగద్వేషతః కృతమ్।
అఫలప్రేప్సునా కర్మ యత్తత్సాత్త్వికముచ్యతే॥

ఫలాపేక్ష లేకుండా ఆసక్తి రాగ ద్వేషములను విడచి చేయబడిన నిర్ణీతకర్మ సాత్త్విక మనబడును.
వ్యాఖ్య : శ్లోకములు 3-8 చూడుడు.

24 యత్తు కామేప్సునా కర్మ సాహంకారేణ వా పునః।
క్రియతే బహులాయాసం తద్రాజసముదాహృతమ్॥

అనుభవించవలెనను కోరికతో "నేను చేయుచున్నాను" అను భావముతో ప్రయాసపడి చేయుకర్మ రాజసమని తెలియుము.

25 అనుబన్ధం క్షయం హింసామనపేక్ష్య చ పౌరుషమ్।
మోహాదారభ్యతే కర్మ యత్తత్తామసముచ్యతే॥

పర్యవసానమును దానివలనకలుగు నష్టము, హింస, మరియు తన శక్తిసామర్థ్యములను విచారించకుండా మోహ వశమున ప్రారంభించబడినకర్మ తామస కర్మ యనబడును.

26 ముక్తసంగోఽనహంవాదీ ధృత్యుత్సాహసమన్వితః।
సిద్ధ్యసిద్ధ్యోర్నిర్వికారః కర్తా సాత్త్విక ఉచ్యతే॥

ఫలాపేక్ష రహితుడును అహంకారము లేనట్టివాడు

దృఢత్వము, ఉత్సాహముకలవాడు, జయాపజయముల యందు సుఖదుఃఖములకు లోనుగానివాడు సాత్విక కర్త యనబడును.

27 రాగీ కర్మఫలప్రేప్సుర్లుబ్ధో హింసాత్మకోఽశుచిః।
హర్ష శోకాన్వితః కర్తా రాజసః పరికీర్తితః॥

అనురాగముకలవాడు, కర్మఫలాపేక్షకలవాడు, లోభి, హింసా ప్రవృత్తికలవాడు, పవిత్రత లేనివాడు, హర్షశోకములకు లోనగువాడు రాజసకర్త యనిపించుకొనును.

28 అయుక్తః ప్రాకృతః స్తబ్ధః శఠో నైష్కృతికోఽలసః।
విషాదీ దీర్ఘసూత్రీ చ కర్తా తామస ఉచ్యతే॥

నిలకడలేనివాడు, సంస్కారము లేనివాడు, పొగరుబోతు, వంచకుడు, నీచుడు, సోమరి, శోకస్వభావము కలవాడు, కాలయాపన చేయువాడు తామస కర్తయనబడును.

29 బుద్ధేర్భేదం ధృతేశ్చైవ గుణతస్త్రివిధం శృణు।
ప్రోచ్యమానమశేషేణ పృథక్త్వేన ధనంజయ॥

అర్జునా! గుణముల ననుసరించి బుద్ధియొక్కయు ధైర్యముయొక్కయు భేదము మూడువిధములుగ చెప్పబడినది. దానిని వినుము.

30 ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే।
బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిః సా పార్థ సాత్త్వికీ॥

ప్రవృత్తి, నివృత్తి, కార్యము, అకార్యము, భయము,

నిర్భయము, బంధము, మోక్షముల భేదమును తెలిసికొనునట్టి బుద్ధి సాత్త్వికబుద్ధియనబడును.

31 యయా ధర్మమధర్మం చ కార్యం చాకార్యమేవ చ।
అయథావత్ప్రజానాతి బుద్ధిః సా పార్థ రాజసీ॥

పార్థా! ధర్మాధర్మములను, కార్యాకార్యములను యథార్థమునకు భిన్నముగా గుర్తించుబుద్ధి రాజసబుద్ధి యనబడును.

32 అధర్మం ధర్మమితి యా మన్యతే తమసావృతా।
సర్వార్థాన్విపరీతాంశ్చ బుద్ధిః సా పార్థ తామసీ॥

అర్జునా! ఏబుద్ధి అజ్ఞానముచే ఆవరింపబడినదై అధర్మమును ధర్మముగాను, సకలార్థములను విపరీతముగాను గ్రహించుచున్నదో అది తామసబుద్ధి యనబడును.

33 ధృత్యా యయా ధారయతే మనఃప్రాణేంద్రియక్రియాః।
యోగేనావ్యభిచారిణ్యా ధృతిః సా పార్థ సాత్త్వికీ॥

పార్థా! నిశ్చల యోగముతో కూడిన ఏధృతి మానవుని మన-ప్రాణ-ఇంద్రియముల యొక్క వ్యాపారములను సమబుద్ధితో నిర్వర్తించునటుల చేయుచున్నదో అది సాత్త్విక ధృతి యనబడుచున్నది.

34 యయా తు ధర్మకామార్థాన్ ధృత్యాధారయతేఽర్జున।
ప్రసంగేన ఫలాకాంక్షీ ధృతిః సా పార్థ రాజసీ॥

ఏధృతిచే మానవుడు ఫలాపేక్షతో ధర్మార్థకామము

లను ఆసక్తి పూర్వకముగా నిర్వర్తించుచున్నాడో ఆధృతి రాజసీధృతి యనబడును.

35 యయా స్వప్నం భయం శోకం విషాదం మదమేవ చ।
స విముంచతి దుర్మేధా ధృతిః సా పార్థ తామసీ॥

ఏ ధృతిచే మనుష్యుడు నిద్ర, భయము, దుఃఖము, నిరాశా, మదములను విడవలేకపోవునో అదితామసిక ధృతి యనబడును.

36 సుఖం త్విదానీం త్రివిధం శృణు మే భరతర్షభ।
అభ్యాసాద్రమతే యత్ర దుఃఖాన్తం చ నిగచ్ఛతి॥

37 యత్తదగ్రే విషమివ పరిణామేఽమృతోపమమ్।
తత్సుఖం సాత్త్వికం ప్రోక్తమాత్మబుద్ధిప్రసాదజమ్॥

అర్జునా! మూడు విధములైన సుఖములను గురించి చెప్పెదను-వినుము. దేనిని అభ్యసించుటచే మానవునికి ప్రసన్నత కలుగునో దుఃఖములు నివారింపబడునో అట్టిది సాత్త్విక సుఖమనబడుచున్నది. ఇది ఆరంభమందు విషతుల్య మైనను ఫలితము అమృతతుల్యముగా నుండును. మరియు ఇది ఆత్మజ్ఞానముయొక్క ఆనందముచే కలుగుచున్నది.

38 విషయేంద్రియ సంయోగాద్యత్తదగ్రేఽమృతోపమమ్।
పరిణామే విషమివ తత్సుఖం రాజసం స్మృతమ్॥

ఏ సుఖము విషయముల మరియు ఇంద్రియముల

సంయోగమువలన మొదట అమృతమువలె వుండినను తుదకు విషమువలె పరిణమించునో దానిని రాజస సుఖ మని అందురు.

39 యదగ్రేచానుబంధే చ సుఖం మోహనమాత్మనః।
నిద్రాలస్య ప్రమాదోత్థం తత్తామసముదాహృతమ్॥

ఏ సుఖము ఆరంభమందును పరిణామ మందునూ కూడా ఆత్మను మోహగ్రస్తము కావించునో దానిని తామస సుఖమని యందురు. ఇది నిద్ర, సోమరితనము, భ్రాంతి వలన కలుగుచున్నది.

40 న తదస్తి పృథివ్యాం వా దివి దేవేషు వా పునః।
సత్త్వం ప్రకృతిజైర్ముక్తం యదేభిః స్యాత్త్రిభిర్గుణైః॥

పృథివియందుగాని, స్వర్గములోని దేవతలయందు గాని ప్రకృతి జన్యములగు ఈ త్రిగుణముల నుండి విముక్తి పొందినది ఏదియును లేదు.

41 బ్రాహ్మణక్షత్త్రియవిశాం శూద్రాణాం చ పరంతప।
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవైర్గుణైః॥

అర్జునా! బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులకు కూడా వారి వారి స్వభావజన్య గుణములను బట్టి కర్మలు విభజింప బడినవి.

42 శమో దమస్తపః శౌచం క్షాంతిరార్జవమేవ చ।
జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజమ్।

శమము (అంతరింద్రియ నిగ్రహము) దమము (బహి

రింద్రియ నిగ్రహము) తపస్సు, శౌచము, ఓర్పు, సర
ళత్వము, జ్ఞానముతో కూడిన అనుభవము, ఆస్తిక్య బుద్ధి
ఇవి బ్రాహ్మణులకు స్వభావజన్యమైన కర్మలు.

43 శౌర్యం తేజో ధృతిర్దాక్ష్యం యుద్ధే చాప్యపలాయనమ్।
దానమీశ్వరాభావశ్చ క్షాత్రంకర్మ స్వభావజమ్॥

శౌర్యము, తేజస్సు, ధీరత్వము, దక్షత, యుద్ధము
నందు వెన్ను చూపకుండుట, దానము, సత్పరిపాలనము-
ఇవి క్షత్రియునకు స్వభావ సిద్ధమైన కర్మలు.

44 కృషి గౌరక్ష్య వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజమ్।
పరిచర్యాత్మకం కర్మ శూద్రస్యాపి స్వభావజమ్॥

వ్యవసాయము, గోరక్షణ, వ్యాపారణ-ఇవి వైశ్యు
నకు స్వాభావిక కర్మలు. సేవచేయుట శూద్రునికి స్వభావ
జన్యకర్మలనబడినవి.

45 స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః।
స్వకర్మనిరతః సిద్ధిం యథా విందతి తచ్ఛృణు॥

తమ తమ నిర్దిష్ట కర్మలయందు నిమగ్నులైన మాన
వులు మోక్షమును పొందుదురు. కనుక స్వధర్మాచరణ
చేయువాడు మోక్షమును ఎట్లు పొందునో వినుము.

46 యతః ప్రవృత్తిర్భూతానాం యేన సర్వమిదం తతమ్।
స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః॥

ఎవనివలన ఈ సృష్టి వ్యాపారము జరుగుచున్నదో,

